# చతుర

నవంబరు-2006

రూ. 7/-

Entered

ఎం. వెంకటేశ్వరరావు

నవల

## లిటిల్ లీడర్



# సేతు బంధనం

ఇది ఏ చారిత్రిక కట్టడపు శిథిలావశేషమో, తీరి కూర్చుని ఒక పద్ధతిలో శిలల్ని పేర్చిన ఆకృతో కాదు. ప్రకృతి సిద్ధంగా ఏర్పడిన శిలాబంధనం. ఉత్తర ఐర్లాండ్‌లోని ఆంత్రిమ్ తీర ప్రాంతమంతటా ఈ రాతి మార్గం దర్శనమిస్తుంది. అచ్చంగా మన రాముడు సముద్రంలో నిర్మించిన రాళ్ల వారధి లాగే ఇది కూడా సముద్రంలోకి చొచ్చుకుని ఉంటుంది. దాదాపు అదేమాదిరి జానపద గాథ కూడా ఐరిష్ జానపదుల్లో ప్రచారంలో ఉంది. తీర్చిదిద్దినట్టుగా ఉన్న ఈ రాళ్ల వారధి కొన్నిచోట్ల 20 అడుగుల వరకు ఎత్తు ఉంది. అనేక రాళ్లు షడ్భుజాకారంలో ఉన్నా కొన్ని 4, 5, 8, 10 భుజాలు కూడా కలిగి ఉన్నాయి. ఐదుకోట్ల సంవత్సరాల క్రితం భూపొరల్లోని తీవ్ర కదలికలు అగ్నిపర్వతాల పేలుళ్లకు దారి తీశాయని, అప్పుడు పొంగిన లావా ఘనీభవించి చివరికి ఈ సేతుబంధనంగా రూపు దిద్దుకుందని శాస్త్రవేత్తల ఊహ.



రసరమ్య నవలా వేదిక

# చతుర

సంపుటి : 29 | సంచిక : 10
నవంబరు : 2006 | 346వ సంచిక

ఈ నెల నవల

వాడిపోయే బాల్యాన్ని వీడని దీక్షతో వికసింపచేసుకుని విజేతగా నిలిచిన ఓ నిరుపేద వీధి బాలుడి గాథ.



ఎం. వెంకటేశ్వరరావు

నవల

## లిటిల్ లీడర్

10వ పేజీలో

బొమ్మలు: భాస్కర్

హెల్త్ బిట్స్: వెంకటేశ్వరరావు



# 'ప్రతిభ'కు మారుపేరు 'సహనం'



రాయటానికీ, చదవటానికీ దగ్గరి సంబంధముంది. చాలామంది రచయితలకు కొన్ని నిత్యపారాయణ గ్రంథాలు లేదా తరచు చదివే పుస్తకాలుంటాయి.

"డాన్ క్విక్సాట్, బైబిల్, డికెన్స్ నవలలు, షేక్స్పియర్ నాటకాలు, సానెట్స్, కోన్రాడ్, చెహోవ్, బాల్జాక్, టాల్‌స్టాయ్, గోగోల్‌ల

> పిల్లలు ఎంత సీరియస్‌గా ఆటల్లో తమను తాము మరచిపోతారో మనం అంత సీరియస్‌గా రాయగలగాలి. 'విధ్వంసమే నవసృష్టికి నాంది' అన్న మౌలిక సూత్రం కళాసృజనకు వర్తించదు.
>
> –నీషే

రచనలు, మదాం బావరీ నవల ప్రతి ఏడాదీ నేను చదువుతాను. ఇలాగే మీలోని ప్రతి ఒక్కరూ ఎవరికనువైన లిస్టు వాళ్లు తయారు చేసుకోవాలి. గోళ్లు గిల్లుకుంటూ కూర్చోవటం కన్నా పుస్తకాలు తిరిగెయ్యటం సరదాగా ఉంటుందని పఠనాసక్తి ఉన్న వాళ్లందరూ అంగీకరిస్తారు" అంటూ వర్జీనియా యూనివర్సిటీలో చదివే సాహిత్య విద్యార్థులకు సలహా ఇచ్చాడు విలియం ఫాక్నర్.

"రచన అంటేనే ఏకాంత జీవితం. అయితే అది ఒంటరితనం కాదు. పాత్రలు అతడికి ఊపిరి సలపనిస్తే గద..." నిజమే. క్షణం విరామమీయని అమీనాలు,అరుణలు చలంగారి నెంత ఇబ్బంది పెట్టారో మనకూ తెలుసు.

'రచనకు' 'ప్రతిభ' తప్పనిసరి అని ఒక అభిప్రాయం ఉంది. నా మాట నమ్మండి. అలాంటిదెక్కడా ఉండదు. ఔత్సాహికులకు అడ్డుకట్ట వెయ్యటానికి ఎవడో తుంటరి సృష్టించిన మాయమాట అది. లేదా 'ప్రతిభ'కు మారు పేరు 'సహనం' అని అందరం గ్రహించాలి. 'సాధనమున పనులు సమకూరు'.

* * *

విషయావగాహనకు అవసరమనుకున్నప్పుడు కథలు కూడా చెప్పుకున్నాం. చివరిగా, అనివార్యంగా మరో కథ.

అమెరికాలో "క్రియేటివ్ రైటింగ్" క్లాసులకు మంచి గిరాకీ ఉంటుంది. పెద్ద మొత్తంలో ఫీజులు చెల్లించి డజన్లకొద్దీ ఔత్సాహికులు రిజిష్టర్ చేయించుకుంటారు.

సాహిత్యపు లోతుపాతులు తెలిసిన ఒక టీచర్ కథల సృష్టిక్రమం ఎంతో శ్రద్ధగా,

సోదాహరణంగా బోధిస్తాడు. ప్రపంచ సాహిత్యంలోని అగ్రగణ్యుల కథల్ని వివరించి, విశ్లేషించి, "విలువలు దిగజారిపోతున్నాయి. కొన్ని చెహోవ్, మపాసా, కిప్లింగ్‌ల కథల్ని కూడా ఈనాటి పత్రికలు ప్రచురించకపోవచ్చు. అంత మాత్రం చేత అవన్నీ అద్భుత రచనలు కావనగలమా? " అంటూ వాపోతాడు.

"రచయిత తన సమస్యలను ఏకరువు పెట్టుకోవటం ఎవరూ హర్షించరు. అంత ఇబ్బందిగా ఉంటే రాయటమెందుకు? ఎవరి కోసం? ఎవర్రియమన్నారసలు"

– ఆల్బర్ట్ కామూ



విద్యార్థుల్లో నేర్చుకోవాలనే ఉత్సాహం ఉంది. ఎంతో కొంత నేర్చుకోలేదనీ కాదు. కాని వాళ్ల అవసరాలు వేరు. "క్లాసిక్స్" ఎలా ఉంటే ఎవడిక్కావాలి?

"సార్, పత్రికా సంపాదకులకేం కావాలో, వాళ్లకు నచ్చేటట్టు ఎలా రాయాలో నేర్పించండి చాలు. సాహిత్య మర్మాలు తెలుసుకోవటం వల్ల మాకేం లాభం? " అంటూ తిరిగి ప్రశ్నిస్తారు.

ఆ ప్రశ్నలో ఎంతో ఆవేదన ఉంది. అమాయకత్వమూ ఉంది. అయితే దాని జవాబు "కథా రచన"కు సంబంధించినది మాత్రం కాదని మనకు తెలుసు.

* * *

ఎంత చదివినా సందేహాలెప్పుడూ తీరవు. ఆచరణ మాత్రమే కొన్నింటిని తీర్చి మరికొన్నింటిని సృష్టిస్తుంది. ✦

**ఈ శీర్షిక ఇంతటితో సమాప్తం**

– ముక్తవరం పార్థసారథి



# కాలాతీతం




# ఆలిస్ అడ్వెంచర్స్ ఇన్ వండర్ ల్యాండ్

లూయిస్ కరోల్ సృజియించిన అద్భుత రచన 'ఆలిస్ అడ్వెంచర్స్ ఇన్ వండర్ లాండ్'. బాలసాహిత్యంలో పరితలను ఇంతగా అలరించిన పుస్తకం మరొకటి లేదు. ప్రచురితమైన రెండేళ్లకే అన్ని పాశ్చాత్య భాష ల్లోకీ అనువదించబడింది.

ఆలిస్ సాహసకృత్యాలు ఇందులోని ఇతివృత్తం. ఈ సాహసకృత్యాలన్నీ స్వప్న లోకంలో సాగుతాయి. అంటే, ఇది కలలో జరిగిన కథ. ఇక ఇతివృత్తం విషయానికి వస్తే...

ఆలిస్ ఒకరోజు చెల్లెలితో కలిసి ఆడుకోవ టానికి వెళుతుంది. కాలవగట్టు మీద పరిగెత్తు తారిద్దరూ. మిట్టమధ్యాహ్నం. ఎండగా ఉండ టంతో చెట్టుకిందకి చేరతారు. ఆలిస్‌కు కథలు చదవాలనిపిస్తుంది. పుస్తకం తీసుకుంటుంది. కాని అందులో బొమ్మలుండవు. బొమ్మల్లేని పుస్తకం ఎవరైనా ఎలా చదువుతారు! ఏం చేయాలో తోచలేదు. నిద్ర ముంచుకొస్తుంది. అంతలో, కలుగులోకి దూరుతున్న ఎర్రకళ్ల తెల్లకుందేలు కనిపిస్తుంది. దాని వెంట పరిగె త్తుతుంది ఆలిస్. లోపల ఆ కలుగు ఎంత పొడుగ్గా ఉందో! కాళ్లు నొప్పులు పుట్టాయి. శోష వస్తుంది. అప్పుడు ఎదురుగా ఒక విశా లమైన హాలు కనిపిస్తుంది. అందులో అనేక ద్వారాలు. అన్నింటికీ తాళం వేశారు. టేబుల్ మీద కనిపించిన బంగారు తాళం చెవితో ఒక తలుపు తెరుస్తుంది ఆలిస్. లోపల మరొకదారి. ఆ చివరన అందమైన ఉద్యానవనం. కాని అక్కడికి చేరు కోవాలంటే మరొక చిన్న తలుపుగుండా వెళ్లాలి. టేబుల్ మీద "డ్రింక్ మి" అని కాగితం అంటించిన సీసా ఒకటి కనిపిస్తుంది. అందులో వున్న డ్రింక్ తాగగానే ఆలిస్‌కు సూక్ష్మ రూపం వస్తుంది. మరి అంత చిన్న శరీరంతో టేబుల్ మీదున్న తాళం చెవి ఎలా అందుకోగలదు? టేబుల్ కింద "ఈట్ మి" అని రాసున్న 'ది కేక్' ఒకటి కనిపిస్తుంది. అది తినగానే ఆలిస్ రూపం మళ్లీ మారింది. "వండర్ ల్యాండ్"లో ప్రయాణించినంతసేపూ, ఈ 'డ్రింక్', 'కేక్' ఆమెకు అనేకసార్లు సాయం చేస్తాయి.

ఈ కథలోని మరో ప్రత్యేకత ఆలిస్ స్వగతాలు. తన వింత అనుభవాల గురించి, అమాయకంగా, ఆ రోజుల్లో ప్రాచుర్యం పొందిన గేయాలకు పేరడీలుగా పాడుతుంది. వీటిని



ఆనందించాలంటే ఇంగ్లిషులో పుస్తకం చదవటం తప్ప మరో మార్గం లేదు.

తన ఇక్కట్లను తలచుకుని వెక్కి వెక్కి ఏడుస్తుంది ఆలిస్. మరి కాసేపట్లో తన కన్నీళ్లలో ఈదుతుంది. అప్పుడుగాని గ్రహించదు- తన శరీరం సైజు మారిందని. ఆలాగే తెల్ల కుందేలు ఇంటికెళ్ళినప్పుడు అక్కడ బాటిల్‌లో ఉన్న ద్రావకం తాగగానే ఆ గదిలో పట్టలేనంత పెద్దదవుతుంది చిన్ని ఆలిస్. మరోసారి ఆలిస్ పొగ గొట్టంలో చిక్కుకుపోతుంది. కుందేలూ, దాని తోటమాలీ ఎంత ప్రయత్నించినా ఆ పిల్లను బైటికి లాగలేరు. చివరికి బిల్ అనబడే బల్లి వచ్చి రక్షిస్తుంది. సైజు తగ్గిన ఆలిస్ అడవిలోకి పారిపోతుంది. అక్కడ పుట్టగొడుగు మీద హుక్కా పీలుస్తున్న గొంగళి పురుగు కనిపిస్తుంది. ఆలిస్ మళ్లీ పేరడీలు పాడుతుంది. గొంగళి పురుగు సలహాతో పుట్టగొడుగు ముక్కల్ని సేకరిస్తుంది. కేకు, ద్రావకాల అవసరం లేకుండా ఆ ముక్కల శక్తితో తను సైజులు మార్చుకోవచ్చునని తెలుసుకుంటుంది.

తన సాహస యాత్రల్లో, డచెస్ భవనంలోకి దూసుకుపోతుంది ఆలిస్. ఎదురుగా పాపాయిని ముద్దు చేస్తున్న డచెస్ కనిపిస్తుంది. వంటవాడు మిరియాల పొడి చల్లుతున్నాడు. పిల్లి (చెషైర్ కాట్) గుర్రు గుర్రుమంటూ కాళ్ల దగ్గిర కూర్చున్నది. తను ముట్టుకోగానే పందిగా మారిపోతుంది పాపాయి. ఆమెకు కుందేలు యింటికి దారి చూపిస్తుంది పిల్లి. అక్కడ హాటర్, డోర్ మౌస్‌లతో టీ పార్టీ జరుగుతుంటుంది. ఆలిస్ తిరిగి హాల్లోకి ప్రవేశించి, తలుపు తెరుచుకుని (ఈసారి ఏ అడ్డూ లేదు) అందమైన తోటలోకి ప్రవేశిస్తుంది.

ఆ తోటలో ఉన్న వాళ్లందరూ పేక ముక్కలు. తోటమాలి పని చేస్తున్న ముగ్గురు- ఇస్పేటు రెండు, అయిదు, ఏడు- చెట్టు మీది తెల్ల గులాబీలకు ఎరుపు రంగు వేస్తుంటారు. ఆటీన్, రాజు, రాణిలతో ఒక పెద్ద



ఆడుతూ, పాడుతూ ఆనందించాల్సిన ఈ కథ గురించి, ఇరవయ్యో శతాబ్ది సాహితీ విమర్శకులు అనేక పరిశోధనలు చేశారు. 1928లో డాక్టర్ మార్క్ ఎడ్మండ్ జోన్స్, ఈ పుస్తకంలోని ఇరవై నాలుగు అధ్యాయాల గురించీ సుదీర్ఘమైన వ్యాఖ్యానాలు ప్రచురించాడు. కథలో వచ్చిన ప్రతి మాట-లుకింగ్ గ్లాస్ హౌజ్, తోటలోని పువ్వులు, కీటకాలు, హంప్టీ, డంప్టీ జాబర్ వాకీ, మాక్ టర్టుల వెనక ప్రతీకాత్మకత ఉందనీ, వాటికి తాత్వికార్థాలు ఉన్నాయనీ ఒక చర్చ లేవదీశాడు. అంతే కాదు, ఈ కథ చెప్పటంలో రచయిత, ప్రాథమిక ప్రయోజనం ప్రచురణ కాదు. అందువల్ల తనకూ, ఆలిస్ (తన మిత్రుని కూతురు)కు మాత్రమే అర్థమయ్యే కొన్ని సంకేతాలు గూడా చొప్పించాడని మరొక సిద్ధాంతం ఉంది. ఈ పండిత చర్చలన్నీ అకడమీషియన్ల ఉబుసుపోకకు.

ఊరేగింపు అటుగా వస్తుంది. ఆ దుష్టరాణి ఎదుట కనిపించిన వాళ్లందరికీ, శిరచ్ఛేదం చెయ్యాలని ఆజ్ఞాపిస్తుంది. ఆలిస్ ఎదిరిస్తుంది. రాణి ఆమెను క్రికెట్ ఆట (బంతులు, బ్యాట్‌లతో తోటలో ఆడే ఆట)కు ఛాలెంజ్ చేస్తుంది. హెడ్జ్ హాగ్స్ (ముళ్ళ పందిలాంటి జంతువు. ఆత్మ రక్షణ కోసం బంతిలా చుట్టుకు పోతుంది) బంతులుగా, ఫ్లెమింగో పక్షులు (ఎరుపు రంగు కొంగలు) బ్యాట్స్‌గా ఆడాలి. చెషైర్ కాట్‌ను వెంట పెట్టుకుని డచెస్ మళ్లీ ప్రత్యక్షమై మాక్ టర్టల్ కథ వినిపిస్తుంది. ఇదే అదనుగా బోలెడన్ని పేరడీలు పాడుకుంటారందరూ. మిఠాయి దొంగిలించినందుకు

## లూయిస్ కరోల్ (1832-1898)



రెవరెండ్ చార్ల్స్ లట్‌విడ్జ్ డాడ్గసన్ గణిత శాస్త్రాధ్యాపకుడిగా ఆక్స్‌ఫర్డ్‌లో చాలా కాలం పని చేశాడు. ఆజన్మ బ్రహ్మచారి. యూక్లిడ్ సూత్రాల గురించీ, తర్కశాస్త్రాన్ని గురించీ ప్రామాణిక గ్రంథాలు రాశాడు. అయితే ఈనాటికీ అతని కీర్తి చిరస్థాయిగా ఉండటానికి కారణం మాత్రం లూయిస్ కరోల్ పేరుతో అతడు ప్రచురించిన బాల సాహిత్యం 'ఆలిస్ అడ్వెంచర్స్ ఇన్ వండర్ ల్యాండ్'. ఈ కథ తెలియని ఇంగ్లిష్ బాలబాలికలుండరంటే అతిశయోక్తి కాదు.

ఇంగ్లండ్‌లోని డేర్స్‌బరీలో జనవరి 27న జన్మించాడు డాడ్గసన్. పదకొండు మంది సంతానంలో అందరికన్నా పెద్దవాడు. డాడ్గసన్‌కు చిన్నప్పుడు కూడా తోటి పిల్లలతో ఆడుకోవటం గిట్టేది కాదు. ఒంటరి. అయినా చెల్లెళ్ళంటే మాత్రం మహా ప్రేమ. వాళ్ళకెప్పుడూ ఏవో కథలు చెప్పి మురిపిస్తుండేవాడు. బహుశా ఆ క్రమంలోనే అతడికి "ఫాంటసీ" లల్లటం పట్టుబడింది.

చుట్టూ ఆడపిల్లలు కూర్చుంటే తనను తాను మరచిపోయేవాడు. పెద్ద వాళ్లతో, సమ వయస్కులతో గడపటం అస్సలు ఇష్టం లేదు. బాలలకు కథలు చెప్పటంతో స్వంత, స్వాప్నిక లోకాన్ని ఆవిష్కరించుకున్నాడు. డాడ్గసన్ కలుపుగోలుగా ఉండక పోవటానికి మరో ముఖ్య కారణం, జీవితాంతం అతణ్ణి వదలని 'నత్తి'. నోరు తెరిస్తే అందరూ నవ్వటమే గాని, ఏం చెబుతున్నాడో తెలుసుకోవాలని ఎవరికీ ఉండేది కాదు. డాడ్గసన్‌కు చిత్రలేఖనమన్నా చాలా ఇష్టం. ఖాళీగా ఉన్నప్పుడల్లా బొమ్మలు వేస్తూ గడిపేవాడు. దీనికితోడు నాటకాల పట్ల కూడా అభిరుచి పెరిగింది. కవిత్వం- ముఖ్యంగా హాస్య కవిత్వం రాయటం అతడి హాబీ. అన్నింటినీ మించి, ఫొటోగ్రఫీ అంటే ప్రాణం. చిన్న పిల్లల ఫొటోగ్రాఫర్‌గా డాడ్గసన్‌కు గుర్తింపు వచ్చింది.

1855లో క్రైస్ట్ చర్చ్‌కు కొత్త డీన్‌గా డాక్టర్ లిడ్డెరల్ బాధ్యతలు స్వీకరించాడు. ఆయనకు నలుగురు పిల్లలు. ఒక కుర్రాడు హారీ, మిగతా ముగ్గురు ఆడ పిల్లలు- లోరినా, ఆలిస్, ఎడిత్. వాళ్ళను ఫొటో తియ్యాలని డాడ్గసన్

---

నేవ్ (అతి తక్కువ సంఖ్య గల కార్డు) ఆఫ్ ఆలిస్ మీద విచారణ జరుగుతుంది. ఆలిస్‌కు తన సహజ రూపం వస్తుంది. "మీరు పేకాట ముక్కలు" అంటూ అందర్నీ గేలి చేస్తుంది. చివరికి మొహం మీద ఆకులు రాలటంతో మెలకువ వస్తుంది.

చిత్ర విచిత్రమైన మలుపులతో సాగే ఈ కథ పాఠకులను ఆద్యంతం ఆకట్టుకుంటుందనటంలో సందేహం లేదు. అయితే, తరువాతి కథ "త్రూ ది లుకింగ్ గ్లాస్" మరింత అనూహ్యమైన కథనంతో ఆకర్షిస్తుంది.

చదరంగం ఆట ఇందులోని ముఖ్యాంశం. ఆలిస్ ఒక బంటు. ఎనిమిదో నంబరు గడి చేరుకోగలిగితే రాణిగా మారుతుంది. ప్రతి గడిలో ఒక అనుకోని సంఘటన జరుగుతుంది. కొత్త కొత్త జంతువులు, కీటకాలు సమస్యలు సృష్టించి, పాటలు పాడి కథ రక్తి కట్టిస్తాయి. ముఖ్యంగా కొన్ని- ట్వీడిల్‌డమ్, ట్వీడిల్ డీడీ, హంప్టీ డంప్టీ, వైట్ నైట్‌ల పేర్లు వినని వారుండరు. ఇవన్నీ ప్రజల నుడికారంలో ఒక భాగం. అనేక భిన్న సందర్భాలలో, భిన్నార్థాలలో వీడిని వాడటం ఇంగ్లిషు పాఠకులందరికీ సుపరిచితమే.

తను ఇదివరలో రాసి పెట్టుకున్న పిచ్చి పద్యాలను (నాన్సెన్స్ వెర్స్) కేవలం సరదా కోసం, నవ్వులకోసం కరోల్ ఇందులో అనేక

కోరిక. కాని ఎందుకో ఆ పిల్లల తల్లికి ఇతడి ప్రయత్నం నచ్చలేదు. మొత్తంమీద పిల్లలతో దోస్తీ కట్టి తుంటరి పాటలతో వాళ్ళను నవ్వించాడు. తరువాత అవన్నీ 'కాలేజ్ రైమ్స్' అనబడే ఆక్స్‌ఫర్డ్ పత్రికలో ప్రచురిత మయ్యాయి.

బాల సాహిత్యంలో అతి ముఖ్యమైన రోజు జూలై 4, 1862. ఆ రోజు ముగ్గురు ఆడపి ల్లల్నీ వెంట పెట్టుకు వచ్చిన ఆయా (గవ ర్నెస్) మరో క్లెర్జీమాన్ రాబిన్సన్ డక్‌వర్త్‌నూ, డాడ్గ్‌సన్‌నూ బోటు షికారుకు ఆహ్వానిం చింది. 'ఆలిస్' కథకు ప్రారంభం అది. బోటు లో విన్న కథను, "మళ్లీ మళ్లీ చదువుకోవాల నిపిస్తున్నది. రాసివ్వమని" అడిగింది ఆలిస్. రాత్రంతా కూర్చుని తొలి ప్రతి తయారు చేశాడు డాడ్గ్‌సన్. నవంబర్ 1862లో ఆలిస్ తారసపడి తన కథ గురించి అడిగింది. అప్ప టికప్పుడు దాన్ని తిరగరాసి, బొమ్మలు వేసి- అవి నచ్చకపోతే 'పంచ్' పత్రిక ఆర్టిస్ట్ జాన్ టెనియల్‌తో మళ్లీ వేయించి ప్రచురించాడు డాడ్గ్‌సన్. 'ఆలిస్' తొలి ముద్రణ జూలై 1865లో జరిగింది.

ఈ కథకు పెట్టిన మొదటి పేరు 'ఆలిస్ అడ్వెంచర్స్ అండర్ గ్రౌండ్' గంభీరంగా ఉందని, 'ఆలిస్ అడ్వెంచర్స్ ఇన్ వండర్ ల్యాండ్'గా మార్చాడు. రచయిత పేరు కూడా నచ్చలేదు. ఫలితంగా 'లూయిస్ కరోల్' అన బడే కలం పేరు తరతరాల పాఠకులకు సుప రిచితమైంది. డాడ్గ్‌సన్ ఎంత ప్రయత్నించినా, 'ఆలిస్' లాంటి మరో పుస్తకం రాయలేకపో యాడు. కొత్త పాత్రలు, కొత్త అడ్వెంచర్స్‌తో 1889లో సిల్వీ అండ్ బ్రూనో ప్రచురించాడు. అప్పటికే రచయితకు అశేషమైన ఖ్యాతి ఉన్నా, ఆ పుస్తకం మాత్రం అమ్ముడుపోలేదు. బాల సాహిత్యం రాస్తున్నాననుకుని డాడ్గ్‌సన్ 'ది హంటింగ్ ఆఫ్ ది స్నార్క్' అనబడే హాస్య రస ప్రధాన కావ్యం 1876లో రాశాడు. ఇది పిల్లల కన్నా పెద్దల్నే ఎక్కువ అలరించింది. బ్రిటన్, అమెరికాలలో ఇప్పటికీ అచ్చవుతూనే వుంది.

అవివాహితుడుగా ఉన్నందువల్ల జీవితంలో పోగొట్టుకున్న పిల్లల ప్రేమను పొందటానికే డాడ్గ్‌సన్ బాలసాహిత్యం సృష్టించాడంటారు విమర్శకులు. వయసు మీద పడిన తర్వాత ఎలెన్ టెర్రీ అనే నటిని ఇష్టపడ్డాడు. కాని అప్పటికే ఆమెకు పెళ్లైంది. డాడ్గ్‌సన్ అరవై ఆరవ ఏట జనవరి 14న బ్రాంకైటిస్ వ్యాధితో మరణించాడు.

చోట్ల ఉపయోగించాడు. వాటిలో "జాబర్ వాకీ" అనబడే గేయం పిల్లలందరికీ కంఠస్తం- ఇందులో పాత్రలు వాడిన అర్థం లేని మాటలు, తరువాతి సంవత్సరాల్లో ఇంగ్లిష డిక్షనరీలో ప్రామాణిక పదాలుగా చేరాయి. ఈ రెండవ కథలో ఆలిస్ తప్ప మిగతా పాత్రలన్నీ తమ తమ స్థానాలు మార్చుకుం టాయి. ఇందులోని గేయాలు, ఇంగ్లిష కిండర్ గార్టెన్ పిల్లలు రోజూ పాడుకునే 'రైమ్స్'గా నేటికీ నిత్య నూతనంగా ఉన్నాయి.

ఈ కథ చివరన ఇరవై యొక్క పంక్తుల గేయం ఒకటుంటుంది. పంక్తుల మొదటి అక్షరాలన్నీ కలిపి చదివితే Alice Pleas - ance Kiddel అవుతుంది. రచయిత తన పుస్తకాన్ని అంకితమిచ్చిన పద్ధతి అది.

ఆలిస్ ఎనిమిదవ గడికి చేరుకోవటానికి పాఠకులు చదరంగం నిజంగా ఆడి ఆమెకు సహాయం చెయ్యవచ్చు. తెలుపు, ఎరుపు (ఆ రోజుల్లో నలుపుకు బదులుగా ఈ రంగు వాడారు.) పావులతో పదకొండు ఎత్తుల్లో ఆట ముగించాలి. ఇందుకోసం, పుస్తకంలోని కథాంశం ఆధారంగా ఆయా పేజీల్లో ఉన్న ఆలిస్ కదలికలు గుర్తించి పావులు కదపాలి.

తరతరాలుగా బాలల్ని అమితంగా అలరిస్తు న్న ఈ కథ చదివి ఆలిస్‌తో పాటు మనమూ స్వప్నలోకంలో విహరిద్దాం రండి!

**-ఎం. వసంత**

"బాల్యం తెలిమీగడ తరక! అది వెండి వెన్నెల మరక" అన్నారో కవయిత్రి. కానీ అది కొందరికే వర్తిస్తుంది. బాల్యం కొందరికి మధుర స్మృతిగా మిగిలిపోతే మరికొందరికి చేదు జ్ఞాపకంగానే నిలిచిపోతుంది. దుర్వ్యసనాలకు లోనైన తండ్రులు ఇంటిని నరకప్రాయంగా మారుస్తుంటే భయంతో బిక్కుబిక్కుమంటూ, బెదురు చూపులు చూస్తూ గడిపే బాల్యం కొందరిది... బాధ్యత పైబడగా రెక్కలు ముక్కలు చేసుకుని తమను పోషిస్తున్న కన్నతల్లికి తనేం చేసి సహాయపడదామా అనే జాలి చూపుల బాల్యం ఇంకొందరిది... తల్లెవరో, తండ్రెవరో తెలియక కుప్పతొట్లలో, ముళ్ళ కంచెలలో కన్నువిప్పిన అభాగ్యులు మరికొందరు... కూడు లేక, గూడు లేక, గుడ్డలు లేక ఆత్మీయతలకూ, ప్రేమానురాగాలకూ అర్థాలు తెలియని నిస్సహాయులు ఇంకొందరు... వీధినపడి బిచ్చగాళ్ళుగా, కూలీలుగా, గూండాలుగా రాటుదేలి సమాజానికి చిక్కుప్రశ్నగా మారిన వేళ!..... ఆ మట్టిలో నుండే వెలువడిన ఓ మాణిక్యం వంటి కుర్రవాడు తన జీవితం బాగుచేసుకోవటమే గాక తన తోటివారికీ వెలుగుబాట వేసిన వైనానికి అక్షరరూపం కల్పించిన ఎం. వెంకటేశ్వరరావు నవల 'లిటిల్ లీడర్' ఈ నెల 'చతుర' సమర్పణ.

ఎం. వెంకటేశ్వరరావు



తిరుపతికి సమీపంలో ఉన్న పాకాల పక్క ఊరు వజ్రోరిపల్లి అది. అక్కడ ఓ ఇంగ్లిషు కాన్వెంట్.

ఏడో తరగతి టీచరు క్లాసులోకొస్తూనే "ఒరేయ్ శీనూ! నువ్వింకా ఫీజు కట్టలేదా? " అనడిగాడు. శీను లేచి నిలబడి తలొంచుకు న్నాడు.

"ఫీజు చెల్లించకపోతే ఎగ్జామ్సు రాయని య్యొద్దన్నారు హెడ్మాస్టరు"

"...."

"మాట్లాడవేరా!" కాస్త స్వరం పెంచి అడిగాడు టీచరు.

"మాయమ్మతో చెప్పానండి కడ్తానంది" అన్నాడు భయంగా.

"చెప్పటం కాదు. నువ్వెళ్ళి మీ అమ్మని తీసుకురా"

పుస్తకాలు చూడమని పక్క పిల్లాడికి చెప్పి, పరుగెత్తుకుంటూ ఇంటికెళ్ళి పది నిమిషాల తర్వాత తిరిగొచ్చాడు.

"మాయమ్మ కూలి కెళ్ళిందండి. రేపు తోడ్కొస్త"

"క్లాసు ఫస్టు వచ్చేవాడివి. ఫీజు కోసం పరీక్షలు రాయకుండా ఉండకు. మీ అమ్మకి చెప్పి రేపు తప్పకుండా ఫీజు కట్టేయ్" అని పాఠం మొదలెట్టాడు టీచర్.

కూలి పనికెళ్ళి సాయంత్రం ఇంటికొచ్చిన గౌరమ్మ ముభావంగా కూచున్న శీను దగ్గర కొచ్చి, చేతిలో ఉన్న మామిడి పండిచ్చింది. ఏం మాట్లాడకుండా అందుకున్నాడు. వాడెందుకు ముభావంగా ఉన్నాడో ఆమెకు అర్థం కాలేదు.

"మీ నాయనొచ్చినాడా? " అడిగింది.

"తెలీదు" అన్నాడు తల పక్కకు తిప్పుకుని.

"ఒరోరి... ఏంర్రా కొండా... కోపంగా ఉండావు" అంటూ వంగి వాణ్ణి దగ్గరకు తీసుకుంది ప్రేమగా.

"బళ్ళో ఫీజు కట్టకుండా ఎల్లమంటే నేనెల్లను. రేపు పరీక్ష ఫీజు కట్టకుంటే రావొద్దన్నారు" తల్లిని విదిలించుకుంటూ అన్నాడు శీను.

"రేపు కడ్తవు కొండా! ఇస్కూలు నుంచొచ్చి ఏదైనా తిన్నవా, లేదా? "

"ఉహూ!..." తినలేదన్నట్టు తల అడ్డంగా తిప్పాడు.

"లచ్చిమీ! లచ్చిమీ! ఏడ సచ్చినావే? " అంది గౌరమ్మ కూతుర్ని పిలుస్తూ.

"అమ్మా! ఇక్కడ" అంది లక్ష్మి కట్టెల పొయ్యి ఊది, ఊది ఎర్రబడ్డ కళ్ళెంట కార్తున్న నీళ్ళు తుడుచుకుంటూ.

"నేను ఇంట్ల లేకుంటే బళ్ళో నుంచొచ్చి నోడికి ఇంత అన్నం పెట్ట గూడ్దంటే"

"నాయనొచ్చి తినెల్లిపోయినాడు. శీనొచ్చే సరికి సట్టిలో అన్నం లేదు. కాసిన్నాక లుంటే పొయ్యి మీదెట్టిన"

కూతురి అవతారం చూసి గౌరమ్మ మనసు చివుక్కుమంది.

"సర్లే, నువ్వురా! నే ఉడకేస్త" అని పొయ్యి దగ్గర కెళ్ళింది.

పొయ్యి ఊది మంట పెద్దది చేసి, దొడ్లో కుండలో ఉన్న నీళ్ళతో కాళ్ళూ, చేతులూ కడుక్కుంటుంటే శీను వెనకాలగా వచ్చి నిలబడ్డాడు.

"అమ్మా! చివరి పరీక్షే. ఫీజు కట్టకపోతే రాయనియ్యరంట, రేపు తప్పకుండా డబ్బు లియ్యమ్మ" అన్నాడు తల్లి కొంగు పట్టుకుని.

"ఎంత గట్టాల్నంట? " చెంగు విడిపించుకుని ముఖం తడుచుకుంటూ అడిగింది.

"రెండొందలు"

"సర్లే.. రేపు గడ్త... నువ్వియ్యాల బాగా సదూకో. పరీచ్చ బాగా రాసి ఫస్టు రావాల" అంది కొడుకును దగ్గరకి తీసుకుని.

అప్పుడే లక్ష్మి రోట్లో పచ్చడి నూరటానికి వచ్చింది. లంగా పైకి దోపుకుని, బండతో పచ్చడి నూరుతుంటే, ఆ శబ్దానికి తల తిప్పిన గౌరమ్మ కళ్ళకి, కూతురు బతుకు రోట్లో వేసి నూరుతున్నట్లనిపించింది.

లక్ష్మి శీను కంటే రెండేళ్ళు పెద్దది. నాల్గో

తరగతి చదువుతుంటే... చదివించే శక్తి లేక స్కూలు మాన్పించి తనతో కూలిపనికి తీసుకెళ్తోంది. కొడుకుని మాత్రం కూలీ డబ్బుల్తో ఇంగ్లిషు కాన్వెంట్లో చదివిస్తోంది. ఏంటో ఈ తేడా? ఆలోచిస్తూనే... పొయ్యి మీద అన్నం దింపి గంజొంచింది గౌరమ్మ.

లక్ష్మి పచ్చడి నూరుతూనే ఉంది. శీను పుస్తకాలు తెచ్చుకుని చదువుతున్నాడు. మళ్ళీ కొడుకుని, కూతుర్ని చూసింది గౌరమ్మ. ఆమె హృదయం ఆవేదనతో మూలిగింది. పుస్తకాలు పట్టుకుని చదువుకో వాల్సిన కూతురి చేతిలో రోకలిబండ చూసి, లక్ష్మి చేతిలో ఉండాల్సిన పుస్తకాలు బలవం తంగా లాక్కుని రోట్లో వేసి, దానితోనే దంచేలా చేస్తున్నట్టన్పించింది.

"ప్చ్... ఏంటో, ఎదవ బతుకులు" అను కుని నిట్టూర్చింది.

అంతకంటే తనేం చెయ్యగలదు, భర్తకు బాధ్యత లేనప్పుడు.

హుఁ భర్త. అందరి బతుకులు బండలు చేస్తున్న భర్త... అనుకుంది.

అలా అనుకుందో లేదో, వెనకనుంచి "గౌరమ్మా! గౌరీ! ఎంత సేపయిందే నువ్వొచ్చి" సారా మత్తు తలకెక్కి తడబడే మాటలతో అడిగాడు తూలుకుంటూ వచ్చిన సాంబయ్య.

"నాతో నీకు పనేంది... పొయ్యి ఆ సారా కొట్టుకాడ సావు" విసుక్కుంది భర్తని.

"ఏం... దే...నోరు లేస్తావుంది?" అంటూ గౌరమ్మ పక్కకొచ్చి "ఓ యాబ య్యుంటే ఇయ్యే... పనుండాది" అని పొయ్యి దగ్గర కూచున్నాడు.

"నాదేర ఏడున్నయ్యయ్యా. ఇల్లెల్లటమే కష్టంగా ఉంటే. పోయ్యా... పో, లెవ్వు"

"నీ యెమ్మ,కూలికెళ్లిన డబ్బు లేంజేసి నావే"

"ఇయ్యాల్టి కూలీ డబ్బు, రేపిస్తానన్నాడు"

"అబద్ధం"

"సత్తె పెమాణం, నీ మీదొట్టు" అని లేచి లోపలికెళ్ళింది గౌరమ్మ.

## రచయిత పరిచయం

ఎం. వెంకటేశ్వరరావు రైల్వే ఉద్యోగి. రచనా వ్యాసంగం, పెయింటింగ్ ఆయన ప్రవృత్తులు. తొలి కథ 'మౌనం' స్వాతి వారపత్రికలో ప్రచు రితమయింది. దరిమిలా ముప్ఫయి రెండు కథలు, మూడు నవలికలు, రెండు పదుల కవితలు రాశారు. ఆంధ్రభూమి దినపత్రిక ఉగాది నవ లల పోటీల్లో ప్రేమ కోసం నవలకు ప్రోత్సాహక బహుమతి లభించింది. ఈ 'లిటిల్ లీడర్' నవల ఆయన నాలుగో నవల. కథ, కవిత, నవల – ఏదైనా సహజంగా, సమాజానికి దర్పణంగా ఉండాలన్నది వెంకటే శ్వరరావు తపన.

**ఎం.వెంకటేశ్వరరావు**
'రామ్‌చరణ్' బి–19/304
సాయి శ్రీనివాస అపార్ట్‌మెంట్స్
అల్వాల్, సికింద్రాబాద్ – 15

మధ్యాహ్నం తాగిన సారా మత్తు దిగు తున్న కొద్దీ, కోపం పెరుగుతోంది సాంబ య్యకి. చేతిలో డబ్బుల్లేవు. తూలుతూ లేచి కూతురు దగ్గరకెళ్ళి,

"బంగారం... నువ్వన్నా ఇయ్యే, నాలిక పీకుతుండాది. మా తల్లివి గదూ"

"నాదేర ఏడున్నయి నాయనా! ఈ రోజు కూలికి పోలేదు నేను"

"ఎందుకెల్ల లేదే నీయవ్వ" అని లక్ష్మి తల మీదొక్కటేశాడు కోపంగా.

అది చూసి, చేతిలో ఉన్న పుస్తకం కింద పడేసి, లోపలికెళ్ళి తల్లిని పిల్చుకొచ్చాడు శీను.

"ఏం బుట్టిందయ్యా నీకు... నీ పెతాపం పిల్ల మీద సూపిస్తాండావు" అని భయపడు తూ నిలబడ్డ లక్ష్మిని తీసుకుని లోపలికె ళ్లింది.

"ఓ పదన్నా ఇయ్యావే"

"నాదేర సిల్లిగవ్వ లేదు ఫో ఫో" అని పిల్లల్నిద్దర్నీ తీసుకుని లోపలికెళ్ళి తలుపేసు కుంది గౌరమ్మ.

మర్నాడుదయం గౌరమ్మ ఇంటి ముందు కళ్ళాపి జల్లి ముగ్గు పెడ్తుంటే లక్ష్మి పాలు తేవటానికి చెంబు పట్టుకెళ్తోంది.

శీను నిద్ర లేచి పుస్తకాలు ముందేసుక్కూ చుని చదువుతున్నాడు. వాకిట్లో అరుగు మీద సాంబయ్య ఒళ్ళు తెలీకుండా పడి ఉన్నాడు.

ఇంటి పన్లు ముగించుకుని, పొయ్యి మీద అన్నం వండుతూ "లచ్చిమీ! తొందరగా రావే" అని పిల్చింది గౌరమ్మ.



"అమ్మా! స్కూలు ఫీజు" వెనక నుంచొచ్చి అడిగాడు శీను.

"మర్చేపోయినా రారా కొండా! లోనికి రా" అని కొడుకుని లోపలికి పిలిచి, ముంతలో దాచిన డబ్బుల్దీసి లెక్కబెడ్తోంది.

ఎప్పుడు నిద్రలేచి లోపలి కొచ్చాడో సాంబయ్య, గభాల్న గౌరమ్మ చేతిలో ఉన్న నోట్లు గుంజుకున్నాడు.

"నీ యెమ్మ, దొం.... నేనడిగితే డబ్బులేదన్నవు ఇప్పుడేట్నుంచొచ్చిందే" అని గౌరమ్మ జుట్టు పుచ్చుకుని వంచి వీపు మీద పిడికిళ్లతో గుద్దాడు.



"నాయనా! అమ్మనొదిలీ నాయనా" శీను బతిమిలాడుతూ సాంబయ్య చేతుల్లో నుంచి తల్లిని విడిపించడానికి ప్రయత్నించాడు.

పొయ్యి దగ్గర మంట రాజేస్తున్న లక్ష్మి కూడా గబగబా వచ్చి "వొదిలెయ్యి నాయనా, వొదిలెయ్యి" అని ఏడుస్తూ సాంబయ్యని బలం కొద్దీ లాగడానికి ప్రయత్నించింది. కాని ఆ చిట్టి చేతుల్లో అంతటి బలం లేకపోయింది.

"ఛూ...
నీయెమ్మ.. నీకు

మొగుడి కంటే ఈ పిల్ల నా కొడుకు సదువే ఎక్కువేంటే" అని కోపంతో ఊగిపోతున్న సాంబయ్య వైపు ఛీత్కారంగా చూసింది గౌరమ్మ.

"నీ బతుక్కి సంపాదించి సిల్లిగవ్వ ఇంట్ల ఇయ్య సేతకాని కూలి చేసి ఆడి సదువుకి దాసిన డబ్బులు గావాల్సొచ్చినయ్యా! నేని య్యను" అని సాంబయ్య చేతిలో డబ్బు గుంజుకుంది గౌరమ్మ.

రెచ్చిపోయిన కోపంతో మళ్ళీ ఆమె మీద చెయ్యి చేసుకున్నాడు సాంబయ్య. శీనూ, లక్ష్మి చెరో పక్కా లాగుతున్నా, వాళ్ళని విది లించుకుని గౌరమ్మని బూతులు తిడుతూ కొట్టాడు. ఆ దెబ్బల ధాటికి తట్టుకోలేక కేక లు పెడ్తున్న తల్లిని విడిపించే ప్రయత్నంలో, తండ్రి చెయ్యి దొరక బుచ్చుకుని గట్టిగా కొరి కాడు శీను.

అంతే! భార్య నొదిలి శీను జుట్టు బట్టు కుని వాణ్ణి గట్టిగా అవతలకు విసిరేశాడు సాంబయ్య. "లం... సదువులు గావాల్సొచ్చి నయ్యా... సదువులు నీకు... కూలికెల్లి నాల్గు డబ్బుల్దేరా అంటే... సదువులు గావాల్నా నీకు... సదువు... ముం... కొ..." అంటూ ఆవేశంగా శీనుని బరబరా లాక్కెళ్ళి, పొయ్యిలో మండుతున్న కట్టె తీసి చేతిమీద బలంగా వాతబెట్టాడు.

సర్రున కాలిన బాధ తట్టుకోలేక శీను కిందబడి దొర్లుతూ, పెడబొబ్బలు పెట్టాడు. అయి నా వదలక వాణ్ణి కాలితో తంతూ, "తండ్రి మీదే తిరగబడ్తావంట్రా? బడి కెల్లా వంటే సంపేస్త నా కొడకా... సంపేస్తా" అని భార్య మీదికి మళ్ళీ వెళ్ళబోయాడు. గౌరమ్మ అతణ్ణి బలంగా వెనక్కి తోసింది. అతడు తలుపు అవతలకెళ్ళి కింద పడడంతో వెంటనే తలుపులు మూసి గడియపెట్టింది.

కొడుకుని అక్కున జేర్చుకుని వాడి చేయి పట్టుకుని చూసింది. సాంబయ్య పెట్టిన వాత చూసి ఆమె కళ్ళలో గిర్రున నీళ్లు తిరి గాయి. "ముదనష్టపోడు. వాడి చేతులు పడిపోను. బిడ్డ అని కూడ చూడకుండా ఎంతగా వాత బెట్టిండో సచ్చినోడు" అని భర్తని శాపనార్థాలు పెట్టింది. వెక్కి వెక్కి ఏడుస్తున్న కొడుకు కళ్లు చీర చెంగుతో తుడుస్తూ "ఊర్కోరా!నా కొండా! ఊరుకో, ఈ తల్లి కడుపున బుట్టినందుకు మీకీ కష్టాలు తప్పవు" అంటూ పిల్లలిద్దర్నీ చెరోపక్కా పొదువుకుని ఏడ్చింది గౌరమ్మ.

కాసేపటికి హృదయ భారం తగ్గాక గాయం మీద నూనె, పసుపు కలిపి పూత లాగ రాసింది. కిందపడ్డ నలిగిపోయిన నోట్లని తీసి శీను చేతిలో పెట్టింది "స్కూల్లో కట్టెయి కొండా" అంటూ.

స్కూల్లో పరీక్ష ఫీజు కట్టి క్లాసులో కూచున్న శీనుకి మనసు నిండా గజిబిజి ఆలోచనలే. తండ్రి చేతిమీద కాల్చిన చోట తల్లి నూనె, పసుపు కలిపి రాసినా ఆ గాయం కలిగించే మంట కంటే, ఉదయం ఇంట్లో జరిగిన సంఘటన కలిగించే బాధ ఎక్కువవ్వసాగింది.

తండ్రి తలపుకొచ్చినపుడల్లా కసి, కోపం, ద్వేషం కలిసి ఒంట్లో రక్తాన్ని మరిగిస్తు న్నాయి.

తన చదువుకి, ఫీజులకి తల్లి కూలి చేసి ఇచ్చే డబ్బు తాగటానికి ఇమ్మనే తండ్రిని ఎన్నో ప్రశ్నలడగాలని మనసులో కసి... కోపం...

తన తోటి పిల్లల తండ్రుల్లా తనేమైనా బట్టలు కుట్టించమని, ఎత్తుకుని లాలించ మని, స్కూలుకి దించమని అంటున్నాడా? కనీసం సైకిల్ మీద కూడా ఏనాడూ స్కూలుకి పంపలేదే.. అందుకూ కోపం తెచ్చుకోలేదు.

తన చదువు వంకతో అమ్మనీ, అక్కనీ ఇష్టమొచ్చినట్టు తిడుతూ, కొడ్తున్నందుకే తండ్రంటే శీనుకి కోపం, ద్వేషం.

పరధ్యాన్నంగా దిక్కులు చూస్తుంటే లెక్కల టీచరొచ్చి బోర్డు మీద లెక్క రాసి, అతణ్ణి వచ్చి చెయ్యమన్నాడు. శీను లేచెళ్ళి

ఒక్క తప్పుతో చేసొచ్చాడు. టీచరు తప్పు సరిదిద్ది చెప్తున్నా విన్పించుకునే స్థితిలో లేదు శీను మనసు.

మధ్యాహ్నం లక్ష్మి తమ్ముడి కోసం అన్నం తెచ్చింది. గ్రౌండులో చెట్టుకింద కూచున్న శీనుతో...

"నాయన కాల్చిన పుండు బాగా నెప్పి పుడ్తాందా? " జాలిగా, ప్రేమగా అడిగింది.

"లేదు" కరకుగా అన్నాడు.

తమ్ముడి తల నిమురుతూ "అన్నం తిను" అంది.

"నాకొద్దు"

"నువ్వు తినకపోతే... అమ్మ కూడా తిన దంట" అంది తమ్ముడి చేయి పుచ్చుకుని.

ఒక్కక్షణం అక్క వంక చూసి తల దించుకుని "ఇయ్యి" అన్నాడు.

"ఉండు నేను కలిపి పెడ్తాను" అని లక్ష్మి అన్నం కలిపి పెడ్తుంటే గబగబా తినేసి క్లాసురూం కెళ్ళాడు.

వ్యక్తం చేయలేని బాధతో ఎప్పుడూ చెప్పి నట్టు 'వెళ్తానక్కా' అని చెప్పకుండా వెళు తున్న తమ్ముణ్ణి అలాగే చూస్తూ నిల్చుంది లక్ష్మి. అతడు క్లాసు రూంలోకి వెళ్లిపోయాక చిన్నగా నిట్టూర్చి వెనుదిరిగింది.

సాయంత్రం స్కూలు ముగిశాక.. ఇంటికె ళ్ళాలన్పించలేదు శీనుకు. మరెక్కడి కెళ్ళాలి? మనసు పరిపరి విధాలుగా ఆలో చిస్తోంది.

చేతిమీద పుండు సలపరం పెడుతోంది. ఇంటి సందు మలుపు తిరగబోతుంటే తాగి తూలుతూ, ముందు నడుస్తున్న తండ్రి కన్పించాడు శీనుకి. అంతే! ఇంటి కెళ్దామనే ఆలోచనను విరమించుకున్నాడు.

తన ఆలోచనలతో ప్రమేయం లేనట్టు కాళ్ళు రైల్వేస్టేషన్ వైపు నడిచాయి.

చలిగాలి రివ్వున వీస్తోంది. స్టేషన్ ఫ్లాట్ ఫారం చివర బెంచీ మీద కూచున్నాడు. మోకాళ్ళ మధ్య తల ఉంచుకుని, వచ్చీపోయే వాళ్ళని చూస్తూ కూచున్నాడు. ఇంటి పక్క నుండే తిరుపతయ్య కొడుకు మోహన్ కన్పించాడు. తననెక్కడ గుర్తుబడ్తాడో అని తల మోకాళ్ళ మధ్య దాచుకున్నా ఎంతసే పలా కూచున్నాడో శీనుకి సమయం తెలీదు గాని తల పైకెత్తేసరికి, స్టేషన్‌లోకి రాబోయే రైలు గురించి చెప్తున్నారు.

పది నిమిషాల్లో తిరుపతి వెళ్ళే రైలు ప్లాట్‌ఫారం మీది కొచ్చింది.

మరో ఆలోచనకి తావివ్వకుండా, కదలబో తున్న రైలెక్కేశాడు. రైలెక్కాగ్గానీ గుర్తు రాలేదు. భుజానికి బరువుగా పుస్తకాల బ్యాగు వేలా డుతోందని. బ్యాగు తియ్యబో తుంటే చేతి మీ దున్న గాయానికి ఒరుసు కుని పుండు మంట పెట్టింది. మెల్లగా బ్యాగు తీసి కింద పెట్టాడు. వాష్‌బేసిన్ ఎదురుగా కూచున్నాడు. క్షణకాలం మనసు ఇంటి ముఖం పట్టింది.




సాయంత్రం స్కూలు నుండి రాగానే గౌర మ్మ కొడుక్కి కుండలో కాగబెట్టిన వేణ్ణీళ్ళు పోసి, ఉతికిన బట్టలిచ్చి అన్నం పెట్టేది. అక్క, తను పక్కపక్కనే కూచుని అన్నం తింటుంటే మురిపెంగా ఇద్దర్నీ చూసుకునేది.

తర్వాత కిరోసిన్ దీపం దగ్గర కూచుని చదువుకునేవాడు. తల్లి కూలి పనికెళ్ళి, తనని ఇంగ్లిష్ కాన్వెంట్‌లో చదివిస్తోందనే సంగతి, చిన్నవాడే అయినా శీను మనసులో ఎప్పుడూ మెదుల్తూనే ఉంటుంది. పట్టుదలగా చదివి ఎప్పుడూ క్లాసు ఫస్టొచ్చేవాడు.

"అక్కనీ బడికి పంపమ్మా" అని అడిగే వాడు అప్పుడప్పుడు.

"అదీ, నేనూ రెక్కలు ముక్కలైసుకుంటేనే



గదరా నీ సదువుకి, మీ నాయన కులుకులకి డబ్బులొచ్చేది. దాని సంగతి నీకెందుగ్గానీ, నువ్వు మంచిగ సదూకుని పెద్ద ఆపీసరవ్వా లిరా నా కొండా!" అనేది గౌరమ్మ.

"ఏయ్, ఏ ఊరురా నీది? " అని ఎవరో గద్దించినట్లు అడగటంతో ఇంటి నుండి వెనక్కి తిరిగొచ్చింది శీను మనసు.

కంగారుగా "ఆఁ... ఏంటీ..." అన్నాడు.

"ఏ ఊర్నుంచొస్తున్నావు? " అదే గద్దింపు స్వరంతో అడిగాడు. అలా అడిగింది ఓ కుర్రాడు.

వాడి వైపు ఎగాదిగా చూసి, తనని కాద న్నట్టు మళ్ళీ మోకాళ్ళ మధ్య తలొంచుకు న్నాడు శీను.

రైలు వేగం అందుకుంది.

తలమీద ఎవరో కొట్టినట్టన్పించి తలెత్తి కంగారుగా లేచి నుంచున్నాడు. తన చుట్టూ నలుగురు కుర్రాళ్ళు నుంచున్నారు.

మాసిన బట్టలు, చింపిరి తలలు, పెద్ద చొక్కాలు, చిరిగిపోయిన ప్యాంట్లు.... ఒకడి



అందరిలోకి కాస్త పెద్ద వాడైన పిల్లాడు.

"వజ్రోరిపల్లి"

"యాడికి బోతున్నవురా? "

"తెలీదు"

ఇంతలో టి.టి. రావటంతో శీనుని ఏడ్పించిన నలుగురు కుర్రాళ్లూ నల్లపూ సల్లా మాయమయ్యారు. టి.టి. దగ్గర కొచ్చి..

"ఎక్కడెక్కావురా? "

"వజ్రోరిపల్లిలో నండి"

"టిక్కెట్టేది? "

"లేదండి"

"లేదా? డబ్బు లెంతున్నాయో తియ్యి"

శీను భయంతో బిక్క మొహం పెట్టి... "లెవ్వు" అన్నాడు.

"లెవ్వా!" అంటూ శీను జేబులన్నీ వెతికాడు టి.టి. డబ్బులు దొరక్కపొయ్యే సరికి,

"ఎక్కడి కెళ్తున్నావు రా? "

"తెలీదు సార్"

"కొత్తగా రైలెక్కావా? నీ పక్కన సంచీ ఏంటి? "

"నా పుస్తకాలు"

"ఇంట్లోనించి పారిపొయ్యి వస్తున్నావా? "

"................"

"రేయ్ ఇంట్లో నించి పారిపొయ్యొచ్చి ఈ పోరంబోకు పిల్లకాయల్తో జేరి పాడైపోమాక. చూస్తే చదువుకునే వోడిలా ఉన్నావు. వచ్చే స్టేషన్లో దిగి ఇంటికెళ్ళిపో..."

తలాడించాడు శీను. టి.టి. పక్క కంపార్ట్ మెంట్ కెళ్ళాడు.

చలిగాలి ఎక్కువైంది. చీకటి చిక్కబడ్డది. పుస్తకాల బ్యాగు ముందుంచుకుని, కాళ్ళ మధ్య తలవంచుకుని కళ్ళు మూసుకున్న శీను కి రైలు కదలిక ఉయ్యాల ఊపుతున్నట్టుంది. రైలు శబ్దం జోలపాటలా చెవులని చేరు తుంటే.... నిద్ర కళ్లమీద దాడి చేసింది.

కళ్ళు నులుముకుని వాష్ బేసిన్ దగ్గర

మెడలో సంచి వేలాడుతోంది. వాడి చేతిలో షూ పాలిష్ బ్రష్‌లున్నాయి. ఒకడి చేతిలో చిన్న చీపురుంది. వాడి ఒంటి మీద చొక్కా లేదు. చొక్కా మడిచి చంకలో పెట్టుకున్నాడు. మరొకడు జామకాయ తింటు న్నాడు.

వాళ్ల వైపు భయంగా చూస్తూండిపోయాడు శీను.

"యా ఊరని అడిగితే, మాటాడవేరా ఎర్రి నాయాలా? " అని జేబులో ఉన్న గుట్కా ప్యాకెట్ చించి నోట్లో పోసుకుని శీను భుజం మీద చెయ్యేసి "చెప్పు బే..." అన్నాడు,

నీళ్ళు మొహంమీద జల్లుకున్నాడు.

విండో సీట్లో కూచున్నతని దగ్గర కొచ్చి "స్టేషన్ ఎంత సేపట్లో వస్తది" అనడిగాడు.

అతడు శీనుని ఎగాదిగా చూసి,"ఇంకో అర గంటకి" అని చెప్పి కునికిపాట్లు పడసా గాడు.

శీను వచ్చి కూచున్నాడు. బ్యాగులో పుస్తకం తీశాడు. పేజీలు తిప్పుతుంటే.... క్లాస్ టీచర్ మాటలు గుర్తొచ్చాయి.

హాఫియర్లీ పరీక్షలు రాసిన పేపర్లిస్తూ... జాన్ మేస్టారు, "మీరంతా శీనుని చూసి బుద్ధి తెచ్చుకోండ్రా... ఒక్క తెలుగులో తప్ప, అన్ని సబ్జెక్టుల్లో శీనుకే ఫస్టు మార్కు లొచ్చాయి" అన్నాడు క్లాసు పిల్లలతో. శీను వంక ప్రేమగా చూస్తూ.

"శీనూ, ఈసారి నీకు... తెలుగులో ఫస్టు రావాలిరా బాగా చదువు" అన్నాడు.

అప్పుడప్పుడు ఆయనే శీనుకి నోట్ బుక్స్ కొనిచ్చేవాడు.

అవన్నీ గుర్తొచ్చి ఏదో దిగులుగా అన్పిం చింది శీనుకి.

తిప్పుతున్న పేజీల్లోని అక్షరాలు రైలు లైటు వెలుగులో అటూ, ఇటూ ఊగుతున్న ట్టనిపించాయి.

తన చదువిప్పుడు మధ్యలోనే ఆగిపో తుందా?

బాగా చదువుకుని, డబ్బు సంపాదించి, అమ్మనీ, అక్కని కూలీకి పోనీయకుండా చూడాలనుకునే వాడు. తండ్రి తల్లిని కొట్టిన ప్పుడల్లా, ఏడుస్తున్న గౌరమ్మ పక్కన కూచుని ఇవే మాటలు అంటుంటే...

"నువ్వు నన్ను చూసినా, చూడకపోయినా కొండంత మాటన్నావురా. నా బంగారు కొండా! కడుపు నిండిపోనాది" అని శీనుని దగ్గరికి తీసుకునేది.

తల్లి, అక్క గుర్తుకు రాగానే శీను కళ్లెంట నీళ్ళు కారాయి.

పుస్తకం మూసి లోపల పెట్టాడు.

ఆకలేస్తోంది. మళ్లీ కాళ్ళ మధ్య తల పెట్టుకుని పడుకున్నాడు. ఈసారి నిద్ర శీనుని వదిలి పెట్టలేదు. చల్ల గాలికి క్షణంలో గాఢ నిద్రగా మారింది. కూచున్న చోటే కాళ్ళు ముడుచుకుని పడుకున్నాడు.

* * *

ఎవరో తనని తొక్కుతూ వెళ్తున్నట్టన్పించి, పక్కకి తిరగబోయాడు శీను. చేతిమీది గాయం కింద తగిలి నెప్పి పుట్టటంతో, గభా ల్న లేచి కూచున్నాడు.

కళ్ళు నులుముకుని చూసేసరికి రైలు స్టేషన్లో ఆగి ఉంది. దిగేవాళ్ళు తనని దాటు కుంటూ, తిట్టుకుంటూ వెళ్తున్నారు.

"రేయ్... స్టేషనొచ్చినాది దిగు..." అన్నా డొకాయన.

అప్పుడు శీను కళ్ళు, పుస్తకాల బ్యాగు కోసం వెతికాయి. కన్పించలేదు. చుట్టూ వెతికాడు. ఎక్కడా లేదు. శీనుకి వంట్లో శక్తంతా పోయినట్టనిపించింది. డోర్ దగ్గర నుంచుని బ్యాగు కోసం చూస్తుంటే... ఎవరో వెనక నించి నెట్టడంతో ప్లాట్ ఫారం మీద తూలి పడబోయి, నిలదొక్కుకున్నాడు. అయోమయంగా... చుట్టూ చూస్తుంటే, అతడి వయసు కుర్రాళ్ళిద్దరు దగ్గర కొచ్చి

"యా ఊర్నుంచొచ్చినావు? " అన్నారు.

నిద్ర మత్తొదిలించుకుని "వజ్రోరిపల్లి" అన్నాడు.

"రేయ్, ఎంకటేశూ, వీరిగా రండ్రా!" అన్న కేక విన్పించడంతో వాళ్ళిద్దరూ పరుగెత్తారు.

రెండడుగులు ముందుకు నడిచేసరికి స్టేషన్లో "తిరుపతి" అన్న బోర్డు కన్పించింది.

హాఫియర్లీ పరీక్షలయ్యాక క్లాస్ టీచర్ తమ క్లాసు వాళ్లందర్నీ తిరుపతి ఎక్స్‌కర్ష న్‌కి తీసుకొచ్చారు. ఏభై రూపాయలు కట్ట లేక తను రాలేకపోయాడు.

ఎక్స్‌కర్షన్ కెళ్ళొచ్చాక, క్లాసు పిల్లకాయలు తిరుపతి గురించి వర్ణిస్తుంటే... ఊహల్లో తిరుపతిని నిర్మించుకున్న శీను, ఇపుడు తనున్నది తిరుపతిలో అనే నిజాన్ని క్షణం

సేపు నమ్మలేకపోయాడు.

మళ్లీ ఆ బోర్డు వైపు చూశాడు. "తిరుపతే..."

మళ్ళీ కొంచెం ముందుకు నడిచాడు. పుస్తకాల బ్యాగు ఎవరో ఎత్తుకు పోయారు. వంటి మీద బట్టలు తప్ప, కాళ్లకి కనీసం చెప్పులు కూడా లేవు. మళ్లీ స్టేషనంతా కలియతిరిగాడు. మెల్లగా నడుస్తూ ఓ చోట ఆగాడు.

వెయ్యింగ్ మిషన్ మీద చక్రాలు రంగు రంగుల్లో చిత్రంగా తిరుగుతుంటే దాన్నీ విచిత్రంగా చూశాడు కాసేపు.

అంతకు ముందు కన్పించిన వీరిగాడు మళ్లీ కన్పించి,

"ఏరా! పారిపొయ్యొచ్చినావా? "

"ఉహుహూఁ కాదు... లేదు"

"ఏందిరా కాదు... నీయవ్వ... నిజం చెప్పు" కోపంగా అన్నాడు వీరిగాడు.

"అవును"

"పోరా! పొయ్యి బస్టాండులో ఉండు. ఈడ పెద్దన్న చూసిండంటే... కొడ్తడు" అని, ఏదో రైలు వస్తున్న అనౌన్సుమెంటు విని పరుగెత్తాడు.

శీను ఇంకొంచెం ముందుకొచ్చి స్టేషన్లో ఉన్న టి.వి. ముందాగాడు.

కొత్త సినిమాల ట్రయలర్లు, పాటలు వస్తుంటే... ఆశ్చర్యంగా చూస్తూ నిలబడ్డాడు.

ఆకలి ఎంతోసేపు నిలబడనివ్వలేదు. కాళ్ళు పీకేస్తున్నాయి. స్టేషన్లో కన్పిస్తున్న పెద్ద గడియారం వైపు చూశాడు. రాత్రి పది గంటలయింది. నీర్సంగా నడుస్తూ "చల్లని తాగే నీరు" అని ఉన్న చోటకెళ్లి గడగడా నీళ్లు తాగాడు. ఆకలి తీరిందో లేదో తెలియదు గానీ తాత్కాలికంగా కడుపు మాత్రం నీళ్లతో నిండింది.

కాస్త ఉపశమనం కల్గింది.

బెంచీల మీద కొంతమంది కూచున్నారు. కొన్నిచోట్ల పడుకున్నారు. కొంతమంది కూచునే కునికిపాట్లు పడ్తున్నారు. ప్లాట్‌ఫారం చివర వరకూ వెళ్లాడు. ఓ బెంచీ ఖాళీగా కన్పించింది. దాని మీద కూచున్నాడు. దోమలు కుడుతున్నాయి. నిద్ర కూచోనివ్వటం లేదు. కాసేపటికి బెంచీ మీద కాళ్లు ముడుచుకుని పడుకున్నాడు.




సముద్ర తీరాన శీను ఫ్రెండ్స్‌తో నీళ్లలో దిగి ఆడుతున్నాడు. అల దగ్గరికి రాగానే ఒడ్డుకి పరుగెత్తడం, లోపలికెళ్ళగానే దానితో బాటు నీళ్లలోకి దిగడం... ఎంతసేపు ఆడినా అలుపు రావటం లేదు.

తనతో బాటు నీళ్లలో దిగిన ముగ్గురిలో రాజేష్ కన్పించటం లేదు. వాడి కోసం చుట్టూ చూస్తున్నాడు. దూరం నుండి పెద్ద అల దూసుకుంటూ వస్తోంది. దాన్ని చూస్తూనే శీనుకి వెన్నులోంచి భయం పుట్టుకొచ్చింది. నీళ్లలో నుంచునే "రాజేష్, రాజేష్" అని అరుస్తున్నాడు. సముద్రపు హోరు గాలిలో తన పిలుపు తనకే విన్పించటం లేదనుకుని, తరుముకొస్తున్న రాక్షసి అలలకి ఎదురుగా నిలబడి "రాజేష్! రాజేష్!!" అని పెద్దగా అరుస్తూనే ఉన్నాడు. మిగిలిన ఇద్దరూ ఎప్పుడో ఒడ్డుకి చేరుక్కున్నారు. రాక్షసి అల శీనుని సమీపించింది. గట్టిగా కళ్ళు మూసుకుని "రాజేష్" అని అరిచాడు. మరు సెకనులో శీను ఆరడుగుల ఎత్తుకు ఎగిరి, వేగంగా వచ్చి ఒడ్డున పడిపోయాడు.

కళ్ళు తెరిచి చూసేసరికి, బెంచీ మీద నుండి కింద పడ్డట్టన్పించింది. "సముద్రం, రాక్షసి అల, రాజేషు" అంతా కల. కల అని తెలిశాక నీరసం ఆవహించి నట్టన్పించింది.

కళ్ళు నులుముకుని చూసేసరికి... తనపై

నించి ఐదు మొహాలు తన వైపే చూస్తు న్నాయి.

గభాల్న లేచి నుంచున్నాడు.

"రేయ్... ఏ వూర్రా నీది? " ఒకడి ప్రశ్న.

"వ... జ్రో... రి... ప... ల్లి" అన్నాడు భయంగా చూస్తూ.

ఈడకెందుకొచ్చినావురా? " రెండోవాడు ధాష్టీకంగా అడిగాడు.

"పారిపోయి వచ్చాను"

"ఇదేమన్నా... నీ నాయన సొత్తనుకుంటివా? ఏమి? పండుకున్నావు? " మూడో వాడి అధికారం.

"తెలీక పడుకున్నా..."

"అరేయ్... కొత్తంగ వచ్చి నావు — గాబట్టి



బతికి పోయినావు. లేకపోతే నాయాల... ఉతికి ఎండేసేవోణ్ణి. పెద్దన్నకి చెబితే నిన్నీ పక్కకి... రానియ్యడు. ఈ రేత్రికి ఓరంగా పండుకుని పొద్దున్నే బస్టాండు కెల్లిపోవాల... అర్థమయిందా? " నాల్గోవాడి హుకుం.

తలాడించాడు శీను.

"మల్లా ఈ పక్కల అగుపించినావనుకో... చేతులూ, కాళ్లూ ఉండవు. తెల్సిందా? " ఐదో వాడి బెదిరింపు.

శీను బిక్క మొహంతో మౌనం వహించాడు.

"రేయ్! ఊర్కోంర్రా పిల్లకాయ బెదిరిపోతాడు" అని రెండోవాడు అనటంతో,

"సర్లే పో!... పొయ్యి అటు పక్కన పండుకో" అని శీనుని పంపి ఐదుగురూ ఆ బెంచీ మీద కూచున్నారు.

శీను వాళ్లకి దూరంగా ఓ స్తంభాన్నానుకుని మోకాళ్ళ మీద తల పెట్టుకుని కూచుని వాళ్ళనే గమనిస్తున్నాడు.

"ఒరేయ్! ఈరిగా... సరకు దొరికిందా? "

"దుడ్లు సరిపోలేదన్నా... గందుకని కోర్టరే తెచ్చిన"

"డబ్బు కోసం వచ్చుండాల్సింది" వెంకటేశు అన్నాడు.

"ఏమోలే... తెచ్చిన..." వీరిగాడు బదులు.

"పర్లేదులే... నేను వేరే సరుకు తెచ్చిన గానీ... తొందరగా తియ్‌రా" తొందర పెట్టాడు రమేషు.

తాడుతో నడుముకి చుట్టిన పెద్ద ప్యాంటు జేబులో నుంచి క్వార్టర్ బాటిల్ బయట పెట్టాడు వీరిగాడు.

భుజానికి వేలాడుతున్న సంచీలోంచి, ఏరుకొచ్చిన డిస్పోజబుల్ గ్లాసులు బయటికి తీశాడు వెంకటేశు.

ప్యాంటు జేబుల్లో నించి నాల్గు నీళ్ళ ప్యాకెట్లు బద్రిగాడు తీసిచ్చేసరికి, వీరిగాడు గబగబా మందు మిక్స్ చేశాడు. తలా ఒక గ్లాసు తీసుకుని గటగట తాగేశారు. రమేష్ అందరికీ ఊరగాయ ప్యాకెట్లు ఇచ్చాడు. ఊరగాయ నాకుతూ ఐదుగురూ బెంచీ మీద వరసగా కూచున్నారు.

"ఏదిరా నాగూ... నీ సరకు తియ్యి"

నాగు చొక్కా జేబులో నుంచి రెండు సిగరెట్లు తీశాడు. మొదటిది ముట్టించి, గట్టిగా పొగ పీల్చి పక్క వాడికిచ్చాడు నాగు. అలా ఐదుగురూ... ఒకరి తర్వాత మరొకరు దమ్ము లాగుతుంటే పది నిమిషాల్లో రెండు సిగరెట్లు అయిపోయాయి. అవి గంజాయి కూర్చిన సిగరెట్లు.

అప్పుడు మొదలయింది మాటల్లో తేడా. ఒకళ్ళ మీదొకళ్ళు పడుతూ, లేస్తూ, తూలుతూ... బూతులు తిట్టుకుంటూ... ఎంతసేపలా గడిపి ఎప్పుడు నిద్ర బోయారో గానీ, శీనుకి మాత్రం తొందరగా నిద్ర పట్టింది.

* * *

"నేనెవరికి భయపడాలి? ... ఎందుకు భయపడాలి. అత్త ముం... చచ్చిందని, నీకు భయపడ్తాననుకుంటున్నావా? నా మొగుడు నన్ను కొడితే ఏడుస్త, తిడితే పడత, ప్రేమ నటిస్తూ దగ్గరికి తీసుకుంటే... అది మాత్రం కుదరదంట... తిరగబడత... సమ్మక్క నౌత, సారక్క నౌతా, కట్ట మైసమ్మ నౌత... అవసరమైతే ఒసేయ్ రాములమ్మలా ఇరుచుకు పడత... ఒరేయ్ నిన్ను మాత్రం వదలను. మొగుడివైతే... మీద పడ్తావా? వదలను, నిన్నొదలను... హ్హా... హ్హా... హ్హో..."

"మా నాయన చచ్చి పొయ్యాడనేగా నీకింత చులకన. చిన్నప్పుడు నన్నెంత గారం చేసేవాడో, నాన్న బతికుంటే... నాన్నా! ఈ కూతురి కష్టాలు చూస్తున్నావా? వేళకి అన్నం లేదు... ఆకలి నాన్నా... ఆకలి... మళ్ళీ ఒక్కసారి బతికి కిందికి రా! నాన్నా..."

జుట్టు విరబోసుకుని... అస్తవ్యస్తంగా వంటిమీదున్న మురికి బట్టల్ని సరిచేసుకోకుండా పెద్దగా ఏడుస్తోంది, ఓ పాతికేళ్ళ అమ్మాయి.

"నాన్నా! వచ్చావా? ... నా కోసం ఏం తెచ్చావు? "

"నువ్వేం తెస్తావులే! నా మతి మండా! ఆడ పిల్లని నేనే నీకు అన్నం వండి పెట్టాలి. రా! ఇలా కూచో" అని అక్కడికి వాళ్ళ నాన్న వచ్చాడన్న భ్రమలో మాట్లాడుతోంది.

"నాన్నా! మంచి నీళ్ళు కావాలా! ఉండు తెస్తా" అని పాత మురికి గోతంలో నించి... ఓ మురికి వాటర్ బాటిల్ తీసుకుని ప్లాట్ ఫారం చివర ఉన్న పంపు దగ్గరకొచ్చి నీళ్ళు పట్టుకుంటూ, "హ్హా, హ్హా, హ్హా"... అంటూ పెద్దగా నవ్వుతూ, మళ్లీ అంతలోనే ఏడుపు మొదలెట్టింది.

ఉలిక్కిపడి నిద్ర లేచాడు శీను.

ఎదురుగా రెండో నంబరు ప్లాట్ఫారంలో జుట్టు విరబోసుకుని అస్తవ్యస్తమైన దుస్తుల్లో, పెద్దగా ఏడుస్తున్న పిచ్చిదాన్ని చూసి లేచి నుంచున్నాడు.

పిచ్చిదాని ఆకారం భయం పుట్టిస్తోంది.

లేచి నుంచున్న శీనుని, అవతలి వైపు నుండి పిచ్చిది చూసింది. ప్లాట్ ఫారం అంచుకి వచ్చి... శీనుకి చెయ్యూపుతూ

"రా! రా! అన్నం పెడత... రా! ఇప్పుడే వండాను. రా! నాన్నవు కదూ రా! ఇద్దరం కల్సి తిందాం" అంటూ ఏడుపు అందుకుంది.

తన దగ్గరికి ఎక్కడ వస్తుందోనని శీను భయంతో గబగబా పరుగెత్తుతూ ప్లాట్ ఫారం మధ్యలో ఉన్న ఓ బెంచీ కింద గట్టిగా కళ్ళు మూసుకుని పడుకున్నాడు. కళ్ళు మూసుకుంటే పిచ్చిదే కన్పిస్తోంది. కాసేపటికి పిచ్చిదాని అరుపులు సద్దుమణిగాయి. అయినా నిద్ర పట్టటం లేదు.

ఆకలి నిద్రని తరిమి కొడ్తున్నట్టన్పించింది.

గట్టిగా కళ్ళు మూసుకున్నాడు. నిద్రెపుడు పట్టిందో గానీ, కళ్లు తెరిచి చూసేసరికి... ఎదురుగా కన్పించిన పెద్ద గడియారం ఐదు గంటలు చూపుతోంది.

ఏదో అనౌన్సుమెంటు విన్పిస్తోంది.

శీను లేచి కూచున్నాడు. చలి గజ గజ లాడిస్తోంది. శీను కళ్లు అప్రయత్నంగా... ఎదుటి ప్లాట్ఫారం వైపు చూశాయి. పిచ్చిది స్తంభాన్నానుకుని, కాళ్లు బార్లా జాపుకుని గురక పెట్టి నిద్ర పోతోంది. వంటి మీద బట్టలు అస్తవ్యస్తంగా పక్కకి తొలిగున్నాయి.

"హమ్మయ్య" అనుకుని దగ్గర్లో ఓ బెంచీ ఖాళీగా కన్పిస్తే కూచున్నాడు. బెంచీ మీద కూచోగానే, శీను దృష్టి రాత్రి తనని బెదిరించిన గ్యాంగ్ పడుకున్న బెంచీ మీదికి మళ్లింది.

ఒక్కడూ కన్పించలేదు.

స్టేషన్లో వచ్చీపోయే జనం సందడి మొదలయింది.

"కాఫీ, కాఫీ నెస్ కాఫీ, టీ, టీ..." అరుపులు మొదలయ్యాయి దూరంగా.

"కౌసల్యా సుప్రజా రామా, పూర్వా సంధ్యా ప్రవర్తతే..." శ్రీ వెంకటేశ్వర సుప్రభాతం శ్రావ్యంగా విన్పిస్తోంది.

"ఇడ్లీ...ఆఁ వేడి వేడి ఇడ్లీ, వడ..." అంటూ చిన్న బండి నెట్టుకుంటూ తన ముందునుండే వెళ్తుంటే, ఆకలితో ఉన్న శీనుకి ఆ వాసన కమ్మగా ముక్కుల్ని తాకి, నోరూరింది.

"పాలిష్... పాలిష్" అని అరుస్తూ ఒకడెల్తున్నాడు. భిన్నమైన వాతావరణాన్ని మొదటిసారి చూస్తున్న శీను మనసు క్షణకాలం ఇంటి ముఖం పట్టింది.




"నాయనా! కొండా! నా బంగారు కొండా! లేరా!" అంటూ గౌరమ్మ ఐదు గంటలకే శీనుని నిద్ర లేపేది. శీను బద్ధకంగా పక్కకి తిరిగి పడుకుంటూ

"కొంచెం సేపు పండుకుంటానమ్మా"...

అనేవాడు.

"నా తండ్రివి గాదు... లేచి మొగం కడుక్కో దొరా! టీ ఇస్త... సదుకుందువు గాని" అని కొడుకుని లేపి గౌరమ్మ కూతురు దగ్గర కొచ్చి, "లచ్చిమీ, లచ్చిమీ, బిడ్డా! లే! పాలు తోడ్కరా. తొందరగా ఎల్లకపోతే కూలీ దొరకదు... బిడ్డా... లే తల్లీ" అని లేపేది.

లక్ష్మి లేచి పాలు తేవడానికి వెళ్లేది.

గౌరమ్మ వంట మొదలెట్టేది లోపల.

శీను పుస్తకాలు ముందేసుకుని చదువుతుంటే, రాత్రి తాగిన మత్తొదిలిన సాంబయ్య, ఎదురుగ్గా శీనుని చూసి,

"ఎదవ నా కొడకా... కూలికి బోయి నాలుగు దుడ్లు దేరా అంటే సదువు సదవని చస్తున్నవు... అరేయ్... ఎందుకూ పనికి రాకుండా బోతవు" పాచి నోటితోనే తిట్లు లంకించుకునేవాడు.

లోపల్నుంచి గౌరమ్మ గబగబా బయటి కొచ్చి "నీ పాచి మొగం మండిపోనూ... నువ్వెట్టాగూ చిల్లి కాసు సంపాదించలేవు. ఎప్పుడూ ఆడి సదువు మీద పడేడుత్తావు. నువ్వేమైనా దుడ్డు గట్టి సదివిత్తా ఉండావేంటీ; పో! ముందిక్కణ్ణుంచి" అని మొగుణ్ణి గదిమేది...

సాంబయ్య బూతులు తిట్టుకుంటూ, బజార్నబడేవాడు. ప్రతి రోజూ ఇంట్లో మొదలయ్యే సుప్రభాత కార్యక్రమం అది.

...........

శీను ఆలోచనల్ని ఇంటి నుండి వెనక్కి లాక్కొస్తూ, శబ్దం చేస్తూ, ప్లాట్‌ఫారంలో కొచ్చింది- చిత్తూరు ప్యాసింజరు.

మళ్లీ స్టేషన్లో అనౌన్సుమెంటు విన్పించింది.

దిగేవాళ్ళ, ఎక్కేవాళ్ళ రద్దీ, దిగినవాళ్ళు బయటికి వెళ్లేందుకు వేగంగా నడుస్తుంటే... "కూలీ... సార్... కూలీ" అంటూ వెంట బడ్తున్నారు పోర్టర్లు. మరి కొంత మందైతే... దిగేవాళ్ళని దిగనీయకుండా "కూలి, కూలి" అంటూ రైల్లోపలికి ఎక్కేస్తున్నారు.

"కాఫీ, కాఫీ..."

"న్యూస్ పేపర్, ఈనాడు, వార్త, జ్యోతి, భూమి, హిందూ, క్రానికల్... ఆc పేపర్... న్యూస్ పేపర్..."

"ఇడ్లీ వడ, వేడి వేడి ఇడ్లీ వడ..."

"టీ... టీ..." అంటూ ఎక్కే వాళ్లూ, దిగే వాళ్లూ ఊపిరి పీల్చుకోకుండా శబ్ద కాలుష్యం సృష్టిస్తున్నారు.

రాత్రి తనను బెదిరించిన కుర్రాళ్లలో ఒకడు కన్పించాడు శీనుకి.

వాడు "సార్! సార్! ఒక్క రూపాయుంటే ఇయ్యి సార్, చాయ్ తాగుతా, నిన్నట్నుంచీ అన్నం లేదు సార్" అంటూ ఓ ప్యాసింజరు వెంటబడ్డాడు.

మరొకడు..."ఆc పాలిష్...పాలిష్... పాలిష్ సార్, బూట్లు పాలిష్ చేస్త సార్" అని చేతిలో బ్రష్‌లు టకటక శబ్దం చేస్తూ కన్పించాడు.

ఇంకొకడు చొక్కా విప్పి, మడత బెట్టి, రైలెక్కి కింద కూచుని చొక్కాతో ఊడుస్తూ "అమ్మా! అయ్యా!"అంటూ దీనంగా మొహం బెట్టి, రైల్లో అడుక్కుంటున్నాడు.

రెండు చేతుల కింద కర్రలుంచుకుని మరొకడు, కుంటివాడిలా కాలు మడిచి, "బాబూ! ధర్మం చెయ్యండి, కుంటోణ్ణి బాబూ" అని అడుక్కుంటున్నాడు.

శీను వాణ్ణి గుర్తుబట్టాడు. రాత్రి వాడు బాగానే నడిచాడు. వాళ్లనే గమనిస్తూ అక్కడే కూచున్నాడు.

కాసేపట్లో రైలు పూర్తిగా నిండిపోయింది. ఇంజను మార్చుకుని రైలు మళ్లీ బయల్దేరటానికి సిద్ధమయింది.

మళ్లీ అనౌన్సుమెంటు.

కూత పెడుతూ ప్యాసింజరు బయల్దేరింది.

శీను లేచి మొహం కడుక్కునేందుకు పంపు దగ్గర కెళ్ళాడు.

రైలెళ్లిపోయింది. ప్లాట్‌ఫారం ఖాళీ అయింది.

## ఖర్చులేని సౌందర్యం ఖాయం!

మొహం మీద మచ్చలా? అయితే ఫలానా క్రీం వాడండి. రెండే రోజుల్లో మచ్చలు మాయం అంటూ మెరిసిపోతున్న మొహంతో అందమైన యువతులిచ్చే వ్యాపార ప్రకటనలు చూసి అందరూ ఎగబడి వాటిని కొనేస్తారు. ఆ క్రీములు, ఆయింటుమెంట్లూ వాడినంత కాలం కాస్త ఫలితం కనిపించినా తర్వాత మళ్ళీ మామూలే. మళ్ళీ మళ్ళీ సమస్యలు తలెత్తకుండా, ఖర్చులేకుండా "హెర్బల్ అండ్ నేచురల్ స్కిన్ కేర్ అకాడమీ ఆఫ్ అమెరికా" వాళ్ళు కొన్ని టిప్స్ చెప్తున్నారు. సూర్యరశ్మి వల్ల శరీరం మీద ఏర్పడే మచ్చల నివారణ కోసం ఐదు చెంచాల రోజ్ వాటర్‌కి, ఒక చెంచా నిమ్మరసం కలిపి మొహానికి, సూర్యరశ్మి తాకే శరీర భాగాలకు రాత్రిపూట రాసి మరుసటి రోజు ఉదయం నీళ్ళతో కడిగి చూడండి. ఇలా ఓ వారం చేస్తే మచ్చలు మాయం, సౌందర్యం ఖాయం. అలాగే చర్మం, శరీరం రోజంతా పరిశుభ్రంగా సువాసనభరితంగా ఉండాలంటే ఎండబెట్టిన గులాబీ రేకుల్ని మీరు స్నానం చేసే నీళ్ళలో కలిపి జలకాలాడండి. మళ్ళీ మీరు పెర్‌ఫ్యూమ్‌ల జోలికెళితే ఒట్టు.
మీరు పొడి చర్మంతో బాధపడుతున్నారా? అయితే గ్లిజరిన్, మీగడ, తేనె 1:1:1 శాతంలో మిశ్రమం చేసి రాయండి. రెండ్రోజుల్లోనే మీకు ఫలితం కన్పిస్తుంది. కాళ్ళ పగుళ్ళకీ ఈ మిశ్రమం బాగా పన్జేస్తుంది. అచ్చంగా మన బామ్మ చెప్పే చిట్కాల్లా ఉన్నాయి కదూ. ఇంకేం, పాటించేద్దామా మరి!

అప్పటివరకూ రైలు దగ్గర కాళ్లు లేవని డబ్బులడుక్కున్న వాడు, పాలిష్ వాలా, కూలి చేసినవాడు, చొక్కా విప్పి రైలు తుడిచినవాడు అందరూ ఒకచోట చేరారు.

వాళ్ళ దగ్గరికి ఎత్తుగా, లావుగా ఉన్న మరొకడు వచ్చి చేరాడు. వాడే 'పెద్దన్న'

పిల్లలంతా తమ దగ్గరున్న డబ్బులు పెద్దన్న ముందు పోశారు. పెద్దన్న డబ్బు లెక్కజూసి,

"రేయ్... ఎంకటేశూ... ఎంత మందుండా్రా!" అన్నాడు.

"అన్నా! అయిదుగురం... నీతోని ఆరు"

"ఈ డబ్బుల్దీస్కబోయి... అందరికీ బన్నూ, టీ తీస్కరా" అన్నాడు. వీరిగాడు వెళ్ళాడు.

"ఏంర్రా! రమేశూ! కొత్త పిల్లకాయ లెవురన్నా వొచ్చినారా?

"రాత్రి ఓ పిల్లకాయ గన్పించిండన్నా! ఇంట్లనుంచి పారిపోయి వొచ్చిండంట"

"ఈణ్ణే ఉన్నడా? "

"రాత్రి ఈణ్ణుంచి తరిమేశినం"

"అన్నా! అడుగో... ఆడ కూచున్నడు... ఆడే" అన్నా డు బద్రిగాడు.

"పోయి ఆణ్ణి తోడ్కరా!"

"రేయ్... నిన్ను పెద్దన్న పిలుస్తుండు" అన్నాడు శీను దగ్గరికి వచ్చిన పిల్లాడు.

"ఎవరూ? "

"ఎవరైతే నీకెందుకు బే... రా ముందు" అని చెయ్యి పట్టుకుని గుంజాడు. శీను లేచి వాడి వెంట వచ్చాడు.



అప్పటికే వాళ్ళు బన్ను తింటూ టీ తాగుతున్నారు.

"అన్నా! ఈడే" అన్నాడు శీనుని పెద్దన్నకి చూపుతూ.

"యా ఊర్రా మన్ది? "

"వజ్రోరిపల్లి"

"పారిపోయి వచ్చినావా? "

"..........."

"ఇదంతా మా ఏరియా... నువ్వు బస్టాండుకి పోయి అడుక్కో... మల్లా ఈడ కన్పించినావంటే... కాలు చెయ్యి తీసేస్త. నేను బస్టాండు కొస్త... ఆడ అవుపడు... ఫో"

శీను వెళ్లి మళ్లీ బెంచీ మీద కూచున్నాడు. బస్టాండుకి ఎటెళ్ళాలో అతడికి తెలీదు.

ఆకలికి కడుపులో పేగులు కేకలు పెడ్తున్నాయి.

టీ... తాగటానిక్కూడా డబ్బుల్లేవు. కళ్ళు తిరుగుతున్నట్టన్పించింది. పెద్దన్న గ్యాంగు వైపు చూశాడు.

అంతా లేచి మళ్లీ వచ్చే రైలు కోసం రెడీ అవుతున్నారు.

"రేయ్ ఒకట్లోకి నారాయణాద్రి వొస్తది. రెండ్లోకి ప్యాసింజరు వొస్తది. చూస్కోండి" అని పిల్లలకి చెప్పి పెద్దన్న లేచెళ్ళాడు...

శీను ఆకలికి తట్టుకోలేకపోతున్నాడు. లేచెళ్లి టి.వి. ముందు నుంచుని కాసేపు చూశాడు. ఆకలి నుంచోనీయటం లేదు.

"ఇంటి నుండి వచ్చి తప్పు చేశానేమో!" శీను మనస్సు ఆలోచిస్తోంది.

చేతిమీద తండ్రి కాల్చిన గాయం గుర్తొచ్చి "నేను చేసింది కరెక్టే" అని తనలో తాను గొణుక్కున్నాడు.

బెంచీ మీద కూచుని వచ్చీ పోయే వాళ్ళని గమనిస్తున్నాడు.

"రోజూ ఈ టైముకి స్కూల్లో..."

ఆలోచిస్తున్న శీను మనసు, చుట్టూ ఉన్న గందరగోళపు పరిసరాల్తో రాజీ పడలేక తను చదువుతున్న స్కూలుకి పరుగెత్తింది.




ఐదో క్లాసులో పాకాలలో కాన్వెంట్‌లో చేరాడు శీను. యూనిఫారం లేకుండా క్లాసుకొచ్చిన శీనుని చూసి, పిల్లలంతా గేలి చేసి, చివర బెంచీలో కూచోబెట్టారు.

లెక్కలు చెప్పే టీచరొచ్చి శీనుని నుంచోబెట్టి యూనిఫారం వేసుకు రాకపోతే రేపట్నుంచీ క్లాసుకి రావొద్దంది.

శీనుకి అందరి ముందు అవమానం అన్పించింది.

మర్నాడు, క్లాస్ టీచర్ మెర్సినా వచ్చీ రావటంతోనే హోంవర్కు బుక్సు కరెక్ట్ చేస్తోంది.

సడన్‌గా "శీను ఎవరు? " అంది.

యూనిఫారం గురించే అడుగుతుందని శీనుకి భయం పట్టుకుంది. సైలెంటుగా కూచున్నాడు.

"హూ ఈజ్ శీను? " మళ్లీ పిల్చింది టీచర్.

"దిసీజ్ శీను" పక్క పిల్లాడు చెప్పాడు.

టీచర్ లేచి శీను దగ్గరికొచ్చింది.

కొట్టుందేమోనని మిగిలిన పిల్లలు, ఏం జరగబోతోందోనని శీను కుతూహలం, భయంతో ఎదురుచూస్తుంటే...

"వెరీ గుడ్... హోం వర్కు చాలా నీట్‌గా, అందంగా రాశావు. నీ రైటింగ్ చాలా బాగుంది. బాగా చదువుకుని మంచి మార్కులు తెచ్చుకోవాలి" అని శీను రాసిన నోట్‌బుక్ క్లాసందరికీ చూపించింది.

సైలెంట్‌గా కూచున్న శీను వైపు క్లాస్ పిల్లలంతా మొదటిసారి గౌరవంగా చూశారు.

శీను మనసులో నాటుకున్న తొలి బీజాక్షరం "చదువు వల్లే గౌరవం వస్తుంది"

ఆ తర్వాత ఏ పరీక్ష పెట్టినా మూడు నాలుగు సబ్జెక్టుల్లో శీనే ఫస్టొచ్చేవాడు.

మెర్సినా టీచర్ పిల్లల్ని ప్రోత్సహించడం కోసం చిన్న చిన్న బహుమతులిచ్చేది. అందులో ఎక్కువ శీనుకే వచ్చేవి. గౌరమ్మని పిలిపించి... "నీ కొడుకు బాగా చదువుకుంటున్నాడు. నీ పేదరికంతో వాడి చదువుకు బ్రేకు వెయ్యకు. పుస్తకాలు నేను కొనిస్తాను" అని ధైర్యం చెప్పేది.

సాంబయ్యకి శీను చదువుకోవడం ఇష్టం లేకపోయినా, టీచర్ల ప్రోద్బలం వల్ల నిరాటంకంగా ఐదో తరగతి దాటింది. ఐదో తరగతి అన్ని పరీక్షల్లో శీనుకి ఫస్టు మార్కులు రావటంతో, హెడ్మిస్ట్రెస్‌కి శీనంటే ప్రత్యేకమైన అభిమానం ఏర్పడ్డది. మెర్సినా టీచర్ శీనుని హెడ్మిస్ట్రెస్ దగ్గరికి తీసుకెళ్లింది. ఆ రోజు ఆమె చెప్పిన మాటలు శీనుకి ఇప్పటికీ చెవుల్లో మార్మోగుతున్నాయి.

"చదువు డబ్బుకంటే గొప్పది. చదువు అనే డబ్బు నీ దగ్గరుంటే, డబ్బే నిన్నెతుక్కుంటూ నీ దగ్గర కొస్తుంది. బాగా చదువుకుని మన స్కూలుకి పేరు తేవాలి." అని 'టైంపీస్' బహుమతిగా ఇచ్చింది.

దాన్ని ఎంతో మురిపెంగా ఇంటికి తీసుకెళ్లి తల్లికి, అక్కకి చూపించాడు. అలారం పెట్టుకుని ఉదయం ఐదు గంటలకి నిద్ర లేచేవాడు. అది మూణ్ణాళ్ల ముచ్చటే అయింది. ఎప్పుడు చూశాడో సాంబయ్య దాన్ని, ఇప్పుడది సారాయి కొట్లో కాలాన్ని తిప్పుతోంది.

మెర్సినా టీచర్ మాటల ప్రభావంతో నైతేనేం, కొడుకుని బాగా చదివించాలన్న తపన వల్లయితేనేం, గవర్నమెంటు స్కూల్లో చదువుకుంటున్న కూతుర్ని స్కూలు మాన్పించి, తనతో కూలికి తీసుకెళ్తూ, ఇద్దరూ తెచ్చే కూలి డబ్బుల్తో, ఇల్లు గడుపుతూ, శీనుకి పుస్తకాలకి, ఫీజులకు డబ్బు ఇచ్చేది గౌరమ్మ.

శీను ఆరో తరగతికొచ్చాడు. నాగపట్నం మేరీమాత గుడికెళ్ళిన మెర్సినా టీచర్ కుటుంబమంతా 'సునామీ' బారినపడి మరణించారు. వారం రోజుల తర్వాత ఈ విషాద వార్త విన్న స్కూలు యాజమాన్యం మెర్సినా టీచర్‌కి ప్రేయర్లో నివాళి అర్పించి స్కూలుకి ఆ రోజు సెలవిచ్చింది. మెర్సినా టీచర్ మరణం శీనుపై తీవ్ర ప్రభావం చూపింది. తోటి పిల్లలతో, తల్లితో, అక్కతో మెర్సినా గురించే... చెప్పేవాడు కొన్నాళ్ల వరకూ.

మెర్సినా టీచర్ గుర్తుకు రావటంతో మనసంతా మొద్దుబారినట్టయింది. శీను ఆలోచనలు కాన్వెంటు క్యాంపస్ నుంచి కూచున్న చోటికి తిరిగొచ్చాయి.

అప్పుడే ఓ ప్యాసింజరు రైలు ప్లాట్‌ఫారం లోకి ప్రవేశించింది. ప్లాట్‌ఫారంలో పిల్లలు... కుంటివాడు, కూలివాడు, అడుక్కునేవాడు, పాలిష్ వాలా, రైల్లో ఊడుస్తూ అడుక్కునేవాడు ఎవరి పనుల్లో వాళ్లు నిమగ్నమయ్యారు. వాళ్లలో పెద్దన్న కన్పించలేదు.

"సార్! సార్! ఒక్క రూపాయుంటే ఇయ్యి సార్ టీ తాగుత. రెండ్రోజుల్నుంచీ ఏమీ తిన్లేదు సార్" అంటూ ఓ ప్యాసింజరు వెంటబడి అడుక్కుంటున్నాడు, ఓ ప్లాట్‌ఫారం కుర్రాడు. ప్యాసింజరు వాణ్ణి ఎగాదిగా చూశాడు. పెరిగిన జుట్టు, మాసిన బట్టలు, మడిచిన పెద్ద ప్యాంటు. అది నడుము దగ్గర జారిపోకుండా దానికో బెల్టు, పెద్ద వాళ్ళ చొక్కా ఇన్ చేసుకున్న ఆ పన్నెండేళ్ల కుర్రాడు దిష్టి బొమ్మలా కన్పించాడు.

మళ్లీ వాడు "సార్! సార్! ఒక్క రూపాయి ఇయ్యి సార్" అనంటుంటే... వాణ్ణే చూస్తున్న శీనూకు ఆకలికి ఆగలేక... తనూ అలా అడుక్కుంటే... అనే ఆలోచన కల్గింది.

"ఈ సూట్కేసు బయటిదాకా తీసుకు రా! రెండ్రూపాయలిస్తా" అన్నాడా ప్యాసింజరు.

ప్లాట్‌ఫారం కుర్రాడు ప్యాసింజర్ని పైకి కిందికీ చూసి, పరుగెత్తుకుంటూ ముందుకు బోయి మరో ప్యాసింజర్ని అడుక్కుంటున్నాడు.

బెంచీమీద కూచుని ఇదంతా గమనిస్తున్న శీను ఏదో అనుకుంటూ వెళ్ళిపోతున్న ఆ

ప్యాసింజర్ని చూసి తక్కున లేచి, గబగబా అతని దగ్గరికి పరుగెత్తుకెళ్లి,

"మీ సూట్కేసు నేను బయటికి మోసుకొస్త సార్" అన్నాడు.

అతడు అనుమానంగా శీనువైపు చూశాడు. మళ్లీ అంతలోనే ఏమనుకున్నాడో ఏమో...

"సరే! తీసుకురా!" అని సూట్కేసు చేతికి చ్చాడు. కాస్త బరువుగానే ఉంది. అయినా దాన్ని తల మీదుంచుకుని ఆయన వెనక బయటికి నడిచాడు శీను.

చేతిలో రెండ్రూపాయల బిళ్లలుంచి,- "చిన్న వయసు నుండే అడుక్కోవటం అలవాటు చేసుకోకు. కష్టపడి సంపాదించటం నేర్చుకో" అనెళ్ళిపోయాడు ప్యాసింజరు.

శీను చెవుల కామాట వేదమంత్రంలా విన్పించింది. చేతిలో ఉన్న రెండు రూపాయల బిళ్లల వైపు తృప్తిగా చూస్తూ,

అడుక్కోవటంలో ఉండే అసహ్యాన్ని చూసి, కష్టం చేసి సంపాదించుకోవడంలో ఉన్న ఆనందాన్ని, తొలి సంపాదనతో అనుభవిస్తూ... బన్ను కొందామని బేకరీ స్టాల్ వైపు అడుగులేశాడు. వెనకనించి, పన్నెండేళ్ల "రేయ్! ఆగరా!" అంటూ అంతకు ముందు ప్యాసింజర్ని అడుక్కున్న కుర్రాడు శీను ముందుకొచ్చి,

చిన్న వయసు నుండే అడుక్కోవటం అలవాటు చేసుకోకు. కష్టపడి సంపాదించటం నేర్చుకో అనెళ్ళిపోయాడు ప్యాసింజరు. శీను చెవుల కామాట వేదమంత్రంలా విన్పించింది

"ఏరా! నువ్వేమైనా రౌడీవా? పిచ్చి నాయాలా...! సంపేస్త... నా కొడకా! ముందు మర్యాదగా ఆ డబ్బులియ్యి" అన్నాడు జబర్దస్తీగా.

"నా దగ్గెర రెండ్రూపాయలే ఉన్నయ్. నేను నిన్నట్నుంచీ ఏమీ తిన్లేదు. కళ్ళు తిరిగి పోతున్నయ్" అన్నాడు శీను నెమ్మదిగా.

"ఏంటిబే... తియ్... ముందు రూపాయ్ తియ్..." అన్నాడు ఆ పిల్లాడు శీను మీద చెయ్యేసి.

వాడి ధాష్టీకం చూసి, చేతిలో ఉన్న రెండు రూపాయల బిళ్ళల్లో ఒకటి తీసి వాడికి చ్చాడు.

"ఎవరనుకున్నవో కొడకా! రప్ఫాడిస్తా" అంటూ సినిమా హీరో లెవెల్లో స్టైల్లిచ్చి వెళ్ళిపోయాడు.

చేతిలో మిగిలున్న రూపాయి బిళ్ళవైపు దీనంగా చూసుకుంటూ, అడుగులో అడుగేసుకుంటూ బేకరీ దగ్గరకెళ్ళాడు. సీసాల్లోని తినుబండారాల వైపు ఆకలితో ఆశగా చూస్తుంటే...

"ఏం గావాలరా? " అన్నాడు షాపు యజమాని.

"బన్నియ్యన్న"!

"రెండ్రుపాయలవుద్ది"

"రూపాయిది ఇయన్నా"

శీనుని ఎగాదిగా చూసి... చిన్న బన్ని చ్చాడతడు.

ఇర్వై గంటల ఆకలికి బన్ను ఏ మూలకి? గబగబా తిన్నాడే గానీ... ఆకలి ఇంకా అడుగుతూనే ఉంది. నీళ్ళ ట్యాప్ దగ్గరకెళ్ళి కడుపు నిండా నీళ్ళు పట్టించాడు.

అంత క్రితం కన్పించిన పిల్లలెవరూ స్టేషన్లో కన్పించలేదు. శీను టైము చూశాడు. పది గంటలు దాటింది.

ఫస్ట్క్లాస్ వెయిటింగ్ హాలు ముందున్న టి.వి. దగ్గర కొచ్చి, ఖాళీగా ఉన్న బెంచీమీద కూచుని టి.వి. చూస్తున్నాడు.

కాసేపు సినిమా పాటలు, వ్యాపార ప్రకటనలు చూశాడు.

టి.వి.లో శీను వయసు కంటే కొంచెం పెద్దగా కన్పిస్తున్న 'గోపీకృష్ణ' అనే కుర్రాడితో ఇంటర్వ్యూ వస్తోంది. ఇటీవల హైదరాబాద్లో జరిగిన చెస్ కాంపిటీషన్స్లో పాల్గొని ఛాంపియన్ షిప్ సాధించిన సందర్భంగా అతడితో వస్తున్న ఇంటర్వ్యూ అది.

"గోపీకృష్ణా! నువ్వు చదువునీ, చదరంగాన్నీ రెంటినీ ఎలా బ్యాలన్సు చెయ్యగల్గుతున్నావు" అని అడిగాడు టి.వి. యాంకర్.

"నేనివ్వాళ ఛాంపియన్‌గా నిలవడానికి కారణం నా పేరెంట్స్. మా నాన్నగారు నా ఇంట్రస్ట్ చూసి, నన్ను ప్రోత్సహించారు. అమ్మ నన్ను చదివిస్తూ, సమయం దొరికినప్పుడల్లా నాతో చెస్ ఆడుతుండేది. నాన్న తయారుచేసిన టైం టేబుల్‌లో చెస్ టైము, చదువు టైము రెండూ ఉండేవి."



తన ప్రగతికి కారణం తన తల్లిదండ్రులే అని గోపీకృష్ణ ఇంటర్వ్యూలో చెప్పటం విన్న శీను మనసు మళ్ళీ మూగ బాధల్లో కెళ్ళింది.

ఏనాడూ తన గురించి గానీ, తన చదువు గురించి గానీ పట్టించుకోలేదు తండ్రి. పై పెచ్చు చదువును చీదరించుకునేవాడు.

తనకు రాని చదువు తన కొడుక్కి అందా లని అక్షర జ్ఞానం లేకపోయినా-లోకజ్ఞానం తెల్సిన తల్లి ఆరాటపడేది.

అమ్మ గుర్తుకు రాగానే శీను మనసు రివ్వున ఇంటికి ఎగిరిపోయింది.

6

"యాడే నీ కొడుకు? రేత్రంతా ఏడకి సచ్చినాడే? యాడికి బంపినావే దొంగ..." తాగిన మత్తులో తిడుతూ, తూలుతూ మీది మీది కొస్తున్న సాంబయ్యని ఒక్క నెట్టు నెట్టింది గౌరమ్మ.

"ఏందయ్యా మీది మీదికొస్తా ఉండావు... నీ వొల్లనే గదా! ఆడు ఇల్లొదిలిబోయింది. కన్న కొడుకని సూడకుండా కాలే కట్టెతో చేతి మీద కాల్చినావే... నువ్వు మణిసివా? రాచ్చసుడివా? బిడ్డవుపడక నేనేడుస్తా వుంటే... మీది కొస్తావున్నావా... మీదికి" అంది గౌరమ్మ ఏడుస్తూ.

"లచ్చిమీ... శీను బడి మానడే... ఆడికి సదువంటే పేణమే... తొందరగెల్లి ఓసారి బళ్ళో జూసిరా" అంది ముక్కు చీదుతూ.

శీను చదువుతున్న స్కూలుకి వెళ్లి పది గంటలకి తిరిగొచ్చింది లక్ష్మి.

"స్కూలుకి రాలేదంటమ్మా" అంది, దీనంగా తల్లి పక్కన చతికిలబడుతూ.

"యాడికి బోతివిరో కొడకో! యాడని ఎతి కేది నిన్ను? తాగుడు తప్ప వేరే లోకం లేని మొద్దులయిన ఈ మొగుడితో నేనేం జెయ్యాల దేవుడో..." గౌరమ్మ కడుపు కోతకు, శోకానికి అంతం లేకుండా ఉంది.

"ఊర్కోమ్మా! మల్ల సాయంత్రం బోయి చూసొస్త. శీను యాడికి బోడులే. సాయం త్రం వస్తాడు చూడు" అని తల్లిని ఓదార్చే ప్రయత్నం చేస్తోంది లక్ష్మి.

ఆరోజు తల్లీ కూతుళ్ళు కూలి పన్లోకి బోలే దు. ఊళ్ళో పగలంతా వెతికి, వెతికి, పాకాల వెళ్ళి బస్టాండు, రైల్వే స్టేషను, తెల్సిన చోట్లన్నీ గాలించి సాయంత్రానికి స్కూలు కెళ్ళింది గౌరమ్మ.

నిన్న పరీక్ష ఫీజు కట్టేళ్ళాడని... ఈ రోజు రాలేదని చెప్పారు.

గౌరమ్మ హెడ్ మిస్ట్రెస్‌ని కలిసింది.

"శీను మంచి స్టూడెంట్. వాడికి చదు వంటే ఇష్టం. తప్పకుండా వస్తాడు. అసలేం జరిగింది? ఎందుకు వెళ్ళాడు?" అనడిగేస రికి గౌరమ్మ జరిగిందంతా చెప్పింది.

"పిల్లల్ని పెంచే పద్ధతా ఇది? వాడి పసి ఒంటి మీద కాదు నీ భర్త వాత బెట్టింది, వాడి మనసు మీద! చదువుకుంటానంటే వద్దంటున్న వాణ్ణి... నీ భర్తని... ముందు జైలుకి పంపాలి. నువ్వెళ్లి మీ ఆయన్ని పంపు" అంది ఆవేశంగా హెడ్‌మిస్ట్రెస్.

మౌనంగా ఏడుస్తూ నిలబడ్డ గౌరమ్మని చూసి,

"ఏడవకు. ఈ రోజు రాకపోతే పోలీసు కంప్లయింటిద్దాం" అంది అనునయంగా.

ఆమాత్రం ఓదార్పు ఎన్నడూ ఎరుగని గౌరమ్మ కళ్ళు కొడుకు కోసం జలజలా కన్నీళ్లు కార్చాయి.

* * *

గోపీకృష్ణ ప్రోగ్రాం చూసిన శీను మన సంతా తల్లి గౌరమ్మ ఆక్రమించుకుంది.

గౌరమ్మ... సరైన తిండి లేక, ఎండి పోయి బక్కగా గాలికి పడిపోయేట్టుం టుంది. పగలంతా కూలి కెళ్లి, రెక్కలు ముక్కలు చేసుకుని పిల్లల కోసం కష్టపడు తుంది. తన కష్టాలు తన పిల్లలకి రాకూడ దని, చదువు విలువ తెల్సుకున్నది గాబట్టే ఇద్దర్నీ చదివిస్తుంటే, తాగుడికి బానిసైన సాంబయ్య గౌరమ్మ సంపాదనపై కన్నుకుట్టి వేధిస్తూ, కొడుతూ, తిడుతూ సాయంత్రానికి

సారా కోసం కూలి డబ్బుల్లో సగం ఖాళీ చెయ్యడం అలవర్చుకున్నాడు. మొగుడితో ప్రతిరోజు పోరాడలేక పరువు కోసం... స్కూలుకి పోతున్న కూతుర్ని మాన్పించి, కూలికి తీసుకెళ్లడం మొదలెట్టింది.

ఇన్నాళ్లూ తనూ ఏదో ఒక పన్జేస్తూ ఎంతో కొంత తన అలవాట్లకి సంపాదించు కుంటున్న సాంబయ్య కూతురు కూలికి పోవటం చూసి పనిచెయ్యటం మానేసి పరాన్నజీవిగా పెళ్లాం పిల్లల సంపాదన మీద బతుకుతూ, తన తిండికీ, తాగుడుకీ లోటులేకుండా నోరు పెట్టుకుని బతుకుతు న్నాడు.

అనారోగ్యంగా ఉన్న గౌరమ్మ ఒక్కరోజు కూలికెళ్లకపోయినా ఊర్కోడు సాంబయ్య. ఆరోజు తిట్లు, తన్నులూ తప్పవు. మొగుడి హింస తట్టుకోలేక కూలికెళ్లటమే నయమ నుకుని వెళ్తుంది.

ఒకసారి రెండ్రోజుల్నుంచీ జ్వరంగా ఉన్నా, కూలికెళ్లి పన్జేసే శక్తిలేక కింద పడి పోయిన గౌరమ్మని గవర్నమెంటాసుపత్రికి తీసుకెళ్లారు తోటి పనివాళ్లు.

"రక్తం తక్కువగా ఉందని చెప్పి మందు లు రాసిచ్చారు డాక్టర్లు. తిండికే చస్తా వుంటే... మందులకెక్కణ్ణించి తేవాలి" అను కుంటూ ఇంటికొచ్చింది గౌరమ్మ.

ఇదేమీ తెలియనట్టు, తనకి సంబంధం లేనట్టు, తాగి తందనాలాడుతున్నాడేగాని, కనీసం పెళ్లానికేమైందని కూడా అడగలేదు సాంబయ్య. పైగా కూలి కెందుకెళ్లలేదని నిలదీశాడు.

"అమ్మకి జొరం" తండ్రి మీద ఉక్రోషా న్నంతా గొంతులో పలికించిన శీను మాటల్ని అతడు పట్టించుకోలేదు.

"దానికి రోగమైతే, నువ్వేం జేస్తున్నవే ఇంట్లో" అని తల్లికోసం టీ కాస్తున్న లక్ష్మి మీదకెళ్లబోయాడు.

కుక్కిమంచంలో నీర్సంగా పడుకున్న గౌర మ్మ మొగుడు మాటలు విని "ఇంట్ల అన్న మొవురు వండుతారు?" అంది. సాంబయ్య తూలుతూ చదువుకుంటున్న శీను మీదికె ళ్లాడు.

"ఆడి జోలికెళ్లమాక..." అని భార్య బతి మాలుతున్నా వినలేదు.

"ఏరా! నా కొడకా! నువ్వేం జేస్తున్నవురా! సదువు సదువు అంటూ పొద్దుగాల బోయి, రేత్రికి రావటం. అసలు... నిన్ను... నాయాల నడు... కూలికి నడు" అని శీను చేతిలో ఉన్న పుస్తకాలు లాగి విసిరేసి, చెయ్యి పుచ్చుకుని జరజరా లాక్కెళ్లి రైసుమి ల్ లో కూలిపనికి దించెళ్లాడు.

సాయంత్రం దాకా పన్జేసి, వంటినిండా దుమ్మూ, ధూళితో, ఆకలితో ఆవురావురు మంటూ ఇంటికొచ్చిన శీనుని చూసి బావు రుమంది గౌరమ్మ.

గబగబా లేచి చట్టిలో ఉన్న అన్నం తుడిచి కొడుక్కి పెట్టింది.

ఆకలికి ఆబగా తింటున్న కొడుకుని చూస్తూ...

"ఆణ్ణే ఏదన్నా తిని రాకపోతివా కొండా! సూడు ఎంత ఆకలేసిందో..." అంది.

"నాయన కూలీ డబ్బు, పద్దున్నే పట్టుకు పోయిండంట" ఆ మాట వింటూనే గౌర మ్మకి భర్త గొంతు పిసికి చంపెయ్యాల న్నంత కోపం వచ్చింది.

"రేపట్నుంచీ నువ్వు బడికి బో... నేను పనికి బోతలే"

"అమ్మా! నువ్వెల్లొద్దమ్మా! నీకు జొరం తగ్గలేదు. నేను, అక్క కూలికి బోతం లే"... అన్నాడు శీను.

"వొద్దురా! నా కొడకా! సదూకునే వొయ సులో సంపాదనకి మరిగితే, సెడు అలవా ట్లబ్బి, బతుకంతా బుగ్గి అవుద్ది. నీకా బతు కొద్దు. నువ్వు సక్కంగ సదూకుని అక్కని మంచిగా జూసుకుంటే నాకంతే చాలు"

"నాయనూకోడమ్మా సదూకుంటే"

"ఆడేంది ఊకునేది! అదంతా నే జూసు కుంట. నువ్వు పొద్దుగాల్నే బడికి బో"

అంది గౌరమ్మ కొడుకుని దగ్గరకి తీసుకుని.

ఆ రోజు రాత్రంతా సాంబయ్య ఇంటికి రాలేదు. మరుసటి రోజు పొద్దున్నే రోడ్డుమీద తూలుతూ వస్తున్న సాంబయ్యకి, ఎదురుగా స్కూలు కెళ్తున్న శీను కన్పించాడు. కళ్లు నులుము కుని చూసి దగ్గరికి రాబోతుంటే, తప్పుకుని స్కూలుకి పరుగెత్తాడు శీను.

"అరేయ్! ఆగరా! మిల్లులో కూలీకెల్లకుండా, మల్లా ఇస్కూలు కెల్తున్నావంట్రా దొంగ నాయాల" అంటూ పరుగెత్తుతున్న శీనుని బూతులు తిడుతూ ఇల్లు చేరాడు.

లోపలికొస్తూనే "యాందే... ఎదవ...! నువ్వు నాకు మొగుడివా? నేను నీకు మొగుణ్ణా! నా మాటకి ఇలవ లేదంటే... నీ..., తేలిపోవాల, ఇయ్యాల తేలాల" అంటూ మీదకొస్తున్న సాంబయ్యని విసురుగా పక్కకి నెట్టింది గౌరమ్మ.

"ఏంటి? పద్దన్నే నీకు పనీపాటా లేదని, నేనూ నీతో వాగుతూ కూకుంటే తిండెలా వస్తుంది. తప్పుకో" అంది.

"నిన్నెవుడు బొమ్మన్నాడే! రోగం, అంటావుంటివి గద. అందుకే ఆణ్ణి మిల్లుల పనికి బెట్టిన... మల్లీ ఆణ్ణి నువ్వు ఇస్కూలుకి పంపుతావంటే దొం..."

"ఆపు... సిగ్గులేదూ నీకు? ఆడు సదూకుంటానంటే వొద్దనే వోడివి నువ్వు తండ్రివేనా? ఛీ! ఎదవ బతుకు. పోయ్యా, పోయి... ఇంద ఈ పది తీస్కబొయ్యి సారా తాగి సావు" అంటూ కూతుర్ని తీసుకుని బయటపడ్డది గౌరమ్మ.

"నాయల్డి నోరు జేసుకుంటేనే కాసులు ఇస్తాంది. ఇదేదో బాగుండాదే. జూస్త, దీని పనిజెప్త" అంటూ ఇంటి ముందున్న అరుగుమీద వాలిపోయాడు... కాదు, తూలిపడ్డాడు.

* * *

పెద్దగా కలకలం విన్పించేసరికి, అంతవరకూ ఇంట్లో తిరిగిన శీను మనసు, స్టేషనుకి తిరిగొచ్చింది ఉలిక్కిపడి లేచి నుంచున్నాడు.

అప్పటిదాకా పరిసరాల్ని మరిచిపోయిన శీను చుట్టూ చూశాడు. ఆగిన రైల్నుంచి బిలబిలమంటూ దిగుతున్న ప్రయాణీకులు, బెంచీలు ఖాళీల్లేక, ఎక్కడి వాళ్ళక్కడే కూచుంటున్నారు. వాళ్ళే భాష మాట్టాడుతున్నారో శీనుకి అర్థం గావటం లేదు... కానీ పిల్లా జెల్లాలతో, తట్టా బుట్టలతో ఓ ప్రదేశం నుండి మరో ప్రదేశానికి వలసబోయే కూలీల్లా ఉన్నారు.

స్టేషనంతా పరికించి చూశాడు. ఆగిన రైలు దగ్గర పెద్దన్న అతని చుట్టూ ఆరేడుగురు ప్లాట్‌ఫారం పిల్లలు నిలబడున్నారు. పెద్దన్న కోపంగా వాళ్లకేదో చెప్తున్నాడు. వాళ్ళలో ఓ పిల్లాడు పెద్దన్న వైపు భయంగా బిక్కుబిక్కుమని చూస్తున్నాడు.

ఆపు...
సిగ్గులేదూ నీకు?
ఆడు సదూకుంటా
నంటే వొద్దనే వోడివి
నువ్వు తండ్రివేనా?
ఛీ! ఎదవ బతుకు.
పోయ్యా, పోయి...
ఇంద ఈ పది
తీస్కబొయ్యి సారా
తాగి సావు ...



పెద్దన్న కళ్ళెర్రజేసి, భయపడ్తున్న వాణ్ణి బలంగా చెంపమీద కొట్టాడు. వాడు ఏడుస్తున్నాడు. మిగిలిన పిల్లలు వాణ్ణి పక్కకి తీసుకెళ్ళారు. పెద్దన్న తనున్న వైపే వస్తుండటంతో... శీను వేగంగా ఎదురుగా ఆగి ఉన్న రైల్లో ఎక్కాడు.

జనరల్ బోగీ... ఖాళీగా వుంది. ఒకళ్ళిద్దరు తప్ప ప్యాసింజర్లెవరూ లేరు. పెద్దన్న తనవైపొస్తాడేమోనని, భయంగా కిటికీ నుండి చూశాడు. కన్పించలేదు.

"హమ్మయ్య" అనుకుని కూచున్న శీను మళ్ళీ అలోచనలో పడ్డాడు. ఇల్లు, తల్లి, స్కూలు, చదువు చుట్టే ఆలోచనలు పరిభ్రమిస్తుండటంతో... ఇంటికెళ్ళిపోవాలని నిర్ణయించుకున్నాడు.

తండ్రి కొట్టినా, వాతలు పెట్టినా, ఇంట్లో 'అమ్మ ప్రేమ' తనకి అండగా ఉంటుంది. అమ్మ ప్రేమ గుర్తుకు రాగానే ఆపై శీను మనసు మరో ఆలోచనకి తావివ్వకుండా ఇంటికెళ్ళిపోవాలని నిర్ణయించుకుంది. దాంతో నిశ్చింతపడి కాళ్ళు ముడుచుక్కూచుని కళ్ళు మూసుకున్నాడు. ఆకలి కడుపును దేవేస్తుంటే రైలు బయల్దేరే లోపల నీళ్ళు తాగొద్దామని లేవబోయాడు.

అంతలో, "రేయ్, లెగరా. నువ్వీడ కూచున్నావేంట్రా! లే! నాయాల లే!" అంటూ శీను మోచేతి పైభాగం పట్టుకుని లాగారెవరో.

"అమ్మా!" అని బాధగా లేచి నుంచుని, అక్కడున్న నలుగురు పిల్లలవైపు అసహనంగా చూశాడు శీను.

కాలిన పుండు మీద నీటి బొబ్బ చితికి నీరు కారడంతో పుండు మంట పుట్టసాగింది.

అంతకు ముందు తన దగ్గర రూపాయి లాక్కున్న కుర్రాడితోపాటు మరో ముగ్గురున్నారు.

"ఏందిరా! చేతికేమైనాది!" అని తడి చెయ్యి శీను చొక్కాకి తుడుచుకున్నాడు, చెయ్యి పట్టుకు లాగిన కుర్రాడు.

పళ్ళ బిగువున బాధ, కోపం బిగబట్టుకుని అక్కణ్ణుంచి వేగంగా ముందుక్కదిలి రైలు దూకేశాడు శీను.

"రేయ్... ఆగరా! ఆగు బే... ఆగు" అంటూ వెంబడించారా కుర్రాళ్ళు.



## గాంధీజీ చతురోక్తులు

జాతిపిత బాపూజీకి ఉన్న మహత్తర లక్షణాలలో హాస్య ప్రియత్వం ఒకటి. సంభాషణల్లో తరుచుగా మహాత్ముడు చతురోక్తులను గుప్పించేవారు. ఆయన హాస్యం మనసుకు హాయిని కలిగిస్తుంది. పదేపదే జ్ఞప్తికి వస్తూ, కితకితలు పెడుతుంది. సువర్ణానికి సువాసన అబ్బినట్లు – బాపూజీ వ్యక్తిత్వానికి ఈ హాస్య ప్రియత్వం మరింత వన్నె తెచ్చింది! గతంలో బాపూజీ చతురోక్తులు కొన్ని పాఠకులకు అందించాం. ఇప్పుడు మరికొన్ని...

### ఎవరీ మోడల్...?

ఒకసారి ఒక చిత్రకారుడు బాపూజీ బొమ్మను చక్కగా గీసి, దాని మీద ఆయన సంతకం చేసిన తర్వాత తనకు పంపమని కోరాడు. మహాత్ముడు ఆ చిత్రాన్ని ఎగాదిగా చూశారు. దాని కింద, "ఎవరీ అసహ్యంగా వున్న మనిషి? ఇతగాడినా నువ్వు మోడల్‌గా ఎన్నుకొంది? " అని రాసి, తన సంతకం చేసి చిత్రకారునికి పంపారు.




ఉన్నట్టుండి ఆకాశం మేఘావృతమైంది. ఆకాశంలో నల్లటి మబ్బులు వేగంగా పరుగెడుతూ చీకట్లు కమ్ముతున్న వాతావరణం. వేగంగా వీస్తున్న గాలికి దుమ్ము, ధూళి లేస్తోంది. వరుణుడు ఇక ఆగలేనన్నట్టు క్షణాల్లో టపటపమని పడటం మొదలైన చినుకులు, క్రమంగా పెరిగి ఉధృతమయ్యాయి. గాలిని ఎవరో ఆగమన్నట్టు స్థంభించి వర్షం నిలకడగా కురవసాగింది.

వర్షం పెద్దగా రావటంతో, తనని తరుముకొస్తున్న కుర్రాళ్లని తప్పించుకోవటం శీనుకి సులభమయ్యింది.

ప్లాట్‌ఫారం చివరికెళ్లి ఓ స్తంభం పక్కన కూచున్నాడు. ఆకలి, చలి, మీద పడ్తున్న వర్షపు చినుకులు అన్నీ ఒకేసారి శీను మీద యుద్ధం చేస్తున్నట్టన్పించింది.

ఇంతలో "అరేయ్ వీరిగా, ఎంకటేశూ, మల్లేశూ రండ్రా! ఈడ కూసుందాం" అని పిల్లల్లో ఒకడు కేకపెట్టడంతో ఆ పరిసరాల్లో తిరుగుతున్న ఆ పేర్లు గలవాళ్లు గబగబా వచ్చి చేరారు.

అందరూ ఓ బెంచీమీద కూచున్నారు. వాళ్ల వెనక స్తంభం పక్కన శీను కూచున్నాడు. వాళ్లు శీనుని చూళ్లేదు.

"ఎంకటేశూ... జాన్సన్‌గాడు అగుపడలేదు. ఏడికి బోయినాడ్రా" అడిగాడు మల్లేశు.

"ఆడికి పెద్దన్న నైట్‌డ్యూటీ ఏపిచ్చిండంట్రా!"

"ఏడ? " ఆశ్చర్యంగా అడిగాడు వీరిగాడు.

"బ్రాందిషాపు ముందు వందన బ్రదర్స్ బట్టలకొట్టు ముందు మిక్కీమవుసుల్లా... దాని మాదిరి ఏసం ఏస్కుని బ్రాందీషాపు ముందు నుంచోవాలంట"

"బ్రాందీషాపు ముందెప్పుడు అలాంటి బొమ్మల్ని చూళ్లేదే..." డౌటు బయట పెట్టాడు మల్లేశు.

"నాకు తెల్వదురా... ఆడు నిన్న అవుపడి చెప్పిండు"

"సర్లేరా! రమేషూ! మా అందరికీ చాయ్ తీస్కరా, పో! చలి పెడ్తుంది" అన్నాడు వీరిగాడు.

"అరే, పైసలెక్కడున్నయ్ భయ్! పొద్దుగాల పదిరూపాయలొస్తే పెద్దన్న ఐదు రూపాయలు లాక్కున్నడు. ఆకలేస్తంటే ఇడ్లీ తిన్న"

"ఏరా! ఎంకటేశూ... నువ్వా!"

రెండు ప్యాంటు జేబుల్నీ, చొక్కా జేబుల్ని బయటికి తీసి చూపించాడు.

"థూ! నీ ఎవ్వ..." అని వీరిగాడు మల్లేశు మొహం వైపు చూశాడు.

వాడూ తెల్లమొహం వేశాడు.

"ఛ! పెద్దన్నెటు బోయిండ్రా!" వెంకటేషుని అడిగాడు.

"అవుపళ్లేదు ఈరన్నా!"

వర్షం ఉధృతమయింది.

వీరిగాడు చెవులో ఉన్న సగం కాల్చిన సిగరెట్ తీసి, ముట్టించి గట్టిగా పొగ పీల్చి వదుల్తున్నాడు.

అప్పుడే ఒకటో నంబరు ప్లాట్‌ఫారం మీదకు చిత్తూరు ప్యాసింజరు రాబోతోందన్న అనౌన్సుమెంటు విన్పించింది.

కూచున్న పిల్లలెవరిలోనూ కదలిక లేకపోవటంతో...

వీరిగాడు ఆశ్చర్యంగా "ఏంట్రా! ఎవుడూ కదలటం లేదు" అన్నాడు.

"గీ ప్యాసింజర్ల, ఈ వర్షంల ఎవుడు దిగుతాడన్నా"అన్నాడు. మల్లేశు...తల గోక్కుంటూ.

ఉన్నట్టుండి టి.వి. లో -

"తెలుగోడి స్టైలూ, నాటు కొట్టుడి బీటూ" అని పాట మొదలయ్యింది. మల్లేశు లేచి లారెన్స్‌లాగా డ్యాన్సు చేస్తుంటే పిల్లలంతా

పగలబడి నవ్వుతూ క్లాప్స్ కొడ్తున్నారు.

తన సైజుకన్నా పెద్దసైజు ప్యాంటుని పైకి మడిచి, పెద్దచొక్కా అందులో ఇన్‌షర్టు చేసి నడుం దగ్గర జారిపోకుండా, తాడుతో కట్టుకు న్నాడు. చింపిరి జుట్టు. ఇదీ మల్లేశు ఆకారం టి.వి.లో పాట ఆగిపోయినా మల్లేశు ఆట ఆగలేదు. బయట వర్షం. మల్లేశు వళ్లంతా చెమటతో అలిసిపోయి రొప్పుతూ కూచు న్నాడు.

ఒకతను మల్లేశు దగ్గరకొచ్చి, ఐదు రూపా యలిచ్చి, "సినిమాల్లోకి పోరా... బ్రహ్మాం డంగా డ్యాన్సు చేస్తా ఉండావు" అనెళ్లాడు.

స్తంభం చాటునుండి మల్లేశు డ్యాన్సు చూసిన శీను ఆశ్చర్యపోయాడు. మనసు లోనే అనుకున్నాడు మల్లేశులో మంచి డ్యాన్సరున్నాడని.

సరిగ్గా అప్పుడే... చిత్తూరు ప్యాసింజరు ప్లాట్‌ఫారం మీద కొచ్చింది. రమేషు చెప్పి నట్లే... ప్యాసింజర్లెవరూ పెద్దగా దిగ లేదు.

"రేయ్... వీరిగా... అటు సూర్రా" అన్నాడు వెంక టేశు. ఓ పెద్దాయన సూట్ కేసు తీసుకుని వర్షంలో తడుస్తూ, గబగబా అడుగు లేసుకుంటూ ప్లాట్‌ఫారం పైకి వస్తున్నాడు. అతడి పక్కనే నడుస్తూ శీను ఏదో అడుగుతున్నాడు.

పిల్లలంతా అటువైపు చూస్తున్నారు ఆసక్తిగా.

"సార్, పెట్టె నే మోస్త... రెండ్రూపాయలి వ్వండి" అంటూ వెంట పడ్తున్న శీనుని చూసి...

"నువ్వు మొయ్యలేవురా! బరువుగా ఉంది" అన్నాడా పెద్దాయన వేగంగా నడుస్తూ.

"నాకలవాటే సార్! మోసుకొస్త... ఇయ్యండి సార్" అనేసరికి, ఏమనుకున్నాడో ఏమో... పెద్దాయన పెట్టె శీను తలమీద పెట్టి, "మెల్లగా రారా! వాన పడ్తాంది" అని వర్షంలో వేగంగా అడుగులేస్తూ వస్తున్నాడు.

బరువుగా ఉన్న పెట్టెని మోస్తూ శీను ఆయన వెనకే వస్తున్నాడు.

అప్పటివరకూ చూస్తూ బెంచీమీద కూచున్న వెంకటేశు లేచి నుంచున్నాడు.

"ఏంట్రా! నుంచుండావు... కూసో" వీరిగా డన్నాడు...

"ఇప్పుడు చూడు తమాషా' అని వేగంగా పరుగెత్తుకెళ్ళి శీనుని డాష్ కొట్టాడు.

అంతే! ఉదయం నుండీ ఏమీ తినని శీను, వెంకటేశు ఢీకొన్న వేగానికి బోర్లా పడిపో యాడు. సూట్ కేసెళ్ళి దూరంగా పడింది.

శీనుకి మోకాళ్ళు, మోచేతులు, మొహానికి దెబ్బలు తగిలాయి.

ఆ బాధకి "అమ్మా" అని అరిచాడు కానీ... వర్షపు హోరులో ఆ కేక ఎవరికీ వినపడ లేదు.

అప్పటివరకూ చూస్తూ బెంచీమీద కూచున్న వెంకటేశు లేచి నుంచున్నాడు. "ఏంట్రా! నుంచుండావు... కూసో" వీరిగాడన్నాడు... "ఇప్పుడు చూడు తమాషా' అని వేగంగా పరుగెత్తుకెళ్ళి శీనుని డాష్ కొట్టాడు

డాష్ కొట్టిన వెంకటేశం వేగంగా పరుగెత్తుకెళ్ళి, అప్పటికే ప్లాట్‌ఫారంలోకి ప్రవేశించిన ఆ పెద్దాయనతో...

"సారూ! మీ పెట్టె ఆడు కింద పడేశిండు" అని చెప్పాడు. పెద్దాయన వెనక్కి తిరిగి చూశాడు.

అప్పటికే శీను లేచి, కాళ్లకీ, చేతులకీ కారుతున్న రక్తాన్ని తడి చేతులతో తుడుచు కుని, కిందపడ్డ సూట్కేసు చేత్తో పట్టు కుని, కుంటుతూ ప్లాట్‌ఫారంలో కొచ్చాడు.

పెద్దాయన గబగబా శీను దగ్గరకొచ్చి, సూట్ కేసు తీసుకుని "నువ్వు మొయ్యలేవు, వద్దురా అంటే వింటివా?" అని సూట్‌కేసు చూసుకుని కిందపెట్టి దానిమీద కూర్చు న్నాడు.

శీనుని చూసి "అరె అరె... బాగా దెబ్బ లు తగిల్నాయే... రక్తం కార్తా ఉంది. తుడుచుకో" అన్నాడు.

పక్కనే బెంచీ మీద కూచున్న పిల్లలు నవ్వుతున్నారు. శీను వాళ్ళవైపు తీవ్రంగా చూసేసరికి నవ్వాపేశారు. వెంకటేశం మాత్రం ఘనకార్యం చేసినట్టు కాలరెగరేసి, ముసిముసి నవ్వులు నవ్వుతున్నాడు.

పెద్దాయన జేబులోంచి పది రూపాయలు తీసి, శీనుకిస్తూ "ఒరేయ్! నీకు బాగా దెబ్బలు తగిలాయి. ఈ పది రూపాయలు తీసుకుని మందులు కొనుక్కో" అన్నాడు లేచెళ్ళబోతూ.

"బయటికి నేనే మోసుకొస్తే... రెండ్రూపాయలివ్వండి చాలు" అన్నాడు శీను సూట్కేసు పెద్దాయన చేతి నుండి తీసుకోబోతూ.

శీను మాటలకి పెద్దాయన ఆశ్చర్యపోయాడు. ముందు ఒక రేటు మాట్లాడి, తర్వాత ఎక్కువ ఇవ్వమని గొడవ పెట్టుకునే పెద్ద మనుషులున్న ఈ రోజుల్లో... పన్నెండేళ్ళ కుర్రాడు, మాట్లాడినంతే ఇమ్మని అడగటం ఆశ్చర్యంగా అన్పించింది.

"ఒరేయ్! ముందా రక్తం తుడుచుకో" అని వెళ్ళబోయేవాడల్లా ఆగి మళ్ళీ సూట్కేసు మీద కూచున్నాడు.

శీను కింద కూచుని మోచేతులు, మోకాళ్ల నుండి కారుతున్న రక్తాన్ని చేత్తో తుడుచుకుంటుంటే... బెంచీమీద కూచున్న పిల్లలు వింతగా చూస్తున్నారు.

ఆ పెద్దాయన "నీ పేరేంట్రా? " అన్నాడు.

"శీను"

"ఏ ఊరు? "

"వజ్రోరిపల్లి"

"చూస్తే చదువుకునే పిల్లకాయలా ఉండావు"

"సెవెన్త్ క్లాసండి"

"సెవెన్త్ క్లాసా? !" పెద్దాయన కాస్త ఆశ్చర్యంగా అడిగాడు.

బెంచీమీద కుర్రాళ్ళు అంతే ఆశ్చర్యంగా నోళ్ళెళ్ళబెట్టి చూస్తున్నారు.

"మరి చదువుకోకుండా ఈ పన్లేంట్రా? "

శీను ఏదో చెప్తుంటే...

"యువర్ అటెన్షన్ ప్లీజ్!... హైదరాబాదు వెళ్ళే నారాయణాద్రి ఎక్స్ప్రెస్ మరి కొద్ది సేపట్లో...." అని అనౌన్సుమెంటు విన్పించింది.

పెద్దాయన గబగబా లేచి... చేతిలో పది రూపాయలు కాకుండా, జేబులోంచి మరో పది రూపాయలు తీసి ఇరవై రూపాయలూ శీను చేతిలో పెట్టాడు.

"ఈ డబ్బుతో మందులు కొనుక్కో... ఇక్కడ తిరిగే పిల్లలతో చేరి చెడిపోకు... మీ ఊరెళ్ళి బాగా చదువుకో" అన్నాడు.

"అడుక్కోనండి! అడుక్కోవటమంటే... నాక సహ్యాం" అన్నాడు, స్వాభిమానం ఉట్టిపడే కళ్ళతో...

"దట్స్ గుడ్... నాకు రైలుకి టైమవుతోంది" అని పెద్దాయన కదలబోయాడు.

"ఇవి తీసుకుని రెండ్రూపాయలియ్యండి చాలు" అన్నాడు మళ్ళీ శీను.

"పోరా! పొయ్యి మందు వేసుకుని, ఏదైనా తిను" అంటూ వేగంగా ముందుకెళ్తున్న పెద్దాయనవైపు చూస్తూ నుంచున్నాడు శీను. అతడి చేతిలో ఇప్పుడు రెండు పది రూపాయల నోట్లున్నాయి. ఆ విషయం పక్కనే బెంచీ మీద కూచున్న పిల్లలకీ తెలుసు. అంతకు ముందు డాష్ కొట్టిన వెంకటేశు మళ్ళీ వచ్చి డబ్బు లాక్కెళ్తాడేమోనని జాగ్రత్తపడుతూ శీను వేగంగా... స్టేషన్లో ఉన్న బేకరీ వైపెళ్ళాడు.

శీను వెళ్ళిన వైపే చూస్తున్న పిల్లలు... ఈసారి శీను దగ్గరకెళ్ళే ధైర్యం చెయ్యలేకపోయారు.

ఎందుకంటే ఆ పెద్దాయన అడిగిన ప్రశ్నలన్నిటికీ అతడు తడుముకోకుండా చదువుకున్నవాడిలా బదులు చెప్పటమే.

బన్నులు, బిస్కట్లు తీసుకుని తమ దగ్గరకే వస్తున్న శీను వైపు పిల్లలంతా ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవి చేసి చూస్తుండిపోయారు. శీను వాళ్ళ దగ్గరకొచ్చి నిలబడేసరికి ఏం మాట్లాడాలో తెలీక... అందరూ మౌనంగా మొహాలు చూసుకుంటుండిపోయారు.

"నా పేరు శీను. మాది వజ్రోరిపల్లి. ఇంట్లో

నుంచి వచ్చేసిన. నేను సెవెన్త్ క్లాస్ చదువుతున్న. మా నాయన తాగొచ్చి మా యమ్మని కొడ్తా ఉంటే, చూళ్ళేక అడ్డుబోయిన. పొయ్యిలో కట్టెతో కాల్చిండు" అని చేతిలో ఉన్న బన్నులు బెంచీ మీదుంచి, చొక్కా పైకెత్తి కాలిన చెయ్యి చూపించాడు.

అంతా అలాగే మౌనంగా, ఆశ్చర్యంగా చూస్తున్నారు అతడి వంక. శీను 'తీస్కోండి' అని తలా ఓ బన్ను, బిస్కట్లు ఇస్తుంటే, ఎవరూ తీసుకోలేదు.

"ఫరవాలేదు తీస్కోండి" అని ఒక్కొక్కరి చెయ్యి పట్టుకుని వాళ్ల చేతుల్లో పెట్టాడు వెంకటేశు మాత్రం "నాకొద్దు" అన్నాడు తలొంచుకుని, తప్పు చేసిన వాడిలా.

"ఫర్వాలేదు తీసుకో" అన్నాడు శీను మళ్లీ.

"నాకొద్దని సెప్పేది నీక్కాదూ? " కాస్త గట్టిగా అన్నాడు వెంకటేశు.

"నువ్వు తినకపోతే నాకూ వొద్దు" అన్నాడు శీను. అతడు అలా అనే సరికి,

"మేమూ తీసుకోం" అని మిగిలిన పిల్లలంతా వంత పాడారు. కళ్లెత్తి శీనువైపు తిరిగి "సారీ!" అని శీను చేతిలో బన్ను, బిస్కట్లు తీసుకున్నాడు వెంకటేశు.

వాళ్ళంతా తింటుంటే శీను అందరి వంక ఒకసారి చిరునవ్వుతో చూసి, ఆ తర్వాత తనూ తింటూ, అక్కణ్ణుంచి వెళ్లబోయాడు.

"శీనూ" పిల్చాడు వెంకటేశు.

వెనక్కి తిరిగి చూశాడు. వాళ్ళంతా కూచున్న బెంచీమీద ఖాళీ చూపిస్తూ "రా!" అన్నారంతా ముక్త కంఠంతో.

"వద్దు, నే[నాను" అని ముందుకు అడుగులు వేశాడు.

వెంకటేశు, వీరిగాడు, రమేషూ లేచి వేగంగా శీను ముందుకెళ్ళి అతడికి అడ్డంగా నుంచున్నారు.

"వొద్దురా! నువ్వెక్కడికీ పోవొద్దు. మాతోనే ఉండు" అన్నాడు వెంకటేశు.

"ప్లీజ్! నేనెళ్ళిపోతాను. నేను మీతో ఉంటే మీ పెద్దన్న నా కాలు, చెయ్యి తీస్తానన్నాడు"

"పెద్దన్నకి మేం జెప్తం. నువ్వు మాతో రా!" అని వెంకటేశు చెయ్యి జాపాడు.

శీను అందరి మొహాల్లోకి చూశాడు.

వాళ్ళందరి మొహాలు దీనంగా 'రమ్మని' అర్థిస్తున్నట్టనిపించింది.

"రా! రా!" అని అతడి చేతిని బలవంతంగా లాక్కుని షేక్‌హ్యాండిచ్చాడు వెంకటేశు.

అంతే! మిగిలిన పిల్లలంతా శీను చేతిని తమ చేతుల్లోకి తీసుకున్నారు.

"సరే! పదండి" అని వాళ్ళతో కలిసి బెంచీ దగ్గరకొచ్చాడు. రమేషు గబగబా వెళ్ళి, బాటిల్‌తో చల్లని నీళ్ళు తెచ్చి-

"నెత్తురు కడుక్కో" అన్నాడు.

శీను నవ్వి చల్లని నీటితో మోకాలు, మోచేతుల నుంచి కారుతున్న రక్తం కడిగి ఆ తర్వాత మొహం కడుక్కున్నాడు.

"నేనెవరో మీకు చెప్పాను. మీరెవరో ఎక్కడి వాళ్లో నాకు చెప్పలేదు" అన్నాడు శీను.

అందరూ ఆ మాటకి వింతగా ఒకర్నొకరు చూసుకున్నారు.

"ఇప్పుడు మనమంతా ఫ్రెండ్స్. దాపరికాలుండగూడదు"

"నా పేరు వెంకటేశ్వర్లు. అంతా వెంకటేశు అని పిలుస్తరు. మాది చిత్తూరు. నేను పుట్టంగనే మాయమ్మ సచ్చి పోయిందట. మా నాయన రెండో పెళ్ళి జేస్కుండు. ఆమె నన్ను కొట్టి సంపుతా ఉంటే, ఇంట్లో నుంచి వచ్చేసిన. ఈడికొచ్చి రెండేళ్ళవుతుండాది" అని చెప్పి "నువ్వు చెప్పరా!" అన్నాడు రమేష్‌తో.

రమేష్ స్టైలుగా లేచి నుంచుని "ఐయాం రమేష్. మాది గుంటూరు. ఫిఫ్త్ క్లాస్. డాడీ మమ్మీని వొదిలేశాడు. మమ్మీ నూతిలో దూకి చచ్చిపోయింది. డాడీ నన్ను సరిగ్గా చూడక పోవడంతో ఇంట్లోంచి వచ్చేశా. బెజవాడలో కొన్నాళ్లున్నా. తర్వాత రైలెక్కి ఇక్కడికొచ్చా ఆర్నెల్లయ్యింది" అని చెప్పాడు.

అంతలో అక్కడికి మరో కుర్రాడొచ్చి- "అరే వీరూ! క్యాబాత్ కర్‌రేరే" అని కొత్తగా కనిపిస్తున్న శీనును చూసి "ఏ నయా కోన్" అని



అడిగాడు.

"రారా! రాహుల్ కూచో. హమారా నయా దోస్త్ శీను" అని వీరిగాడు అతడికి పరిచయం చేస్తున్నట్లు చెప్పాడు.

"క్యారే... కూచో, గీచో తెల్గూమే మత్ బోల్. హిందీ మే బోల్" అని రాహుల్ వాళ్లతో కూచుని శీను వైపు చూశాడు.

శీను అతని వైపు వింతగా చూస్తుంటే... రాహుల్ షేక్‌హ్యాండ్ ఇచ్చాడు.

వీరిగాడు శీనుతో, "రాహుల్‌ది బోంబే. బాంబులు పేలి వాల్లమ్మ, నాన్న, తమ్మి చని పోయిన్రు. రాహుల్ హిందీ పాటలు మస్తు పాడతడు" అని,

"రాహుల్ భయ్! శీనూ సాత్ క్లాస్ పడ్ రా, ఇన్‌కూ అచ్చా దిమాక్ హై" అన్నాడు.

శీనుకి తనని గురించే చెప్తున్నాడని అర్థమయింది గానీ, హిందీ తెలియక పోవటంతో మౌనంగా కూచున్నాడు.

"ఆడి సంగతొదర్రా... ముందు నీ సంగతి

జెప్పు" అన్నాడు మల్లేశ్ వీరిగాడితో.

"మాది సూళ్ళూరుపేట. మా నాయన అక్కంపేటలో గ్రానైట్ ఫ్యాక్టరీలో పనిజేసే వోడు. నాకో చెల్లి. గ్రానైట్ బండ లోడెత్తుతా ఉంటే జారి పడి, మా నాయన పూడ్చేసిండు. మా అమ్మ మా నాయన తంబిని మళ్లీ కల్యాణం పణ్ణికిచ్చి. అది నాకు పుడిక్కిలా. అందుకే ఇంట్ల నుంచి వచ్చేసిన" అంటూ తెలుగు తమిళ్ శ్లాంగ్‌లో చెప్పాడు వీరిగాడు.

"అరేయ్... పెద్దన్నొస్తన్నడు రా!" అన్నాడు రమేషు. అంతా అటు వేపు చూశారు.

అప్పుడు టైము రాత్రి ఏడయింది. వర్షం తగ్గేలా లేదు. పెద్దన్నతో బాటు మరో పిల్లాడు అక్కడి కొచ్చాడు.

"ఏంట్రా కూసున్నారు? ఈడింకా పోలే" అని శీనుని చూసి అడిగాడు పెద్దన్న. శీను లేచి నిలబడ్డాడు.

పెద్దన్న దగ్గర వీరిగాడికి చనువెక్కువ. అందుకే అతడితో "అన్నా! మంచోడన్న! సదు కున్నడు. మా ఊరి పక్కనే! మాతోనే ఉణ్ణీ అన్నా" అన్నాడు, బతిమిలాడుతున్న స్వరం తో. వాడి వంకోసారి చూసి, తర్వాత తల తిప్పి శీనూని చూస్తూ, "ఏంరా! బ్రాందీ షాపులో పన్జేస్తవా? " అడిగాడు పెద్దన్న.

"..." మౌనంగా తలొంచుకుని నుంచున్న శీను బదులేం చెప్పలేదు.

"అన్నా! కొత్తోడు గదన్నా! రెండ్రోజులు మాతో ఉండనియి. నేను ఆడికి జెప్తగద" అన్నాడు వీరిగాడు.

"సరె! సరె! ఎవుడి దగ్గరెంతున్నయ్యో తియ్యండి"

అందరూ తెల్లమొహాలేశారు.

మల్లేషు కల్పించుకుని "వోన గదన్నా, ఇయ్యాల మాకాడ దుడ్లు లెవ్వన్నా" అన్నాడు, కాస్త బెదురుతూనే.

"ఎంత మందున్నార్రా!"

"నీతో గలిపి ఎనిమిది"

"ఇంద ఈ డబ్బుల్దీసుకుని అన్నం తినండి. రేపు పొద్దున్నె ప్యాసింజరు, నారాయణాద్రి, సప్తగిరి అన్ని బండ్లు చూడండి" అని వీరిగా డికి వందిచ్చాడు. శీనువైపు తిరిగి,

"రేపట్నుంచీ ఆల్లతో బాటు బండ్ల కాడికి బో. ఏంజేస్తున్నరో చూడాల తెల్సిందా? " అన్నాడు.

తలూపాడు శీను.

పెద్దన్న లేచి "ఒరే వీరిగా! ఈడికి జాగ్ర త్తగా పని నేర్పండి" అన్నాడు లేచెళ్తూ.

"గట్లనే అన్నా! నే జూస్కుంట గదా!" అని పెద్దన్నతో ఎంట్రన్సు వరకూ వెళ్ళాడు వీరి గాడు.

పెద్దన్నతో వచ్చిన కుర్రాడి పేరు జాన్సన్. వాడికి జ్వరంగా ఉంది. జాన్సన్‌ని బ్రాందీ షాపు ముందు మిక్కీమౌస్‌లా తలకి, ఒంటికి మాస్క్ తగిలించుకుని నుంచునే పనికి కుది ర్చాడు పెద్దన్న.

సాయంత్రం ఆరుగంటల నుండి, అర్ధరాత్రి వరకూ రోజుకో వేషం వేసుకుని, కస్టమర్లకి షేక్‌హ్యాండిస్తూ, షాపులోపల్నుంచి వినబడే సంగీతానికి అనుగుణంగా కాళ్ళు, చేతులూ ఆడిస్తూ నుంచునే పని. నెలకి ఎంతిస్తారో తెలీదు. రాత్రి అన్నానికి డబ్బులిస్తారు. ఆది వారం పెద్దన్న మాత్రం పది రూపాయలి స్తాడు.

పెద్దన్న మళ్ళీ వెనక్కి తిరిగొచ్చి "అరే! జాన్సన్! ఎటూ తిరగమాకు. రేపు ఆస్పత్రిలో చూపించుకో. బస్తాండు నర్సిమ్మని నీ పనికి పంపుతాలే. వీరిగా! ఈణ్ణి జాగ్రత్తగా జూస్కోండ్రా" అన్చెప్పి వెళ్లిపోయాడు.

శీను తనే జాన్సన్‌కి పరిచయం చేసుకు న్నాడు. వీరిగాడు, మల్లేషు అందరికీ అన్నం తేవటానికి వెళ్ళారు. వాన తగ్గలేదు.

రెండో నంబర్ ప్లాట్‌ఫారంలోకి రైలు రావ టంతో రమేషు, వెంకటేశు, రాహుల్ పరుగె త్తారు.

జాన్సన్ బెంచీ మీద పడుకున్నాడు.

చెయ్యి పట్టుకుని "జొరం ఎక్కువగా ఉంది. మాత్రేమైనా ఏస్కున్నావా!" అడిగాడు శీను.

"ఊహూఁ..." అన్నాడు మూల్గుతూ.

"తోడ్కొస్త ఉండు" అని లేచి, స్టేషన్ బయటికొచ్చాడు శీను వర్షం కొంచెం తగ్గింది. సన్నగా తుప్పర పడుతోంది. తల మీద చేతులుంచుకుని, స్టేషన్ ఎదురుగ్గా ఉన్న టీ స్టాల్స్ దాటి ముందు కొచ్చాడు. మెడికల్ స్టోర్సు కన్పించింది.

రెండ్రూపాయల బిళ్ళిచ్చి "జొరం మాత్రొక టియ్యండి" అడిగాడు.

"రెండు తీస్కో" అని షాపతను రెండు ప్యారాసిటమల్ మాత్రలిచ్చాడు.

తిరిగొస్తుంటే చినుకులు పెద్దవవ్వటంతో

"జాన్సన్ లే! మాత్రేస్కుందువు గాని" అని లేవదీసి కూచో బెట్టాడు శీను.

"మాత్రకి పైసలున్నయ్యా నీ కాడ" వెంకటేశు అడిగాడు.

"రెండ్రూపాయలుంటే తెచ్చిన"

అంతలో వీరిగాడు, మల్లేషూ వచ్చారు.

ఇద్దరూ మౌనంగా నుంచునేసరికి "ఏంట్రా! మాటలు రానోళ్ళలా నుంచున్నారు" రమేష్ అడిగాడు.

ఇద్దరూ చేసిన తప్పుడు పనికి మాటలు రావటం లేదు. పెద్దన్న ఇచ్చిన డబ్బుల్లో ఏభై

## ఆ పాపం తిలక్‌దే



ఒక సమావేశానికి గాంధీజీ, తిలక్ ఆహ్వానితులు. బాపూజీ సమయానికి హాజరయ్యారు. అయితే తిలక్ అరగంట ఆలస్యంగా వచ్చారు. బాపూజీ ప్రసంగించవలసిన సమయం వచ్చింది. ఆయన ఇలా అన్నారు. "లోక్‌మాన్య తిలక్ గారు అరగంట ఆలస్యంగా వచ్చారు. మనం స్వరాజ్యం సంపాదించడంలో ఓ అరగంట ఆలస్యంగాని జరిగితే, ఆ పాపం తిలక్ తలకు చుట్టుకొంటుంది!"

శీను పూర్తిగా తడిసిపోయాడు.

జాన్సన్ పడుకున్న బెంచీ దగ్గర కొచ్చేసరికి, పక్కన రమేషు, వెంకటేషు కూర్చున్నారు.

రాహుల్ వాళ్ళక్కొంచెం దూరంగా నుంచుని సిగరెట్ కాలుస్తున్నాడు.

"ఏరా! పిల్ల వెధవ్వి... అప్పుడే సిగరెట్లు? !" అటుగా పోతున్న ఓ నడివయస్కుడు వాణ్ణి చూస్తూ అన్నాడు.

రాహుల్ నిర్లక్ష్యంగా అతడివైపు చూస్తూ చెయ్యి ముందుకు జాపి "చల్ రే చల్... మేరే బారేమె తేరేకూ కైకూ" అన్నాడు. వెంకటేశు శీనుని చూసి "యాడికి బోయినవు వానలో" అనడిగాడు.

"జాన్సన్‌కి జొరం ఎక్కువగా వుంది. మాత్ర తోడ్కొస్తి" వెంకటేశు, రమేష్‌లు మొహాలు చూస్కున్నారు. ఆ విషయం వాళ్ళకి తట్టనందుకు కాస్త సిగ్గుపడ్డారు.

రూపాయలకి బ్రాందీ తాగి మిగిలిన డబ్బుకి, ఏడుగురికి అన్నం తెచ్చారు.

వీరిగాడు, మల్లేషు మౌనంగా వాళ్ళు తెచ్చిన అన్నం పొట్లాలు అందుకుని బెంచీమీదుంచి "రండ్రా! తిందాం" అన్నారు.

రాహుల్ షూ పాలిష్ బ్రష్‌లు టకటకలాడిస్తూ వచ్చాడు. వీరిగాడితో "క్యా లాయా? " అని కళ్ళింత చేసుకుని బెంచీమీది పొట్లం వైపు చూశాడు.

"చికెన్ బిర్యానీ, మటన్ ఫ్రై, మచ్చీ కా ఖట్టా"

"ఐసా!" అన్నాడు నాలుకతో పెదాలు తడుపుకుంటూ.

"మొకం చూడు. చల్ బె చల్. జల్దీ ఆవ్, భూక్ లగీ" అరిచాడు వెంకటేశు.

మెడలో ఉన్న బ్యాగు దీసి పక్కన బెట్టాడు రాహుల్. శీను ఆ బ్యాగు వైపు చూశాడు. అందులో షూ పాలిష్‌లు, బ్రష్‌లు, ఏవో కాగి

తాలు కన్పించాయి.

"ఏ హమారా జైజాత్ భయ్" అన్నాడు రాహుల్ శీనుతో. అయినా విన్పించుకోనట్టు చూస్తున్న శీనుని భుజం తట్టి "ఏ... హమారా... జైజాత్" అని యాక్షన్ చేసి చూపేసరికి శీను సిగ్గుగా తల దించుకున్నాడు.

"అహాఁ పెద్ద ఆస్తండీ! చిరుగుల సంచీ, ఎండిపోయిన పాలిష్లు, అరిగిపోయిన బ్రష్షులూ" రమేష్ వ్యంగ్యంగా అన్నాడు.

చేతులు కడుక్కొచ్చిన రాహుల్‌కి ఆ మాటలు అర్థమై, "ఏ మేరీ రోజ్ రోటీ కమానే కీ సామాన్ హై! ఇస్కా మజాక్ మత్ ఉఢావ్ భయ్" అన్నాడు సీరియస్‌గా.

"తిని కొట్లాడుకోండ్రా మీరు... ఎదవ నాయాళ్ళారా రండి" మళ్ళీ అరిచాడు వెంకటేశు.

అందరూ బెంచీ వెనకా కింద కూచుని మధ్యలో ఉంచిన అన్నం పొట్లం విప్పారు. సాంబారు పోసుకుని కొద్దిగా తిన్నాడు జాన్సన్. ఆకలి మీదున్న మల్లేష ఆవురావురుమని తిని అర్థాకలితో లేచాడు.

అటువైపొచ్చిన రైల్వే పోలీసు "ఏందిరా ఈడ చీట్లాడు తున్నారు! దొంగ నాయాళ్ళలారా" అని చేతిలో ఉన్న లాఠీతో బెంచీమీద కొట్టాడు

వీరిగాడు దబ్బున లేచి నుంచుని "సారూ! అన్నం తింటన్నం" అన్నాడు. ఆ మాట విన్పించుకోకుండానే పోలీసెళ్ళిపోయాడు.

బెంచీమీద కూచున్న జాన్సన్ వేగంగా ప్లాట్‌ఫారం అంచుకెళ్ళి కూచుని భళుక్కున వాంతి చేసుకున్నాడు. వెంకటేశు, శీను వెళ్ళి పట్టుకున్నారు. శీను నీళ్ళ బాటిల్ తెచ్చిచ్చాడు జాన్సన్‌కి.

ఇదంతా చూస్తూ కూడా రాహుల్ తన కేమీ పట్టనట్టు బెంచీ మీద పడుకుని...

"చీనీ అరబ్ హమారా
హిందూస్థాన్ హమారా!
రెహనేకో ఘర్ నహీ హై
సారే జహాఁ... హమారా!"

పాట పాడుకుంటుండిపోయాడు.

"లేరా! లే. బెంచీమీద జాన్సన్ పడుకుంటాడు" అరిచినట్టు అన్నాడు వీరిగాడు.

ఆ మాటలు వినకుండా పట్టించుకోనట్లు కళ్లు తెరవకుండానే రాహుల్ మరో హిందీ పాటందుకున్నాడు.

అతడి తీరు చూసి ఒళ్లు మండిన వీరిగాడు వేగంగా వచ్చి "లెగు బే లెగు" అని రాహుల్ చెయ్యి పుచ్చుకుని లాగాడు.

కింద పడ్డ రాహుల్ "క్యా హువా? " అనరిచాడు.

'జాన్సన్‌కి జొరం లే, ఆడు పడుకుంటాడు" అని వీరిగాడు చెప్పే సరికి, బెంచీ వెనకాల కెళ్ళి సంచి తల కిందుంచుకుని, మరో పాట హమ్ చేస్తూ కళ్ళు మూసుకున్నాడు.

రాత్రి పదకొండు గంటలయింది.

పిల్లలంతా బెంచీ వెనక పడుకున్నారు.

రాహుల్ పాట పాడుతున్నాడు.

తన కాళ్ళకి, చేతులకి తగిలిన దెబ్బలు అప్పుడు గుర్తొచ్చాయి శీనుకి. నెప్పి పుడుతున్నా, అలిసిపోయిన కళ్ళు, అడ్డొస్తున్న ఆలోచనల్ని బలవంతంగా బయటికి నెట్టి తలుపు వేసుకున్నాయి. క్షణంలో గాఢ నిద్రలోకి జారిపోయాడు.




మర్నాడుదయం ఐదు గంటలకే శీనుకి మెలకువ వచ్చింది. లేచి కూచోబోతుంటే, వళ్ళంతా నెప్పులు, దెబ్బలు అమితంగా బాధ పెడుతున్నాయి.

కళ్ళు నులుముకుని చుట్టూ చూశాడు.

అప్పటికే రైళ్ల రాకపోకలతో, జన సంచారంతో స్టేషనంతా సందడిగా ఉంది.

తన పక్కన పడుకున్న వాళ్ళెవరూ కన్పించ లేదు.

రెండో నంబరు ప్లాట్‌ఫారం వైపు చూశా డు. ప్యాసింజరు ఆగుంది.

"పాలిష్... పాలిష్" రాహుల్ గొంతు విన్పించింది.

"సార్! కూలి... కూలి సార్" వీరిగాడు ప్యాసింజర్లెంట పడుతూ కన్పించాడు.

బెంచీ మీద పడుకున్న జాన్సన్ కోసం చూశాడు. కన్పించలేదు.

శీను లేచి నిలబడి పరిసరాలన్నీ పరిశీల నగా తిలకించాడు. "తాగు నీరు" అని రాసున్న చోట, గోడపక్కన కాళ్ళు ముడుచు కుని మూల్గుతూ పడుకున్న జాన్సన్ కన్పిం చాడు. గబగబా వెళ్ళి "జాన్సన్, జాన్సన్" అని తడుతూ పిలిచాడు.

"ఊం... " మూలిగాడు జాన్సన్.

శీను అతడి నుదిటిమీద చెయ్యేసి చూశా డు. జ్వరం తగ్గలేదు.

"జాన్సన్! లే! బెంచీమీద పండుకుందువు గాని"

"ఊం..." అని జాన్సన్ లేవబోయాడు గానీ శరీరం సహకరించటం లేదు.

"నాకు రేత్రంతా బేదులవుతుండాయి" అన్నాడు నీరసంగా.

"అవునా? లే! మెల్లంగ నన్ను పట్టుకుని లే" అని జాన్సన్‌ని లేపి నుంచోబెట్టాడు. అతని చెయ్యి తన భుజం మీదేసుకుని నెమ్మదిగా నడిపించుకుంటూ తీసుకువచ్చి బెంచీమీద పడుకోబెట్టాడు.

అంతలో రాహుల్ అక్కడికి వచ్చాడు.

జాన్సన్‌ని చూసి "కైసా హై" అన్నాడు.

వాడు కళ్ళు తెరవలేదు, బదులు చెప్పలేదు.

"కైసాహై ఇన్ కా హాలత్? " శీనుని అడి గాడు రాహుల్.

"జొరం జాస్తిగుంది బా! రాత్రంతా బేదు లంట"

"ఐసా క్యా!" అనెళ్ళిపోయాడు రాహుల్.

శీనుకి రాహుల్ ఏం అడిగాడో అర్థం కాలేదు. అతడి భావం అర్థం చేసుకున్నాడు గానీ, బదులివ్వడానికి భాషడ్డం వచ్చింది. అతడేం అర్థం చేసుకున్నాడో శీనుకీ అర్థం కాలేదు.

ఎలాగైనా హిందీ తొందరగా నేర్చుకోవా లని నిర్ణయించుకున్నాడు.

వీరిగాడు, మల్లేశు, వెంకటేశు, రాహుల్, రమేషు ఎవ్వరూ మళ్ళీ ఆవైపు రాలేదు. టైము ఉదయం ఎనిమిది గంటలయింది. జాన్సన్ నీర్సంగా మూల్గుతుంటే పక్కనే కూర్చున్నాడు శీను.

"అమ్మా... చలి... చలి పుడ్తాంది" వణు కుతూ ముడుచుకున్నాడు.

"దుప్పటుందా? "

"లేదు" అన్నాడు వణుకుతూ.

"ఉండు నేనెళ్ళి మల్లేషుని పిల్చుకొస్త" అని ప్లాట్‌ఫారం దాటెళ్ళి, నారాయణాద్రి రైలు దగ్గర అడుక్కుంటున్న మల్లేషు దగ్గరకెళ్ళి,

"జాన్సన్‌కి బేదులవుతుండాయి. నీర్సంగా పడుకున్నాడు. టీ తాగించి, మాత్రేస్తే తగ్గు తుందేమో" అన్నాడు.

"ఏం గావాలా? దుడ్లు గావాల్నా? "

ఔనన్నట్లు తలూపాడు శీను.

"ఇంద నాకాడ మూడ్రూపాయలున్నయ్... తీస్కపో" అనిచ్చాడు.

శీను మెడికల్ షాపుకెళ్ళి "జొరం, బేదులు తగ్గడానికి మాత్రలియ్యండి" అన్నాడు.

"ఇంకో రూపాయి ఇవ్వు" అన్నాడు షాపు యజమాని.

"లెవ్వు... తర్వాతిస్తా... ఇయ్యన్నా!" అన్నా డు బతిమిలాడుతున్నట్లుగా. దేవుని పటానికి ఊదుబత్తి తిప్పుతూ, "కుదర్దెళ్ళు... పొద్దున్నే వచ్చావు. చావు గిరాకి... ఫో... ఫో" అని కసిరాడు షాపు ఓనరు.

"ఇయ్యనన్నావు అంతే! చావు గీవు అంటే బాగోదు" అన్నాడు శీను డబ్బు వెనక్కి తీసు కుంటూ.

"ఏం చేస్తావురా! ఎదవ నా కొడకా!"

"నువ్వే" అని సీరియస్‌గా చూసి గబగబా

పరుగెత్తాడు.

"రేయ్... ఆగరా! దొం...లం.... నీ చూపు కి బయపడ్డాననుకున్నావురా" అని ఊదుబత్తి చేత్తో పట్టుకునే షాపు బయటికొచ్చి అరవసా గాడు.

శీను వేగంగా స్టేషన్లోకొచ్చాడు.

టైము పదయింది.

సప్తగిరి ట్రైను ఒకటిలోకి వచ్చింది. ప్యాసింజర్లు దిగుతున్నారు. స్టేషను కిటకిటలాడు తోంది. లగేజితో వస్తున్న ప్యాసింజర్ని చూసి, "సార్ కూలీ! రెండ్రూపాయలియ్యండి. బయటికి మోసుకొస్త" అన్నాడు శీను.

వెంటవెంటనే రెండుసార్లు కూలి దొరక టంతో శీను చేతి గాయానికి, జాన్సన్ మాత్ర లకి, తినడానికి, డబ్బు దొరికింది.

మళ్ళీ అదే మెడికల్ షాపుకెళ్ళాడు.

శీనుని గుర్తుబట్టి "ఇందాక ఏంటిరా! అన్నావు? " అని ముందుకు వంగి, శీను చెయ్యందుకోబోయాడు షాపతను.

"ముందు నువ్వేగా అంటివి" అన్నాడు శీను.

"నేనంటే నువ్వంటావా? "

"నీ మందులు నీ కాడున్నాయి. నేనేం దొంగతనం చెయ్యలా. రూపాయి తక్కు వుంది. మందులిమ్మన్న. ఇయ్యనన్నావు. అంతే! చావు గిరాకీ అన్నది నువ్వేగదా!" అని రెట్టించాడు శీను.

షాపుకొచ్చిన కస్టమర్లు శీను మాటల్ని వింటుండడంతో ఆపై ఏం మాట్లాడితే ఏం గొడవ జరుగుతుందోనని అనుకున్న ఓనరు "సర్లే! నాల్రూపాయలియ్యి" అన్నాడు చిరాగ్గా.

శీను మాత్రలు తీసుకుని, స్టేషన్లోకొచ్చి ఇడ్లీలు తీసుకుని, జాన్సన్ దగ్గరకొచ్చాడు.

బెంచీమీద జాన్సన్ కన్పించలేదు. స్టేషనం తా గాలించాడు. రెండో నంబరు ప్లాట్ఫారం అంతా తిరిగి వస్తుంటే,

"ఆరెమ్మెస్" ఆఫీసు ముందున్న పార్శిల్ సంచుల పక్కన కాళ్ళు ముడుచుకుని పడు కున్న జాన్సన్ కన్పించాడు.

"అరె.. ఈడకెందుకొచ్చినావు... నీ కోసం స్టేషనంతా చుట్టి వస్తా ఉంటినే" అన్నాడు శీను.

శీనుని చూసి మూల్గుతూ లేచి కూచుని, "అక్కడ పోలీసొచ్చి లెగ్గొట్టినాడు. అందుకే ఈడికొచ్చిన, మళ్ళీ రెండుమార్లు బేదులయి నయి. నడిసే ఓపిక లేక ఈణ్ణే పడుకున్న" అన్నాడు నీరసంగా

"ముందీ ఇడ్లీ తిను. తర్వాత మాత్రేస్కుం దువుగాని" అని తెచ్చిన ఇడ్లీలు జాన్సన్కి పె ట్టి తనూ తిన్నాడు. జాన్సన్ కళ్ళు శీనునే గమనిస్తున్నాయి.

ఇడ్లీ తిని మాత్ర వేసుకున్నాక జాన్సన్కి కాస్త ఓపిక వచ్చింది. ఇద్దరూ టీ తాగి, బెంచీ మీద కూచున్నారు. అటువైపు వెళ్తున్న పెద్దన్న జాన్సన్ని చూసి, ఆగి...

"ఏంట్రా! జాన్సన్! జొరం తగ్గిందా? " అన్నాడు.

"బేదులవుతుండాయన్నా!"

"ఆస్పత్రికి బోయి చూపించుకునేది"

"అట్లనే అన్నా... ఎళ్త"

పెద్దన్న వెళ్లిపోయాడు.

"మీదే ఊరు...? " శీను అడిగాడు.

"మాది బెజవాడ"

"అమ్మా నాన్న లేరా? "

"ఉండారు"

"మరెందుకొచ్చావు? "

"హొద్దులే.... నా కతెందుగ్గానీ... నువ్వేం చదువుకున్నావు? "

"సెవెంత్ చదువుతున్న"

శీను తన ఫ్లాష్బ్యాకంతా జాన్సన్కి చెప్పే సరికి ఓ గంట గడిచిపోయింది.

"ఇదేనా మీ నాయన బెట్టిన వాత? " శీను చేతిమీద చొక్కా ఎత్తి చూస్తూ అడిగాడు జాన్సన్.

"అవును. ఈ వాతే... నా తలరాత మార్చే సింది. నన్ను చదువుకి దూరం చేసింది." అన్నాడు శీను ఎటో చూస్తూ. అతడి స్వరంలో తెలియని దిగులు, ఆవేదన.

“ఇంటికి వెళ్లవా? ”

“ఊహూఁ అవునూ, ఇక్కడ ఆస్పత్రెటుంది? ”

“గవర్నమెంటాసుపత్రికి బోవాల”

“అయితే పద... నిన్ను నేను... తోడ్కబోత”

అప్పటికి టైము పదకొండు దాటింది. శీను జాన్సన్‌ని నడిపించుకుంటూ వెళ్తుంటే... మధ్యలో మల్లేషు, వీరిగాడు, వెంకటేశు కలిశారు.

డాక్టర్ వచ్చి జాన్సన్‌ని చూసేసరికి మరో గంట ముందుక్కదిలింది. డాక్టర్ చెకప్ చేస్తుంటే...

“ఈ మాత్రలేస్కున్నాడండి రాత్రి, పొద్దున” అని టేబ్లెట్ మీదుండే ఫాయిల్ చూపించాడు శీను.

“ఎన్నిసార్లేసుకున్నాడు? ”

“రాత్రొకటి, పొద్దున రెండు”

“వెరీ గుడ్. ఇవి మంచి మాత్రలే. ఇవే రోజుకి మూడియ్యి. తగ్గుతుంది” అని శీనుకు చెప్పాడు డాక్టర్. అది విని తనకో మంచి నేస్తం దొరికినట్టు శీను వైపు చూశాడు జాన్సన్.

డాక్టర్ వేరే మందులు కూడా ఇచ్చాడు.

అక్కణ్ణుంచి బయటికొస్తుంటే...

“సమయానికి సాయం జేశావు..” అన్నాడు జాన్సన్ కృతజ్ఞతగా.

“అవును. నీకీ మాత్రలన్నీ తెలుసా? ” అమాయకంగా అడిగాడు వెంకటేశు.

“మందుల షాపుకెళ్లి అడిగితే ఇచ్చిండు” చెప్పాడు శీను తేలిగ్గా.

“ఏదైతే ఏంలేరా! జాన్సన్‌కి జొరమొస్తే కాపాడావు” అన్నాడు వీరిగాడు.

“మాత్ర తెచ్చిచ్చిన అంతేగదా!” అన్నాడు శీను.

వాళ్లంతా శీనుకి ఎలా కృతజ్ఞత తెలపాలో, మాటలు తెలీక కళ్లతోనే ఆ భావాన్ని వ్యక్తం చేశారు. శీను చదువొచ్చినవాడు, తెలివైనవాడు అన్న భావన మనసులో ముద్రించుకున్నారు.

రెండ్రోజుల తర్వాత... జాన్సన్ కాస్త కోలుకున్నాడు.

శీనును బస్టాండుకి తీసుకెళ్లి తన ఫ్రెండ్సుకి పరిచయం చేశాడు.

బస్టాండ్లో పెద్దన్న కన్పించాడు.

“ఏంరా! జొరం తగ్గినాదా? ”

“కాస్త తగ్గిందన్నా”

“మరి బ్రాందీ షాపు పనికెల్తావా? ”

“వొద్దన్నా! నాకా వాసన పడటంలా. స్టేషన్లోనే ఉంట” అన్నాడు.

ఏ మూడ్‌లో ఉన్నాడో పెద్దన్న శీను వైపు తిరిగి నువ్వా

వాళ్లంతా శీనుకి ఎలా కృతజ్ఞత తెలపాలో, మాటలు తెలీక కళ్లతోనే ఆ భావాన్ని వ్యక్తం చేశారు. శీను చదువొచ్చినవాడు, తెలివైనవాడు అన్న భావన మనసులో ముద్రించుకున్నారు





ఈడితో బాటే స్టేషన్లో ఉండు" అనేసి వెళ్ళి పోయాడు.

ఇద్దరూ తిరిగి స్టేషన్ కొస్తూ... దోవలో గోవిందరాజుల గుడి కోనేరు మెట్లమీద కూచున్నారు.

"నేను ఇక్కడికి వచ్చిన కొత్తల్లో ఈణ్ణే ఒంటరిగా కూచునేవోడిని. ఈళ్లని చూస్తే శానా బయం గుండేది" అని చెప్తూ 'అదుగో అటు చూడు' అని తమకి కొంత దూరంలో కూచున్న పిల్లల్ని చూపించాడు జాన్సన్.

"ఎవరాళ్లు? "

"అమ్మో! ఆళ్లు గంజాయి తాగుతారు. వాళ్లతో చేరమాకా"

శీను వాళ్లనే గమనిస్తున్నాడు.

ముగ్గురు పిల్లలు కూచుని ఒకే సిగరెట్టు ఒకరి తర్వాత మరొకళ్లు పీలుస్తూ, మత్తులో తేల్తున్నారు.

వాళ్లలో ఒకడు జాన్సన్‌ని చూసి...

"ఒరేయ్! జాన్సనూ నువ్వూ రారా! నీ యవ్వ! రా!" అంటూ పిలిచాడు.

మరొకడు లేచి నిలబడి "ఆగరా జాన్సన్. నేనే నీదేర కొస్తా" అని తూలుతూ అడుగు వేయడానికి తిప్పలు పడుతున్నాడు.

"లే! లే!! వెళ్లిపోదాం, ఆడే వినోద్ గాడు ఆడొచ్చాడంటే మనల్నీ లాక్కుపోతాడు" అని లేచాడు జాన్సన్.

ఆ రోజు రాత్రి మల్లేషు, వీరిగాడు, రమేషు, వెంకటేశు, రాజు, రాహుల్ అంతా కలిసి



జాన్సన్ దగ్గరకొచ్చారు.

రాహుల్ జాలీగా శీను పక్కకొచ్చి "కైసా హై? " అనడిగాడు.

శీను నవ్వాడు.

రాహుల్ కూడా నవ్వి శీను భుజం మీద చెయ్యేసి,

"ఏ దోస్తీ" పాట విజిల్‌లో హమ్ చేస్తుంటే శీను అతణ్ణి వింతగా చూశాడు.

వాళ్లందర్నీ ఒకేచోట చూస్తున్న శీనుకి తానో కొత్త లోకంలోకొచ్చి పడ్డట్టనిపించింది.

## 9

అలవాటు ప్రకారం ఉదయం ఐదుగంటలకి ఎటువాళ్ళటు వెళ్ళిపోయారు.

శీను నిద్రలేచి జాన్సన్ కోసం చూశాడు. కన్పించలేదు. ఒకటో నంబర్ ప్లాట్‌ఫారం అంతా వెతికాడు. రెండో నంబరు కెళ్ళాలని పట్టాలు దాటబోతుంటే బొటనవేలికి రాయి ఎదురు దెబ్బ తగిలి చర్మం చిట్లింది.

"అమ్మా" అన్నాడు బాధగా. అంతలోనే అదేం పట్టించుకోకుండా ఉండడానికి ప్రయత్నిస్తూ రెండో నంబర్లోకి ఎక్కుతుంటే... చెయ్యందించాడు వెంకటేశు. పైకెక్కి..

"జాన్సన్ అవుపడ్డాడా? " అడిగాడు.

"ఒకట్లో రైలు కాడ లేడూ"

"లేడే!"

"ఈణ్ణే యాడో ఉండుంటాడు... రా! చూద్దాం"

"నా కాలికి దెబ్బతగిల్నాది. ఈణ్ణే కూచుంటాను. నువ్వెళ్ళి చూడు" అని రక్తం కారుతున్న కాలిని నీళ్ళతో కడిగాడు శీను.

ప్లాట్‌ఫారం రద్దీగా వుంది. శీను బెంచీమీద కూచుని రైలు వేపు చూస్తున్నాడు.

రమేషు, వీరిగాడు కన్పించారు గానీ శీను వాళ్ళని పిలవలేదు. వాళ్ళూ శీనుని చూళ్ళేదు.

ఇంతలో టకటక శబ్దం విన్పించటంతో శీను కళ్ళు పక్కకి తిరిగాయి. అతడి పక్కనుండి ఒకతను, భుజానికో సంచి తగిలించుకుని, కర్రల సాయంతో రైలు దగ్గర కెళ్తున్నాడు. శీను అతణ్ణే చూస్తుంటే వెంకటేశు, జాన్సన్ కలిసి దగ్గరకొచ్చారు.

"నా కోసం ఎతుకుతుంటివా? " అన్నాడు జాన్సన్.

"యాడికి బోతివి"

"ఇదుగో" అని చేతుల కిందున్న కర్రల్ని చూపించి

"అడుక్కోవటానికెళ్ళినాను" అన్నాడు.

"ఈ కర్రలెందుకు? "

"ఇందుకు" అని చేతుల కింద కర్రలుంచుకుని ఒక కాలు కొంచెం పైకెత్తి కుంటివాడిలా నడిచి చూపాడు.

"కుంటోడంటే ఎవరయినా డబ్బులిస్తారని"

"నీకు కాళ్ళున్నయ్‌గా, ఎవరు నీకు కుంటోడి వేషం వెయ్యమని చెప్పింది? "

"పెద్దన్న. ఈ కర్రలు కూడా ఆయనే ఇచ్చిండు. వచ్చిన డబ్బులు ఆయనకే ఇయ్యాల" అని పక్కనే కూచున్నాడు జాన్సన్.

"అదుగో అటు చూడు" అని ఎదురుగా

కన్పించే వ్యక్తిని చూపించాడు. రెండు కాళ్ళూ లేని కుంటతను రైలు దగ్గరకి కర్రల సాయం తో వెళ్తున్నాడు.

"ఆయన నారాయణ... రైల్లో పెన్సిళ్ళూ, పెన్నులూ, బొమ్మలూ అమ్ముతుంటాడు" చెప్పాడు జాన్సన్.

శీను దృష్టి నారాయణని వదిలి రావటం లేదు.

నారాయణ రైలు ఫుట్‌బోర్డు దగ్గరకెళ్ళి, రెండు కర్రలూ బోగీలో ఉంచి, రైలెక్కబో తుంటే భుజానికున్న సంచీ జారిపడింది.

సంచీలో ఉన్న పెన్నులు, పెన్సిళ్ళు, బొమ్మ లు కిందపడ్డాయి. ఎవరో ప్యాసింజరు నారా యణకి లోపలున్న కర్రలు అందించాడు.

శీను వేగంగా పరుగెత్తుకెళ్ళి, కిందపడిపో యిన పెన్సిళ్ళు, పెన్నులు తీసి నారాయణ సంచిలో వేసి ఇస్తుంటే నారాయణ శీను వైపు తిరిగి "థ్యాంక్స్! నీ పేరేంటి? " అనడిగాడు.

"శీను" చెప్పాడు.

నారాయణ కర్రలు, సంచీ రైల్లో పెట్టి అతడు రైల్లో ఎక్కడానికి సాయం చేశాడు.

మళ్ళీ "థ్యాంక్స్" చెప్పి, కర్రలు చేతుల కిందుంచుకుని రైల్లో కూచున్న ప్యాసింజర్ల మధ్య కెళ్లిపోయాడు. శీను బోగీలోనే నిలబడి నారాయణని చూస్తున్నాడు.

"ఆc పెన్నులు చవక బాబూ! పది రూపా యలకి ఐదు పెన్నులు, పాలకార్డు కవర్లు, సీజన్ కార్డు కవర్లు, సెల్‌ఫోన్ కవర్లు అంటూ తన దగ్గరున్న సామాన్ల జాబితా చదువుతూ, అమ్ముకుంటూ వెళ్తుంటే శీనుకి బోల్డంత ఆశ్చర్యమేసింది.

జాన్సన్ వచ్చి భుజం మీద చెయ్యేసేసరికి "నీకు ఈయన తెల్సా? " అనడిగాడు.

"ఓ! బాగా తెల్సు. నారాయణన్న పది దాకా చదివినాడు. రోజూ రైల్లో పెన్సిళ్ళు, పెన్నులు అమ్ముతాడు"...

"నారాయణకి నిజంగా కాళ్ళు లేవా! లేక నీకులా,గా కాళ్ళు ముడుచుకుని..."

ఆ మాటకి శీను వైపు అదోలా చూశాడు జాన్సన్, తను చేస్తున్నది తప్పన్పించినవా డిలా.

"చూడు! కాళ్ళు లేని నారాయణ ఆకలి కోసం కష్టపడి గౌరవంగా బతకాలనుకుంటు న్నాడు. కాళ్ళు, చేతులూ ఉన్న నువ్వు కుంటో డి వేషంతో అడుక్కుని బతకాలనుకుంటు న్నావు. ఆయనిదీ ఆకలే. నీదీ ఆకలే. తేడా చూడు" అన్నాడు శీను.

జాన్సన్ సిగ్గుతో తల దించుకున్నాడు.

"అందర్నీ అడుక్కుంటూ అసహ్యంగా బతికే కంటే ఏదన్నా పనిచేసుకుందాం. చదు వుకుందాం. దొరికింది తిందాం ఏమంటావు? "

"ఇకనుండి నువ్వు చెప్పినట్టే ఎవుర్నీ అడు క్కోను. ప్రభువు మీదొట్టు" అని మెడలో వేలాడుతున్న శిలువ బొమ్మమీద చెయ్యేసి అన్నాడు జాన్సన్.

"పద టీ తాగుదాం" అని ఒకటో నంబరు ప్లాట్‌ఫారంకి రాబోతున్న శీను దృష్టి పార్శిలు ఆఫీసు పక్కన గోడకానుకుని కాళ్ళు జాపుకుని, అస్తవ్యస్తపు గుడ్డలతో గాఢ నిద్రలో ఉన్న పిచ్చిదాని మీద పడింది.

"ఎవురీమె? " ప్రశ్నించాడు శీను.

"పిచ్చిది... శానా ఏళ్ళ బట్టీ ఈణ్ణే ఉంటం దంట" అన్నాడు. వచ్చీ పోయే ఆడవాళ్ళు కూడా పిచ్చిదాని నగ్న శరీరభాగాల్ని చూస్తూ పోతున్నారు గానీ పక్కకి తొలిగిన బట్టల్ని సరిచేద్దామన్న సంస్కారం లేదు.

ఒకటో నంబరు ప్లాట్‌ఫారం చేరాక ఇద్దరూ టీ తాగారు. ఒకటిలోకి వచ్చిన నారా యణాద్రి యార్డుకి బోవటంతో ప్లాట్‌ఫారం ఖాళీగా ఉంది.

ఇద్దరూ కాసేపు టి.వి. ముందు నిలబడి సినిమా ట్రైలర్స్ చూశారు.

"తొమ్మిందింటికి ప్యాసింజరొచ్చాక వద్దాం. అందాక కోనేరు దగ్గర కూచుందాం" అన్నాడు శీను.

"ఆడ గంజాయి గుంపుంటాది వొద్దు"

"ఫరవాలేదు రా! ఆళ్ళ గొడవ ఆళ్ళది... మన గొడవ మనది".

ఇద్దరూ కోనేరు మెట్లమీద కూచున్నారు. జాన్సన్ భయపడ్డట్టుగానే వినోద్ బ్యాచంతా ఓ మూల కూచున్నారు. వాళ్ళలో ఒకడు కొత్తగా చేరాడు.

"చూడు, ఆళ్ళలో ఎత్తుగా అవుపడ్తున్నాడే, ఆడిపేరు శంకర్. అంతా 'దాదా' అని పిలుస్తారు. మహా మోసగాడు. కనబడితే చాలు డబ్బులన్నీ లాక్కుంటాడు. ఇయ్యకపోతే కొడ్తాడు, బూతులు తిడ్తడు" చెప్పాడు జాన్సన్.

శీను కళ్ళు దాదావైపే చూస్తున్నాయి. వాళ్ళ మాటలూ స్పష్టంగా వింటున్నాడు.

"దాదా! ఏంటి పద్దున్నే, ఇంజక్షనా? " వినోద్ అడిగాడు.

"నీకూ గావాల్నా? "

"వద్దు నాకు భయం"

"ఒక్కసారి జేసుకుంటివంటే భయం పారిపోద్ది" అంటూ డిస్పోజబుల్ సిరంజిలోకి ఏదో మందెక్కించి, మోచేతికి పాతగుడ్డ కట్టి నరానికి కసక్కున ఇంజక్షన్ చేసుకున్నాడు. తర్వాత తేలిపోతున్న కళ్ళతో కాళ్ళు జాపుకుని కూచుని, మత్తు కళ్ళతో "ఓ సిగరెట్ పట్రారా!" అన్నాడు. అక్కడున్న మరొకడితో. "ఆడెందుకు దాదా! ఇదుగో" అని వినోద్ సిగరెట్ ఇవ్వగానే వెలిగించి గట్టిగా పీల్చి రింగులు రింగులుగా పొగ ఒదిలాడు.

"చూసినావా ఆళ్ళ పన్లు"

"అద్సరే, నీకు నా కతంతా చెప్పాను. నువ్వు నీ గురించి సరిగ్గా చెప్పనేలేదు. మీదేవూరు? బెజవాడన్నావు గదా! మీ అమ్మ, నాయనా ఏం జేస్తారు? చెప్పు? "

"అవ్వన్నీ ఎందుకులే"

# దుర్వాసనారాయుళ్లకో శుభవార్త!

కొంతమంది నోరు తెరిస్తే చాలు, ఎదుటి వాళ్ళు ఆమడదూరం పారిపోతారు. అలాంటి దుర్వాసనా రాయళ్ల దగ్గర నుంచి ఒక్కోసారి వాంతులొచ్చేంతగా భరించలేని దుర్వాసన వస్తుంటుంది. అలవాట్లు, శుభ్రం లేకపోవటం, రోజూ దంతధావనం చేసుకోకపోవటం వంటివి దుర్వాసనకు కారణాలు. కొంతమంది ఇవన్నీ పాటిస్తున్నా దుర్వాసన వస్తుంటుంది.



ఇంటస్టైనల్ గ్యాస్ (కడుపులో వాయువు) వ్యాధి ఉన్న వాళ్ళలో ఈ సమస్య ఉంటుంది. దీనికి కారణం హైడ్రోజన్ సల్ఫైడ్ వాయువు. సహజంగా లభించే పెరుగుతో ఈ నోటి దుర్వాసన అరికట్టవచ్చని బ్రిటిష్ దంతవైద్య నిపుణుడు డా. నెగ్గెల్ కార్టర్ అంటున్నారు. ఎలా అంటే పెరుగు తినడమేనట.

జపాన్‌లో నోటి దుర్వాసనతో బాధపడ్తున్న 24 మందికి సహజంగా తయారైన (లాక్టోబాసిల్లస్ బల్గారికస్, స్ట్రెప్టోకోకస్ థెర్మోఫిల్లర్ కల్గి ఉండే) పెరుగును 90 గ్రాముల చొప్పున రోజుకి రెండుసార్లు ఆరు వారాలు తీసుకునేలా చేశారు.

ఆరువారాల అనంతరం దుర్వాసనకి కారణమైన హైడ్రోజన్ సల్ఫైడ్ 80 శాతం తగ్గిపోయిందట. అయితే పెరుగులో చక్కెర కలుపుకోకూడదు. చక్కెరలేని పెరుగు నోటి దుర్వాసన అరికట్టడానికే కాదు, ఆరోగ్యానికీ తోడ్పడుతుంది.

విచారంగా మొహం పెట్టి అన్నాడు జాన్సన్.

"చెప్పగూడదనుకుంటే వద్దులే. రా! పోదాం!"

"అని కాదూ..."

"మరయితే చెప్పు"

జాన్సన్ చెప్పటం మొదలెట్టాడు.

"మాది బెజవాడ గాదు. కడప. మా నాయన ఎమ్మెల్యే దగ్గర పన్చేసేవోడు. మా అమ్మ ఇంట్లోనే ఉండేది. నాకో చెల్లి. అదంటే నాకెంతో ఇష్టం. నేను నాల్గో తరగతి చదువు తున్న. నేను మా అమ్మలా అందంగా ఉంటాను.

ఓ రోజు... ఆదివారం పొద్దున్నే చర్చికె ళ్తన్నాం- అమ్మా, నాయన, నేను, చెల్లి కలిసి. ఓ కారొచ్చి నాయన పక్కనే ఆగింది. అందులో దిగిన ముగ్గురు మనుషులు నాయన్ని కిందపడేసి, గొడ్డలితో నరికి చంపే సినారు. అమ్మ మమ్మల్ని తీసుకుని చర్చిలోకి పరుగెత్తింది.

రెణ్ణెల్లకి అమ్మకి జొరం, బేదులవుతావుంటే ఆస్పత్రికి బోయినాం. అక్కడ డాక్టర్లు అమ్మని జూసి పరీక్షలు చేసి 'ఎయిడ్సుందని' చెప్పింద్రు.

నాకూ, చెల్లికి కూడ రక్తపరీక్షలు చేసి, నాకూ ఎయిడ్సుందని చెప్పింద్రు. అది తెల్సిన మా చిన్నాయన మమ్మల్ని ఇంట్లో నుంచి ఎల్లగొట్టిండు. నా చదువు ఆగిపోయినాది. అమ్మ నన్ను మళ్ళీ స్కూలుకి తీస్కబో యింది. రెండ్రోజులవగానే నన్ను స్కూలుకి రావొద్దని పంపేశారు. చిన్నాయన కొడుకు, నాకు ఎయిడ్సుందని స్కూలు పిల్లలందరికి జెప్పిండు. అద్దెల్నీ టీచరు నన్ను రావొద్దంది. తర్వాత ఇంటికి బోవటం ఇష్టం లేక రైలెక్కి ఈడికొచ్చిన. ఈ ఇసయం ఎవురికీ తెలీదు. నీకు మాత్రమే జెప్పిన. ఎయిడ్సుకి మందుల్లే వంటగా! తొందరగా సచ్చిపోతారంట గదా! అందుకే నాకు గడిగడికీ జొరం, బేదులు వస్తుండాయి. ఎప్పుడో నేను సచ్చిపోత" వెక్కి వెక్కి ఏడు స్తూ చెప్పడం ముగించాడు.

శీను మనసంతా మొద్దు బారింది.

"ఊరుకో, ఎడ్వమాక. నీకేం గాదు. మనం ఎవ్వరికీ తెలీకుండా డాక్టరు దగ్గరికి బోదాం. నేను దీస్కబోత. నువ్వు నాతోనే ఉండు" అని ధైర్యం చెప్పాడు.

## నా మీద చెయ్యొద్దు సుమా...



ఇంగ్లాండులో జరగబోయే రౌండ్ టేబుల్ సమావేశంలో పాల్గొనడానికి బాపూజీ 1931వ సం. ఆగస్టు నెల 29వ తేదీన 'రాజపుతా'నా అనే ఓడలో బొంబాయి నుంచి బయల్దేరారు. ఓడ మార్సెలిన్ చేరుకొంది. కస్టమ్స్ అధికారులు బాపూజీ సామాన్లను పరిశీలించసాగారు.

"నేనొక పేదవాణ్ని. నా వద్ద ఉన్నదల్లా ఆరు రాట్నం చక్రాలు, జైలులో ఉపయోగించిన రెండు పళ్లాలు, మేకపాలతో వున్న ఒక డబ్బా, ఇంట్లో నేసిన ఆరు అంగవస్త్రాలు" అన్నారు గాంధీజీ. కస్టమ్స్ అధికారులు తెల్లబోయారు.

అలాగే... ఓడలో ప్రయాణించే రోజుల్లో బాపూజీ రాత్రిపూట ఓడ పై భాగంలో నిద్రించేవారు. ఒక రోజున ఓడలోని అనేక మంది ప్రయాణికులు ఆయన వద్దకు వచ్చారు. "గాంధీజీ! రాత్రి పూట మీరు నిద్రించే ప్రదేశంలో మేమంతా నృత్యం చెయ్య బోతున్నాం. మీ సమీపంలో మేము నృత్యం చెయ్యడానికి మీకేమైనా అభ్యంతరమా?" అనడిగారు వాళ్లు. "మీరంతా మీ ఇష్టం వచ్చినట్లు నృత్యం చేసుకోండి. అయితే ఆ నృత్యం ఏదో నా మీద జరక్కుండా చూడండి" అన్నారు బాపూజీ.

జాన్సన్‌ని చూసి వినోద్ దగ్గర కొస్తుంటే ఇద్దరూ లేచి స్టేషన్‌కి పరుగెత్తుకుంటూ వచ్చారు.

రెండో నంబర్లోకి సప్తగిరి ఎక్స్‌ప్రెస్ వచ్చి ఆగింది.

"నువ్విక్కడే కూచో... నేనెళ్ళి కూలీ దొరుకు తుందేమో చూసొస్తా" అని పరుగెత్తాడు శీను.

ఓ చిన్న ఫ్యామిలీ రైలు దిగారు.

"సార్! పెట్టెలు మోసుకొస్త సార్" అన్నాడు శీను.

ఓ ముప్ఫై అయిదేళ్ళ వ్యక్తి, భార్య, ఓ చిన్న పిల్లాడు వాళ్ళు ముందు నడుస్తుంటే శీను సూట్‌కేసు తల మీదుంచుకుని వెనకాల నడుస్తున్నాడు.

"బరువెక్కువగా ఉందా? " వెనక్కి తిరిగి అడిగాడాయన.

"ఫర్లేదు సార్... మోస్త"

స్టేషన్ ఎదురుగ్గా కొండకి (తిరుమల) వెళ్ళే టాక్సీ మాట్లాడుకున్నాడు.

శీను లగేజీ లోపల పెట్టాడు.

బయల్దేరడానికి ఇంకా టైముంది గాబోలు...

పర్సు తీసి పదిరూపాయలు తీసి శీను కిస్తూ "నీ పేరేంటి? " అని ప్రశ్నించాడు.

"శీను"

"ఏ ఊరు? "

"పాకాల దగ్గర సార్"

"చదువుకున్నావా? "

"సెవెంత్"

"ఇంట్లో నుండి పారిపోయి వచ్చావా? "

"..."

"చూస్తే చదువొచ్చే పిల్లకాయలాగున్నావు. చదువు జెప్పిస్త... చదువుకుంటావా? "

మౌనంగా నుంచున్న శీనుతో...

"నిజంగా చెప్తున్నా. మా ఊరు తీస్క బోయి, స్కూల్లో చేర్పిస్త" అన్నాడు.

ఆయన భార్య... "ఈ స్టేషన్లో పిల్లల్తో చేరి చెడు అలవాట్లు చేసుకోకు, చూస్తే మంచబ్బా యిలా ఉన్నావు" అంది.

చదువు సంగతి ఎత్తేసరికి శీను కళ్ళలో మెరుపు మెరిసింది.

బాగా చదువుకుని అమ్మని, అక్కని బాగా చూసుకోవాలి అనే భావన మనసులో మెదిలింది.

"మీరు..." ఎవరు అన్నట్టు నసిగాడు శీను.

"మేం కొండకి వెళ్తున్నాం. రెండ్రోజుల తర్వాత తిరిగి వస్తాం. మాతో వస్తానంటే... సరిగ్గా పదిగంటలకి ఇక్కడే ఉండు. నన్ను గుర్తుబడ్తావుగా" అని పర్సు తీసి విజిటింగ్ కార్డు తీసిస్తూ, "ఇందులో నా అడ్రస్, ఫోన్ నంబరూ ఉంది" అన్నాడు.

శీను మదిలో ఒకసారిగా ఆశ కడలి తరంగంలా ఎగిసి పడింది. కార్డు తిప్పి చూశాడు. దానిమీద 'రాంప్రసాద్' అని ఉన్న పేరు చదివాడు.

"బాగా ఆలోచించుకో. మాకు స్కూలుంది. నీలాంటి పిల్లలు శానా మందున్నారు. ఇక్కడే ఉంటే ఎందుకూ పనికి రాకుండా చేస్తారిక్కడి పిల్లలు"

"సరే సార్"

ఆయన భార్య రెండు లడ్లు, మురుకులు పేపర్లో పెట్టి శీనుకిచ్చి "తిను" అంది.

టాక్సీ బయల్దేరింది.

శీను చేతిలో పొట్లం గట్టిగా పట్టుకుని జాన్సన్ దగ్గరకి పరుగెత్తుకొచ్చి జరిగిందంతా చెప్పాడు.

"ఏమో ఈడ పిల్లల్ని చదివిస్తామని తీస్కబోయి ఊర్ల పన్లు జేయిస్తరంట. కొడతారంట. వీరిగాడు చెప్పినాడు, జాగర్త".

"ఆళ్ళని చూస్తే అలాంటోళ్ళలా కన్పించటం లేదు."

"ఏమో నీ ఇష్టం" అన్నాడు అయిష్టంగా

"సర్లే! చూద్దాం! ఇంద తిను" లడ్డు జాన్సన్‌కి పెట్టి తనూ తిన్నాడు.

"శీనూ! చేతికి రక్తం ఏంటి? "

"లగేజీ తీస్కబోతంటే పెట్టే పుండుకు తగిలింది" అని చొక్కా విప్పి... చేతిమీద పుండు చూసుకున్నాడు. తండ్రి కాల్చిన పుండు ఇంకా

మానలేదు. మళ్ళీ దానిమీదే దెబ్బ తగిలింది. చొక్కా విప్పాక గానీ శీనుకి గుర్తు రాలేదు తను నీళ్ళు పోసుకుని వారం రోజులు దాటిం దని. వళ్ళంతా చమట,

మట్టి, వాసన. తనని తాను చూసుకున్న శీనుకి క్షణంలో 'అమ్మ' కళ్లముందు కదలా డింది.

రోజూ కుండలో వేణ్ణీళ్లు కాగబెట్టేది. తనా ద్దని మారాం చేస్తున్నా, దొడ్లో నీళ్ల తొట్టి దగ్గర బండలమీద నుంచోబెట్టి, సబ్బుతో రుద్ది శుభ్రంగా నీళ్లు పోసిగానీ అన్నం పెట్టేది గాదు గౌరమ్మ.

శీను కళ్లలో నీళ్లు చూసిన జాన్సన్ కంగా రుగా.

"నెప్పెక్కువగా ఉందా? ఆస్పత్రికి పోదాం పద" అన్నాడు.

"ముందు నీళ్లు పోసుకోవాలి"

"పద... రెండో నంబరు చివరికి బోయి పంపు దెగ్గర పోసుకుందాం"

"మార్చుకోవడానికి బట్టల్లేవు"

"నా టవలు కట్టుకుని నీ గుడ్డలుతుక్కో"

షాంపూ, చిన్న ఒంటిసబ్బు, బట్టల సబ్బూ కొని తెచ్చి స్నానం చేసి బట్టలుతుక్కున్నాడు. శీను.

బట్టలారేసి, బెంచీమీద కూర్చున్నారిద్దరూ.

అంతలో అటువైపు పెద్దన్న, ఓ అపరిచిత వ్యక్తి, వారి వెనకాల వీరిగాడు, వెంకటేశు, మల్లేషు, రమేషు, రాజు, ప్రభాకర్, బద్రిగాడు, రాహుల్, ఇంకా కొంతమంది పిల్లలు వస్తుం డటం కనిపించింది.

శీను ఆశ్చర్యంగా చూస్తూ "ఏంటి? అంతా ఇటే వస్తున్నారు? "

జాన్సన్ చూసి "అరే! అటు చూడు పెద్దన్న పక్కన నడుస్తున్నాడు చూడు, ఆయనే అనాథ పిల్లల హోమ్ వార్డెన్. నెలకోసారి పిల్లల్నిం దర్నీ హాస్టలుకి పిలుస్తాడు ఐదు రూపాయలి స్తడు"

శీను, జాన్సన్‌లని చూసి, "రేయ్! మీరూ మాతో రాండ్రా!" అని పిల్చాడు పెద్దన్న.

ఇద్దరూ ఆరని గుడ్డల్నే వేసుకుని వాళ్లతో కలిశారు.




అది అనాథ పిల్లల కోసం నడుపుతున్న ప్రభుత్వ కేంద్రం. పెద్ద హాల్లో పిల్లలంతా కూచున్నారు. పెద్దన్నతో వచ్చిన వార్డెన్ పిల్ల ల్నుద్దేశించి మాట్లాడాడు.

"పిల్లలూ ఇవ్వాళ ఇన్‌స్పెక్షనుంది. వాళ్లొచ్చి మిమ్మల్నెవరైనా ఏదైనా అడిగితే రాత్రిళ్లు ఇక్కడే పండుకుంటామని, జ్వరా లొస్తే మందులిక్కడే ఇస్తున్నారనీ చెప్పాల. పెద్దన్న గురించి మీకు తెల్సుగా!"హెచ్చరించి నట్టు అన్నాడు.

మధ్య మధ్య పిల్లలు వచ్చి కూచుంటు న్నారు. వాళ్లలో వినోద్ బ్యాచ్, శంకర్‌దాదా కూడా ఉన్నారు.

శీను మనసులో ఏదో ఆలోచన తొంగిచూ సింది. ఏదో మోసం... ఇక్కడ ఏదో మోసం జరుగుతోంది. అందుకే అబద్ధం చెప్తున్నారు. చెప్పమంటున్నారు. నిజం చెప్తే... 'వీళ్లంతా పిల్లలను చావగొడ్తారు కాబోలు' అని తనలో తాను అనుకుంటుంటే, పై అధికారులు రానే వచ్చారు. వాళ్ల వెంటే పెద్దన్న వచ్చాడు.

వచ్చిన వాళ్లు ముందు వరుసలో కూచున్న వాళ్లని ఏవో ప్రశ్నలడుగుతున్నారు. వాళ్ల కిదంతా అలవాటయినట్లుగా జవాబులు గడ గడా చెప్తున్నారు.

అధికారులు పిల్లలందరికీ చాకెట్లు, బిస్కట్లు పంచి పెట్టారు. సంతృప్తి చెందిన మొహాల్తో. గంటసేపు హోంలో గడిపి వెళ్లిపో యారు. అందరితోబాటు శీనుకీ ఐదు రూపా యలిచ్చారు. పిల్లలంతా ఎవరి తోవన వాళ్లెళ్లి

పోసాగారు. దారిలో శీను, జాన్సన్ గవర్న మెంటాసుపత్రికెళ్లి చేతికి కట్టు కట్టించుకుని వస్తుంటే, రాజు కన్పించాడు.

"ఏడికి బోయి వస్తున్నారిద్దరూ" అన్నాడు పక్కకొచ్చి

"ఆస్పత్రికి. శీను చేతి పుండుకు కట్టు కట్టించుకొస్తన్నాం"

"శీనూ! నీ కోసమే వస్తన్నా! నేను పన్జేసే హోటల్లో ఓ పిల్లాడు మానేశాడు. ఆ పనికి నువ్వొస్తామోనని అడుగుదామని..."

"హోటలెక్కడుంది"

"బస్టాండు దెగ్గర సందులో"

"ఎంతిస్తరు? "

"టిఫిను, అన్నం పెట్టి నెలకి ఐదొందలు, వారానికోసారి లీవు, పది రూపాయలు బేటా. రేత్రిళ్లు ఆణ్ణే పండుకోవాల."

శీను మనసులో చిగురాశ. ఒకేచోట పనిచెయ్యడం వల్ల ఎవర్నీ అడుక్కోకుండా డబ్బులొస్తాయి. పుస్తకాలు కొనుక్కుని చదూకోవచ్చు జాన్సన్‌కి సాయం చెయ్యొచ్చు ఊహలు క్షణ కాలం కళ్లముందు ఆకాశంలో విహరించాయి.

"నేనొస్త" అన్నాడు శీను.

"అయితే, రేపు సాయంత్రం వొచ్చి తొడ్కోబోత" అనేసి వెళ్లిపోయాడు రాజు.

వెంటనే జాన్సన్ "ఈడెప్పుడూ ఇట్లనే జెప్తడు. నన్నూ ఓసారి తీస్కబోతనని చెప్పి మల్లా రానేలేదు. వేరేవాళ్లొచ్చిండ్రని చెప్పాడు" అన్నాడు.

"ఏమోలే, వస్తే పోత. లేకుంటే లేదు"

ఇద్దరూ కల్సి స్టేషన్‌కొచ్చారు.

అప్పుడు ఉదయం ఎనిమిది గంటలు.

పిల్లలంతా కలిసి టీ తాగి, రైలొచ్చే సరికి తలా ఒకవైపు వెళ్లిపోయారు.

జాన్సన్, శీను, రమేషు బెంచీ మీద కూచున్నారు. రమేషు ఏదో చెప్తున్నాడు. వాళ్ళ దగ్గరకో కుర్రాడొచ్చి..

"ఏరా జాన్సన్! జొరమొచ్చిందంట గదా! తగ్గిందా? " అని పక్కన కూచుని పరామర్శించాడు.

"అవును... జొరం, బేదులు. ఇప్పుడు తగ్గాయి. నువ్వేంటి, పనికి పోలేదా? "

"లేదు"...

"శీనూ! ఈడు సూరి. మన దోస్తు... హోటల్లో పన్జేస్తడు. హైదరాబాదు నుంచొచ్చాడు"

సూరి శీనుని చూసి నవ్వాడు.

"సూరీ! శీనుది పాకాల. ఏడు చదువుతున్నడు. జొరం వస్తే మాత్రలు తెచ్చి, నన్ను ఆస్పత్రికి తోడ్కొబోయిండు"చెప్పాడు జాన్సన్.

శీను "హలో" అన్నాడు సూరితో.

"మాది హైదరాబాదు. మూణ్ణెల్లయిందిక్కడికొచ్చి పెద్దన్న హోటల్లో పనికి బెట్టిండు"

"అట్లగా"

"సరేరా! జాన్సన్... వొళ్ళు జూసుకో... రాత్రికొచ్చి కలుస్త" అని గబబగా వెళ్లిపోయాడు సూరి.

తన వయసే ఉన్న సూరి అడుక్కోకుండా పన్జేసుకోవటం శీనుకి నచ్చింది.

తొమ్మిది గంటల కొచ్చిన రైలు దగ్గర శీనుకి కూలి దొరికింది.

ఆ డబ్బుతో స్టేషనెదురుగా ఉన్న హోటల్లో ఇద్దరూ తిన్నారు.

ఉదయం పదకొండు గంటలు.

శీనూ, జాన్సన్, మల్లేషు బెంచీమీద కూచుని మొక్కజొన్న కంకులు తింటున్నారు.

అక్కడికి రమేష్ పరుగెత్తుకుంటూ వచ్చి,

"అరే! జాన్సన్... కోనేటి దగ్గరకి టి.వి. వాళ్ళొచ్చినారు. బద్రిగాడు, వీరిగాడు, రాహుల్ అక్కడ వాళ్ళతో మాట్లాడుతున్నారు. రండ్రా! మనమూ పోదాం" అని రొప్పుతూ చెప్పాడు. జాన్సన్, మల్లేషు లేచేసరికి శీను కూడ వాళ్ళని అనుసరించాడు.

కోనేరు మెట్లమీద కూచుని టి.వి. యాంకర్ రహీమ్ మైక్ పట్టుకుని వీరిగాడితో మాట్లాడుతుంటే, పిల్లలంతా అక్కడికి చేరారు.

రహీమ్ కెమెరా వైపు చూస్తూ...

"ఇక్కడున్న ఈ పిల్లలు తల్లిదండ్రుల బాధ్యతారహిత ప్రవర్తన వల్ల ఇంటి నుండి పారిపోయి వచ్చి, చదువుకునే వయసులో ఇలా

రైల్వే ప్లాట్‌ఫారాల మీద, బస్టాండ్లలో, రోడ్ల మీద అడుక్కుంటూ, సోమరులై, వ్యసనాలకు బానిసలై, భవిష్యత్తుని పాడు చేసుకుంటూ జీవనం సాగిస్తున్నారు. ముఖ్య పట్టణాలలో రైల్వే స్టేషన్లలో, పిల్‌గ్రిమ్ సెంటర్లలో వీళ్లు ఎక్కువగా కన్పిస్తుంటారు.

అమ్మా నాన్నల ఒడిలో ఒదుగుతూ ఎదగాల్సిన బాల్యం బజార్నపడి బతుకు తెరువు కోసం దేవులాడుతోంది. ప్రతి పూట ఆకలి పోరాటం. ఇపుడు మనతో ఇలాంటి కొంతమంది వీధి బాలలున్నారు. ఒక్కొక్కళ్లదీ ఒక్కో కథ. అదేమిటో వాళ్ళ మాటల్లోనే విందాం...

అని మైకు బద్రి ముందుంచి "నీ పేరు" అనడిగాడు.

"బద్రి... బద్రీ నారాయణ... అంతా బద్రి అంటారు" అన్నాడు. సినిమా హీరో స్టైల్లో.

"మీదేవూరు? "

"పెద్దాపురం"

"అమ్మా, నాన్న ఉన్నారా? "

"ఉంటే ఇలా ఎందుకౌతాను"

"అంటే...!"

"అమ్మెవరో, నాన్నెవరో తెలీదు"

"ఇక్కడేం చేస్తుంటావు? "

"ఆకలేస్తే ఏదైనా చేస్తాను" అని జేబులో సగం కాల్చిన సిగరెట్ తీసి వెలిగించాడు.

అది చూస్తూ "నీకేమేం అలవాట్లున్నాయి? " అనడిగాడు యాంకర్.

"కన్పిస్తుళ్ళా! సిగరెట్లు, దొరికితే మందు, సిన్మాలు జూస్త, గంజాయి దొరికితే తాగుతా" అని అక్కణ్ణుంచి లేచెళ్తున్న బద్రి



ని వదిలి పక్కనే ఉన్న పిల్లాడితో సంభాష ణలు మొదలు పెట్టాడు యాంకర్.

"నీ పేరు? "

"వినోద్"

"ఎన్నేళ్ళ నుంచీ ఇక్కడుంటున్నావు? "

"తెలీదు"

"ఏం చేస్తుంటావిక్కడ? "

"నా అవసరాలకి కావల్సిన డబ్బు సంపా



యిస్తే"

"అవసరా లంటే..."

"మీకేం ఉంటాయో మాకూ అవ్వే"

వెంటనే యాంకర్‌కి ఏం మాట్లాడాలో తెలీ లేదు.

చిన్నగా నవ్వి ఏదో అడగబోతుంటే వినోద్ లేచి వేగంగా వెళ్ళిపోయాడు.

రహీమ్ కెమెరా వైపు తిరిగి "తల్లిదండ్రుల నిర్లక్ష్యం వల్ల కొందరు, అమ్మా నాన్నలెవరో తెలియనివాళ్ళు కొందరు, తామెవరో తమకే తెలీని వాళ్ళింకొందరు. వీళ్ళకి సమాజంపై కసి, కోపం. వీళ్ళ కష్టం మీద బతికే దళా రులు వీళ్ళని పన్నల్లో కుదిర్చి ఆ డబ్బుతో బతికే గుండాలూ... ఇక్కడ ఎంతోమంది" అని పక్కకి తిరిగి నుంచున్న శీనుతో

"నీ పేరు? "

"శీను"

"ఏ ఊరు? "

"పాకాల"

"ఎన్నాళ్ళయిందిక్కడికొచ్చి"

"పదిరోజులు"

"చదువుకోకుండా..."

"సెవెంత్ స్టాండర్డ్ చదువుకుంటున్న..."

"మరెందుకొచ్చావు? "

"బాగా చదువుకుని అమ్మ, అక్కని బాగా చూసుకోవాలనుకున్న కానీ... ఇదుగో ఇప్పుడిలా... ఇంట్లో నుంచి రావాల్సొచ్చింది. చదువాగి పోయింది. రేపు ఏమవుద్దో. ఖచ్చితంగా చదువు కుంటా"

ఆసక్తికరంగా చెప్పిన శీను మాటల్ని హైలైట్ చేసి చెబుతూ, ముగింపుగా వ్యాఖ్యానం చేశాడు యాంకర్. "మొగ్గ దశలోనే తుంచివే యబడుతున్న ఈ పసిమొగ్గల జీవితాలపై జరిపిన సర్వేలో ఎన్నో ఆసక్తికరమైన విష యాలు, మనకు తెలీని, వెలుగు జూడని మరెన్నో అంశాలు తెలిశాయి. వీళ్ళపై జులుం చెలాయించే, రౌడీలు, బ్రోకర్లు, పోలీసులు, వీళ్ళతో తమ వాంఛలు తీర్చుకునే నపుంస కులు, వీళ్ళ జీవితాలకి చరమగీతం పాడే, నర హంతకులు మన సోకాల్డ్ సభ్యసమాజపు ముసుగులో పైకి పెద్ద మనుషుల్లా చెలామణ వుతున్నారు.

ఈ అనాథ పిల్లల జీవితం, వీళ్ళలో ఉండే తెలివితేటల్ని వెలికి తీయడానికి, వీళ్ళ ఆలనా పాలనా, చదువు సంధ్యలు చూడటా నికి స్వచ్ఛంద సంస్థలు ముందుకొస్తున్నా

ఫలితం మందకొడిగానే ఉంది. ప్రభుత్వ సహకారం అవసరం. బాలకార్మిక వ్యవస్థ నిర్మూలనకి నడుం బిగించామన్న మంత్రుల ఇళ్ళలో పనివాళ్ళంతా బాల కార్మికులే. ప్రభుత్వం స్వచ్ఛంద సంస్థల సాయంతో చెయ్యందిస్తే ఈ వీధి బాలల్లో దాగున్న నవతరం గాంధీ మొదలు... కలాం వంటి ఎందరో మేధావులు వెలుగు చూస్తారు. ఆ రోజెప్పుడో" అని ముగించాడు.




శీను ఇల్లొదిలి పదిహేను రోజులయింది.

గౌరమ్మ తెల్సిన చోటల్లా వెతికి, వెతికి అలిసిపోయింది. పక్క ఊళ్ళలో, బంధువుల ఇళ్ళలో ఆరా తీసింది. పగలంతా కొడుకు కోసం తిరిగి రావటం, రాత్రిళ్ళు కొడుకు కోసం ఏడుస్తూ పడుకోవడం. ఇదే ఆమె దినచర్య అయింది. కూతురు లక్ష్మి మాత్రం కూలికి వెళ్తోంది.

శీను ఇల్లొదిలి వెళ్ళటంతో, తనకేమీ సంబంధం లేనట్టు సాంబయ్య సారాకొట్టు దిన చర్యలో మార్పు లేదు.

రాత్రికాగానే తూలుతూ వచ్చిన సాంబయ్య

"గౌరీ! గౌరమ్మా!! అన్నం బెట్టు" అని లోపలికొచ్చి ఎదురుగా కన్పించిన వ్యక్తిని చూసి కంగారుగా, తడబడుతూ నిలదొక్కుకుని, "నువ్వా? ... బా...వా... ఎప్పుడొచ్చినావు? " అన్నాడు. ఆ వ్యక్తి సాంబయ్య వైపు అసహ్యంగా చూస్తూ...

"ఏరా! నువ్వసలు మణిసివేనా? పిల్లకాయ ఇల్లొదిలిపోయి పదేను దినాలవుతా వుంటే, సీమ కుట్టినట్టయినా లేకుండా సారా కొట్టమ్మట తిరుగుతా ఉండావా? "

"..."

"ఏంరా! మాట్లాడవు... బుద్ధి లేదంట్రా! వయసు కొచ్చిన ఆడపిల్లని, పెండ్లాన్ని కూలికి పంపి, సిగ్గులేకుండా బతుకుతుం డావు"

"అదీ... అ...ది"

"ఛీ! మాట్లాడమాక. ఆడకూతురు పిల్లకాయ కోసం ఊరూరూ తిరుగుతూ ఉంటే నీ బతుకు సెడ... సిగ్గు లేదంట్రా!"

"నేనూ ఎతుకుతూనే ఉంటిని"

"నీ ఎతుకులాట సారా కోసమే గదా!"

వెంకటాద్రి తీవ్రంగా మాట్లాడుతుంటే సాంబయ్య జంకాడు. వెంకటాద్రి గౌరమ్మకి అన్న.

"ఏందే! గౌరమ్మ! సదూకునే పిల్లకాయ ఇల్లొదిలి బోయి పదేను దినాలవుతా ఉంటే, కబురంపగూడదంటే? నేను లేననుకుం టివా? "

"అది కాదన్నా! రేపు నేనే వద్దామను కుంటా ఉంటిని" అంది గౌరమ్మ, దుఃఖంతో బొంగురుపోయిన గొంతుతో.

"నువ్వనుకుంటానే ఉండు, ఈడు సారా కొట్టమ్మట తిరుగుతానే ఉంటడు, నీ కొడుకు మాదిరిగానే నీ కూతురూ రేపు ఇల్లొదిలి పోతాది"

"నన్నేం జెయ్యమంటావు... ఇంటికైన మొగాయన ఇట్టా తయారైతే..." ఏడుస్తూ అంది.

"సరే! సరే! ఇట్టా ఇల్లొదిలివెళ్ళిన పిల్లకాయలు శానామంది తిరపతిలో, హైద్రాబాదులో, బెజవాడ, మద్రాసుల్లో ఎక్కువగా తిరుగుతా ఉండారు. మనోడు ఆణ్ణే యాడో ఉంటాడు. మీరిద్దరు ముందు తిరపతికి బోయి చూసి రండి. నేను హైద్రాబాదు బోయొస్త. ఇంద" అని డబ్బులిచ్చాడు.

"మళ్లీ ఈ డబ్బులు ఆడి తాగుడికి ఇయ్యమాక... మల్ల నాల్గు రోజుల్లో నేను వస్త. వచ్చేసరికి శీనుగాడు ఇంట్ల అవుపడాలి" అని

లేచాడు వెంకటాద్రి.

"అన్నం తిని పడ్డన్ని బోవచ్చుగదా" అంది గౌరమ్మ.

"వద్దొద్దు... పనుండాది" అని లేచి, సాంబయ్యని చూస్తూ, ఏదో అనబోయాడు.

సాంబయ్య లేచి నిలబడబోయి తూలిపడ్డాడు.

"ఛూ! నీ... సిగ్గుండాల, పెళ్లాం, పిల్లలు కూలి జేసి పెడ్తే తినే జన్మ... నువ్వూ మణిసివేనా? ... వస్త చెల్లెమ్మా!" అని బయటికి నడిచాడు వెంకటాద్రి.

వెంకటాద్రికి సాంబయ్య మేనత్త కొడుకు. దగ్గరి బంధుత్వం కావడంతో ప్రేమగా చూసుకుంటాడని చెల్లెలు గౌరమ్మనిచ్చి పెళ్లి చేశాడు. ఒక వయసువాళ్లే ఇద్దరూ.

అంచెలంచెలుగా వెంకటాద్రి ఆర్థికంగా పుంజుకుని నిలదొక్కుకుంటే, సాంబయ్య వ్యసనాల పాలయి, సారా షాపుల్లో కాలక్షేపం చేస్తున్నాడు.

వెంకటాద్రి అన్న మాటలకి సాంబయ్యకి తాగిన సారా మత్తొదిలింది.

భార్య వైపు చూసి, "అన్నం పెట్టు, ఆకలేస్తుంది" అన్నాడు.

"ఇంట్లో బియ్యం లెవ్వయ్యా... నూకలుంటే గంజి కాసిన... కావాల్నంటే పట్టుకొస్త"

"తీస్కరా. 'లచ్చిమి తిందా? "

గౌరమ్మకి అంత శోకంలోనూ నవ్వాలనిపించిందా మాటకి.

సాంబయ్యకు వంటికి కమ్మిన మత్తు పూర్తిగా, మనసుకి కమ్మిన పొరలు కొద్ది కొద్దిగా పక్కకి తప్పుకుంటున్నట్టనిపించింది.

అవును... శీనుగాడు ఇల్లొదిలివెళ్లాడు. ఎక్కడున్నాడో, ఏం చేస్తున్నాడో, అని తండ్రి మనసుతో మొదటిసారిగా ఆలోచించాడు. గానీ అది క్షణంసేపు మాత్రమే.

గౌరమ్మ తెచ్చిన గంజి గటగటా తాగాడు. నిద్ర కళ్లమీద దాడి చేస్తోంది. అయినా బావమరిది వెంకటాద్రి అన్న మాటలు చెవుల్లో మార్మోగుతున్నాయి. అంతే! రాబోతున్న నిద్రని పారదోలి పళ్లు పటపట కొరుకుతూ...

"అరేయ్ ఎంకటాద్రి!" అన్నాడు. మొగుడి సంగతి తెల్సిన గౌరమ్మ మౌనంగా పడుకుంది. ఎప్పుడు లేచెళ్లాడో సాంబయ్య, అర్ధరాత్రి మెలకువ వచ్చి చూసిన గౌరమ్మకి కన్పించలేదు.

"ఈడు మారడు" అనుకుంది విరక్తిగా.

## 12



సాయంత్రం అయిదు గంటలు.

శ్రీనివాస థియేటర్ దగ్గర "రంగ్ దే బసంతి" హిందీ సినిమా హోర్డింగ్ ముందు నిలబడ్డ రాహుల్, ఆ సినిమా హీరోలా ప్యాంటు బనీను సరిచేసుకుని ఫోజులిస్తుంటే- వెనక నుండి చూసిన శీను మెల్లగా వెళ్లి భుజం మీద చెయ్యేసి "రాహుల్" అన్నాడు.

సడన్‌గా వెనక్కి తిరిగి చూసి శీనుని చూసి సిగ్గుగా మెలికలు తిరుగుతూ 'చుమ్మా' అన్నాడు రాహుల్.

"చూడు ఎంతమంది నిన్ను చూస్తున్నారు" అని రాహుల్ చుట్టూ నిలబడి వేడుక చూస్తున్న జనాన్ని చూపించాడు. అప్పటివరకూ తన చుట్టూ ఉన్న జనాన్ని గమనించని రాహుల్ "చల్ రే భాయ్ చల్" అంటూ వడివడిగా వెళ్లిపోయాడు అక్కణ్ణుంచి.

శీను రైల్వేస్టేషన్‌కు వెళ్తుంటే దారిలో సూరి కన్పించాడు.

"శీనూ! నీ కోసమే వస్తన్నా! నేను పన్జేసే హోటల్లో నీ గురించి చెప్పాను. తోడ్కొరమ్మన్నాడు మా ఓనరు. పోదామా? " అన్నాడు.

"స్టేషన్లో జాన్సన్ ఉన్నాడు, చెప్పొద్దాం"

ఇద్దరూ కలిసి స్టేషన్లో కొచ్చారు. జాన్సన్‌ని కల్సి చెప్పాడు శీను. "జాగర్త. పెద్దన్నకి చెప్పి పో" అన్నాడు జాన్సన్.

"నేను చెప్పిన, తీస్కబొమ్మన్నాడు" అన్నాడు సూరి. ఇద్దరూ బయల్దేరారు.

బస్టాండు దగ్గర్లో ఉన్న సందులో ఉంది సూరి పన్జేసే హోటల్.

"సేటూ, ఇడుగో... నేను చెప్పలా... ఈడే...శీను"

శీనుని ఎగాదిగా జూసి "ఏమేం చేయాల్నో చెప్పినావా? "

"చెప్పాను"

"మస్తాన్‌కి చూపించు. లోపలికి బోండి" అన్నాడు ఓనరు.

"మస్తానెవురు? " నెమ్మదిగా రాజుకు మాత్రమే విన్పించేలా అడిగాడు శీను.

"మస్తాన్ ఇక్కడ మేనేజరు. శానా చెడ్డోడు. అందర్నీ తిడ్తడు..."

అంతలో ఎదురుగా మస్తానొచ్చి సూరిని చూసి,

"అరేయ్, కామ్ ఛోడ్‌కర్ క్యాకర్‌రే? " అన్నాడు.

"ఈడే శీను. కొత్త పిల్లకాయ. పన్లోకి తెచ్చిన. ఓనరు చూసిండు, నీకు చెప్పమన్నాడు" అన్నాడు సూరి భయంగా.

"యహా, క్యా క్యా కర్‌నా ఉస్‌కూ బోలా!"

"చెప్పిన"

"ఠీక్ హై. అందర్ లే జావ్" అని శీనుని చూస్తూ "అచ్ఛా కామ్ కరో" అన్నాడు మస్తాన్.

రాత్రి పదకొండు గంటల వరకూ సూరి పని చేస్తూనే ఉన్నాడు. సూరితోనే ఉన్నాడు శీను, అతడికి సాయం చేస్తూ.

పదకొండు తర్వాత సూరి, శీనుతోబాటు అక్కడ పన్జేసే వాళ్ల ఈడు పిల్లలందరికి అన్నం పెట్టారు. సేటు ఇంటికి వెళ్లాక హోటల్ మూశారు. వర్షం మొదలయింది. హోటల్ పైనున్న చిన్న గదిలో శీను, సూరి, మిగిలిన పిల్లలతో కలిసి పడుకున్నాడు.

"పొద్దున్నే నాలుగ్గంటలకి లేవాల" అన్నాడు రాజు.

"నన్ను లేపుతావా? "

"అట్లనే... నాకంటే ముందు మస్తానే వొచ్చి లేపుతడ్లే" అన్నాడు రాజు.

* * *

ఉదయం నాలుగు గంటలు.

సూరి నిద్రలేచి, శీనుని తట్టి లేపాడు. శీను బద్ధకంగా లేచాడు. ప్రతిరోజూ విన్పించే రైళ్ల శబ్దాలు, అరుపులు, జనం మాటలు లేకుండా ప్రశాంతంగా ఉంది.

"అరే! సబ్ ఉఠే క్యా నై? " మస్తాన్ గొంతు కంచుకంఠంలా వినిపించేసరికి మిగతా ముగ్గురూ లేచారు. శీను లేచి నుంచున్నాడు. మస్తాన్ అతణ్ణి చూసి, "తూ ఝాడ్ కే, ఫిర్ టేబుల్ సాఫ్ కరో" అంటూ వెళ్లిపోయాడు.

సూరి చీపురు తెచ్చి శీనుకిచ్చాడు. శీను చీపురు తీసుకుని చిమ్మటం మొదలెట్టాడు. అలవాటు లేని ఎన్నడూ చెయ్యని పని. హోటల్లో కుర్చీలు, టేబుళ్ల కింద చిమ్ముతుంటే మస్తాన్ వచ్చి, "అరే జల్దీ కరో, ఇత్‌నా హల్లా కరే తో మార్ ఖాతా" అని ఉరిమినట్లుగా అంటూ పక్కనే నిలబడ్డాడు.

శీనుకి హిందీ అర్థం గాకపోయినా తొందరగా చెయ్యమంటున్నాడని అర్థమయింది. వేగంగా చిమ్ముతూ టేబుల్ కింద నుండి లేవబోతుంటే... పుండున్న చేతికి టేబుల్ తగిలింది. "అమ్మా? " అనబోయాడు కానీ, మస్తాన్‌ని చూసి ఆ బాధామయ పిలుపు గొంతు లోపలే ఆగిపోయింది. అంతా చిమ్మాక స్వాబ్ చెయ్యమని, స్వాబ్ స్టిక్ చేతికిచ్చాడు మస్తాన్. శీను చిన్న చేతులకది సాధ్యం కాక, అటు ఇటు తిప్పలేకపోతుంటే సూరి వచ్చి ఎలా చేయాలో చేసి చూపాడు. ఆ పని పూర్తవుతుండగానే డెట్టాల్ కలిపిన నీళ్లు, స్పాంజి చేతికిచ్చి టేబుళ్లన్నీ తుడిపించాడు మస్తాన్. అప్పటికి పూర్తిగా తెల్లారింది. హోటల్‌కి కస్టమర్లు నెమ్మదిగా రాసాగారు.

రాజు, ఇంకో కుర్రాడు కస్టమర్లకి కాఫీ, టీ

అందిస్తుంటే, నుంచుని గమనిస్తున్న శీను తలమీద ఫెడేల్మని ఎవరో కొట్టారు. పిడుగు పడ్డట్టు తగిలిన ఆ దెబ్బకి బాధతో వెనక్కి తిరిగేసరికి మస్తాన్ కనిపించాడు.

"చల్ బే చల్. ఇధర్ ఖడేతో కప్ కోన్ ధోతా? చల్" అని చెయ్యిపుచ్చుకుని లాక్కెళ్లాడు.

ఆ క్షణంలో శీను ఫీలయిన అవమానం... అసహనంగా మస్తాన్ని చూసిన అతడి కళ్లలో ప్రతిఫలించింది.

పది గంటలదాకా కప్పులు కడగటం, కస్టమర్లు తిన్న ప్లేట్లు కడగటం విరామం లేకుండా చేయిస్తూనే ఉన్నాడు మస్తాన్.

పది గంటల తర్వాత సేటొచ్చి, క్యాష్ చూసుకుని వెళ్లిపోయాడు. అప్పుడు సూరి శీను దగ్గరకొచ్చి "రా! టిఫిన్ తిందాం" అని తీసుకెళ్లాడు.

మూత్రం పోసుకోవడానికి రోడ్ మీదికొచ్చిన శీనుకు కనిపించింది. హోటల్ కి దగ్గర్లో ఓ కార్పొరేట్ కాలేజీ. అక్కడి పిల్లలంతా హోటల్ కే వస్తారని గ్రహించాడు.

మళ్లీ మధ్యాహ్నం మూడు వరకూ శీను చేతులు కప్పులు, ప్లేట్లూ కడుగుతూనే ఉన్నాయి.

ఒక్క నిముషం రిలాక్సయినా నిప్పులు చెరిగే మస్తాన్ కళ్లు వెంబడిస్తూనే ఉన్నాయి. మూడు గంటల తర్వాత అన్నం పెట్టారు. అరగంట విశ్రాంతి తర్వాత... రాత్రి పదివరకూ మళ్లీ పనులు చేయిస్తూనే ఉన్నాడు.

రాత్రి పదకొండు తర్వాత నడుం వాల్చిన శీనుకి ఒళ్లంతా నెప్పులు, అలసట అనిపించింది. పుండుమీద మళ్లీ పొద్దున తగిలిన దెబ్బ, రోజంతా చాకిరీతో కదిలిన కదిలికలు కలగలిసి నెప్పి పుట్టసాగింది. ఆ సలపరింతకి జ్వరం వచ్చింది.

యథాప్రకారం తెల్లవారుజామునే మస్తాన్ వచ్చి పిల్లల్నందరినీ లేపాడు. శీను లేవలేదు. సూరి లేపాడు.

"జొరం వచ్చింది. లేవలేకుంటిని" అన్నాడు.

"మస్తాన్ తో చెప్పి జూస్త"

ఐదు నిమిషాల తర్వాత మస్తానొచ్చి..

"ఉఠ్ బే ఉఠ్! ఏకీ దిన్ మె బుఖార్ ఆయా... ఉఠ్... ఉఠ్" అని శీనుని కాలుతో తన్నాడు.

భారంగా, ఉండి ఓపిక లేకున్నా దభాల్న లేచి నుంచున్నాడు శీను. అంతలోనే నుంచోలేక "నాకు జొరంగా వుంది" అని కూలబడ్డాడు. మస్తాన్ చెవులకి ఆ మాటలు విన్పడనట్టు, శీను జుట్టు పట్టుకుని లేపి నుంచోబెట్టాడు.

మళ్లీ కూచున్న శీనుని హిందీలో బూతులు తిడుతూ లేపి నుంచోబెట్టి, వేగంగా వాష్‌బేసిన్ దగ్గరకి పశువుని లాక్కెళ్లినట్టు లాక్కెళ్లాడు.

నీళ్ల ట్యాప్ తిప్పి, మగ్గుతో నీళ్లు తీసుకుని శీను మొహంమీద బలంగా ఈడ్చికొట్టాడు. వంట్లో జ్వరానికి, చన్నీళ్ల చల్లదనానికి మొహం మీద రాళ్లతో కొట్టినట్టన్పించింది

మస్తాన్ తనని ఏం చెయ్యబోతున్నాడో తెలియని శీను అవాక్కయి నిలబడ్డాడు.

అంతే... నీళ్ల ట్యాప్ తిప్పి, మగ్గుతో నీళ్లు తీసుకుని శీను మొహంమీద బలంగా ఈడ్చి కొట్టాడు. వంట్లో జ్వరానికి, చన్నీళ్ల చల్లదనానికి మొహం మీద రాళ్లతో కొట్టినట్టన్పించింది.

శీను చేతులు మొహానికి అడ్డుపెట్టుకుంటుంటే, బలవంతంగా చేతులు లాగి.

"క్యారే! కుత్తే కమీనే! సోగయే తో కామ్ కోన్ కర్తా? " అంటూ మళ్ళీ నీళ్ళు కొట్టాడు.

అంతే! ఇక నిగ్రహించుకోలేక శీను ఏడ్చేశాడు.

"వద్దు... వద్దు... పస్జేస్త" అంటున్నా విన్పించుకోకుండా మళ్ళీ మొహంమీద నీళ్ళు కొట్టాడు మస్తాన్.

శీను చేతులడ్డు పెట్టుకుని ఏడుస్తూండటం

చూస్తున్న మిగిలిన పిల్లలు నోరు మెదప కుండా తమ పన్లు చేసుకుంటూనే ఉన్నారు. కనీసం అదేమని అడగలేదు. ఎందుకంటే ఇదంతా వాళ్ళకి ఎన్నోమార్లు ఎదురైన అను భవమే గాబట్టి.

"హరామ్ కే ఔలాద్. ఏక్ దిన్ మె ఖానా జాదా హోగయా క్యాబే" అని శీనుని మెడ పట్టుకుని ముందుకు నెట్టాడు మస్తాన్.

శీను ఏడుస్తూనే చీపురు తీసుకుని దినచర్య ప్రారంభించాడు. కసి, ద్వేషం, అసహాయత... ఎవరి మీద? అతడికే తెలియదు. బాల్యం బేలగా విస్తుపోతోంది. అవసరం రోజంతా శీనుతో పని చేయిస్తూనే ఉంది. పదేపదే గుర్తొస్తున్న పరాభవం శీనుని అక్కడ ఉండ నివ్వలేదు.

సాయంత్రం సూరికి చెప్పి స్టేషన్‌కి పరుగె త్తుకొచ్చాడు. స్టేషనంతా జాన్సన్ కోసం వెతి కాడు. కన్పించలేదు.

ఖాళీగా ఉన్న బెంచీ మీద ఒంటరిగా కూచున్నాడు.

ఒకటో నంబర్లోకి ఎక్స్‌ప్రెస్సేదో వచ్చింది.

ఎక్కేవాళ్ళు, దిగేవాళ్ళ ఆరాటం మధ్య అమ్ముకునే వాళ్ళ పోరాటం.

ప్లాట్‌ఫారం రద్దీగా ఉంది.

ధ్వని కాలుష్యాన్ని భరించలేక లేచి ప్లాట్ ఫారం చివరికొచ్చి కూచున్నాడు.

స్టేషన్లోకి నినాదాలు చేస్తూ గుంపొకటి వస్తోంది. వాళ్ళ చేతుల్లో బ్యానరొకటుంది. దానిమీద "చేయూత" (అనాథల కోసం ఓ అభయహస్తం)" అని రాసుంది.

వాళ్ళు దగ్గరకొచ్చారు.

మధ్యలో ఓ యువతి, ఆమె చుట్టూ ఓ అయిదారుగురు స్త్రీలు, చుట్టూ ఇరవైమంది మగాళ్ళున్నారు.

వాళ్ళలో పెద్దన్నతో బాటు అనాధపిల్లల హోం దగ్గర చూసిన వ్యక్తులు కూడ ఉన్నారు.

శీను లేచెళ్ళబోతుంటే పెద్దన్న చూసి తమతో రమ్మని సైగ చేశాడు.

మాట్లాడకుండా వాళ్ళతో చేరాడు. వెనక నుండి ఎవరో పిల్చినట్టనిపించి వెనక్కి తిరి గాడు. రాహుల్, జాన్సన్, రమేష్, వెంక టేశు... బ్యాచంతా వస్తున్నారు.

ఒకటో నంబరు ప్లాట్‌ఫారంలోకి రాగా నే..ఓ మహిళ ముందుకొచ్చి మైక్ పట్టుకుని

"సోదర సోదరీమణులారా! అనాథపిల్లల పాలిటి అభయ హస్తం మన ఇంద్రక్క. అమ్మా నాన్నల ఆదరణ కరవై వీధి బాల లుగా, బిక్షాటన చేస్తూ, జీవిస్తున్న పిల్లలను ఆదుకునేందుకు, ఎటువంటి పదవీ లేని ఇంద్రక్క సామాజిక స్పృహతో... 'చేయూత' సంస్థ నెలకొల్పి, అభయహస్తం అందిస్తు న్నారు. ఇక్కడుండే వీధి పిల్లలంతా ఈ అవ కాశాన్ని ఉపయోగించుకోవాలని, జీవితంలో ముందుకు రావాలని ఆశిస్తున్నారు"

చప్పట్లు కొట్టారు చుట్టూ జనం.

ఇంద్రక్క అభివాదం చేసి పై మాటల్నే మాట్లాడుతుంటే స్టేషన్లో ప్యాసింజర్లు వింతగా చూస్తూ నిలబడ్డారు.

పది నిమిషాల తర్వాత ఇంద్రక్క కెమెరా లకి ఫోజులిచ్చి వీధి బాలలను దగ్గరకు తీసు కుని ఫొటోలు దిగి, చెయ్యూపుతూ వెళ్ళిపో యింది.

* * *

తిరుపతి బస్టాండు దాటి రెండు కిలోమీ టర్లు లోపలికెళ్ళాక ఓ విశాలమైన ప్రదేశంలో "చేయూత" స్వచ్ఛంద సంస్థ ఉంది. పిల్లల్ని దర్నీ అక్కడికి తీసుకెళ్ళి నిబంధనలు చెప్పారు. పిల్లలకి స్వేచ్ఛ ఉంది. ఉదయం అటెండెన్సు ఇవ్వాలి. పగలంతా ఎక్కడ తిరిగి, తిన్నా, రాత్రికి మాత్రం వచ్చి పడుకో వాలి. ఆదివారం మోటివేషన్ క్లాసులు, హెల్త్ చెకప్, అక్కడే భోజనం, టాలెంట్ షో, సాయంత్రం టి.వి.లో సినిమాలు పిల్లలపై సూపర్‌వైజర్స్.. కాపలా వ్యక్తులు ఉంటారు.

సూపర్‌వైజర్స్ నపుంసకుల్లా ఉన్నారు.

అదే మాట శీను జాన్సన్‌తో చెప్పాడు.

వెంకటేశు శీను జాన్సన్‌లని పక్కకి పిలిచి,

- "ఈ నాయాళ్ళ సంగతి నాకు తెల్సు. ఈ సూపర్‌వైజర్లు కొజ్జానాయాళ్ళు. రాత్రిళ్ళు పిల్లల్ని ఏదేదో చేస్తా వుంటారు. అందుకే ఈడికి ఎవరూ రావటంలేదు. పెద్దన్నకి నే జెప్తగానీ... ముందీ కొజ్జానాయాళ్ళకి దొర క్కుండా పారిపోదాం" అన్నాడు.

వెంకటేశు సాయంతో శీను, జాన్సన్ బయ టపడ్డారు.

ఏడెనిమిది గంటల బందిఖానా నుంచి స్వేచ్ఛ పొందిన విహంగాల్లా పరుగెత్తి, పరు



## మీకు చేస్తే అందరికీ చేసినట్లే

ఒకసారి బాపూజీకి హఠాత్తుగా సుస్తీ చేసింది. కలకత్తా నుంచి డాక్టర్ బి.సి. రాయ్‌ను హుటాహుటిన పిలిపించారు. రాయ్ పరీక్ష చేసిన తర్వాత మహాత్ముడిలా అన్నారు.

"నాకు వైద్యం చెయ్యడానికి నువ్వు కలకత్తా నుంచి వచ్చావు కదూ? అయితే నువ్వు మనదేశంలోని కోట్లాది ప్రజలకు ఉచితంగానే వైద్యం చేస్తావా, నాకు చేస్తున్నట్లుగానే"

"నేనిలా ఇంకెవ్వరికీ ఉచితంగా వైద్యం చెయ్యను. నేను వచ్చింది కోట్లాది భారత ప్రజలకు ప్రతినిధి అయిన గాంధీజీకి వైద్యం చెయ్యడం కోసం. ఇది కోట్లాది ప్రజలకు వైద్యం చెయ్యడంతో సమానమే!" అన్నాడు డాక్టర్ రాయ్. బాపూజీ నవ్వుతూ అతడి భుజాన్ని తట్టారు.

గెత్తి రైల్వేస్టేషన్‌కి చేరుకున్నారు.

స్టేషన్‌ని చూడగానే ఆదరించే అమ్మ ఒడిలా ఫీలయ్యారు.

రెండో నంబరుకి ప్యాసింజరు వస్తోందన్న అనౌన్సుమెంటు విని గబగబా పరుగెత్తారు.

ఇద్దరికీ కూలి దొరికింది.

"శీనూ ఆకలిగా ఉంది. రా! బయటికెళ్లి తిందాం"

"నాకూ ఆకలవుతా వుంది. ఏడికి బోదాం"

"రా! నేను తీస్కబోతగా!" అని ముందుకి కదిలాడు జాన్సన్.

బస్టాండుకి, రైల్వేస్టేషన్‌కి మధ్యలో ఉన్న ఓ వీధిలో ఉంది సీతమ్మ హోటల్.

చూస్తే అది హోటల్లా కన్పించదు. ఇంటి ముందు నీడకోసం వేసుకున్న రెండు రేకులు, దాని కింద బెంచీ మీద పెద్ద పెద్ద గిన్నెల్లో ఆహార పదార్థాలుంటాయి. అరుగు మీద ఓ ముసలమ్మ కూచుంది. ఆవిడే సీతమ్మ.

ఎప్పుడు, ఏ ఊర్నుంచి తిరుపతి వచ్చిందో తెలియదు గానీ దక్షిణ రాష్ట్రాల భాషలన్నిటితోబాటు హిందీ అనర్గళంగా మాట్లాడుతుంది.

శీను, జాన్సన్‌లు అక్కడికొచ్చేసరికి చాలా మంది క్యూల్లో నుంచున్నారు. వాళ్లంతా అనాథలు, కూలి చేసుకునే వాళ్లు, వీధి పిల్లలు, బిచ్చగాళ్లలా కన్పిస్తున్నారు.

సీతమ్మ ముందు ఓ డబ్బా ఉంది. అన్నం, సాంబారు తీసుకుని, రెండ్రూపాయలు ఆ డబ్బాలో వేసెళ్తున్నారు.

మాజీ ముఖ్యమంత్రి రెండ్రూపాయల కిలో బియ్యం పథకం ఇప్పటి ప్రభుత్వాలకి గుర్తుందో లేదో గానీ సీతమ్మ మాత్రం ఆ ప్రేరణతో తనవంతు సాయంగా "రూపాయికి భోజనం" పథకం మొదలెట్టింది. అన్నం, సాంబారు గానీ, పప్పు గానీ పెడ్తుంది. తన ఆస్తిలో కొంత భాగం ఈ హోటల్ ఆగకుండా... ఉండేందుకు ఖర్చు పెడ్తోంది. ఉదయం 10 గం॥ నుంచి 12 గం॥ వరకు, సాయంత్రం 6 గం॥ నుండి రాత్రి 9 గం॥ వరకు అన్నం పెడ్తుంది. ఎవర్నీ డబ్బులిమ్మని అడగదు.

# చతుర భాషితాలు

ఎలా నేర్చుకోవాలో తెలుసుకున్న వారే బాగా జ్ఞానవంతులవుతారు.

**-ఆడమ్స్ హెన్రీ**

కొన్నింటిని మరచిపోయి, కొన్నింటిని సరదాగా తీసుకోవడంలోనే సుఖశాంతులున్నాయి.

**-కార్మరి**

వర్షధారనిచ్చే మేఘం ఏమీ ఆశించదు. అటువంటిదే దాతృత్వం.

**-తిరుక్కురళ్**

శ్రమించు, అన్వేషించు, గ్రహించు. కానీ లోబడకు.

**-టెన్నిసన్**

ఒక మనిషి సుఖపడేందుకు అవసరమయిన లక్షణం అతడు తనకుతాను మానసికంగా విధేయుడై ఉండడమే.

**-థామస్ పెయినే**

శక్తి అన్నింటిని జయిస్తుంది. కానీ ఆ విజయాలు కొద్ది కాలం మాత్రమే ఉంటాయి.

**-అబ్రహం లింకన్**

భవిష్యత్తు గురించిన ఇబ్బంది ఏమిటంటే దాని కోసం మనం సిద్ధపడే లోగానే అది వచ్చేస్తుంది.

**-సాధి**

ఎంత మంచి పనయినా కాస్తంత శ్రమ లోపించడం వల్ల విఫలమవుతుంది.

**-హారిమన్**

గొప్పతనమెప్పుడూ నిరాడంబరతను పోలి ఉంటుంది. ఈ రెండిటి మధ్యగల భేదం అతిస్వల్పం.

**-ఎమర్సన్**

నింద వేయడం అబద్ధం చెప్పడం కంటే ఘోరం. అది అబద్ధాన్ని దాచే బురఖా.

**-పోప్**

సత్యం కోసం సకలం త్యాగం చేయవచ్చు. కానీ సత్యాన్ని దేని కోసమూ త్యాగం చేయగూడదు.

**-స్వామి వివేకానంద**

ఆదర్శాలు లేని మనిషి ఒక విషాద దృశ్యం వంటి వాడు.

**-ఇవాన్ తుర్గినోవ్**

వయసు మళ్ళిన వారివి వెనుకటి గాధలు. వయసులో ఉన్న వారివి ముందున్న స్వప్నాలు.

**-స్మిత్**

అలాగని ఎవరూ డబ్బులివ్వకుండా వెళ్లరు.

సీతమ్మ రూపంలో ఉన్న అన్నపూర్ణమ్మ తల్లివని అందరూ అంటుంటే చిద్విలాసంగా నవ్వుతూ ఆర్తులకి ఆకలి తీరుస్తోంది పాతికేళ్లుగా...

శీను, జాన్సన్... చెరో రెండ్రూపాయలు... డబ్బాలో వేసి అన్నం పొట్లం తీసుకున్నారు.

ప్లాట్‌ఫారం మీదికొచ్చి బెంచీ మీద కూచుని తింటుంటే, వెంకటేశు వచ్చాడు.

"రా! నువ్వూ తిను" అని శీను అనేసరికి, చెయ్యి చొక్కాకి తుడుచుకుని చెయ్యిజాపాడు.

శీను పెట్టిన ముద్ద తింటూ "సీతమ్మ తల్లి దగ్గర తెచ్చారా? " అన్నాడు. "అవును గానీ, ఎందుకాణ్ణుంచి వచ్చెయ్యమంటివి? ఆడ ఏం జేస్తారు" అడిగాడు శీను.

"అమ్మో! ఆడ ఇరుక్కున్నామంటే ఆ నాయాళ్ళు బయటికి రానీరు. సంచులు చేతికిచ్చి ఇళ్లమ్మట బోయి అడుక్కురమ్మంటరు. సంచీ మీద "చేయూత" అని రాసుంటది. రాత్రికి అన్నం బెడ్తరు. ఆణ్ణే పడుకోవాలి. ఆడ ఇద్దరు కొజ్జాగాళ్లు సూపర్‌వైజర్లు. ఓసారెళ్ళి రాత్రిపూట పడుకున్న. ఆ కొజ్జాగాళ్లు రాత్రి నా దగ్గరకొచ్చి ఏదేదో చెయ్యబోతంటే...అరిసి,కేకలు బెట్టి తెల్లారతానే వచ్చేసిన"

"ఏదేదో అంటే? "

వివరంగా చెప్పాడు వెంకటేశు. అదివిని "ఔను రాజుని కూడా అట్లనే జేసినారంట" అన్నాడు జాన్సన్.

"ఆళ్ళకి అందరం గల్సి బుద్ధి జెప్పాల" అన్నాడు శీను.

"అయ్యన్నీ ఏం జరగవు. రాత్రిళ్ళు ఆడికి ఆటోల్లో అమ్మాయిలు గూడా వస్తుంటరు... అయ్యన్నీ మనకెందుకులే" అని వెంకటేశు వెళ్ళిపోయాడు.

మర్నాడుదయం... అలవాటు ప్రకారం రెండో నంబర్లో ఉండే చిత్తూరు ప్యాసింజరు కొచ్చే నారాయణని కలవడానికెళ్లాడు శీను. అతడు ఎక్కడా కన్పించలేదు. శీనుకి నారాయణలో ఉన్న ఆత్మస్థైర్యం, కష్టపడే తత్వం బాగా నచ్చాయి. నారాయణ దగ్గరకి ప్రతి రోజూ వెళ్లి పలకరిస్తుంటాడు. కానీ నారాయణ చాలా తక్కువగా మాట్లాడతాడని గ్రహించాడు. అతని ధ్యాసంతా చేసే పని మీదే.

ఆలోచిస్తూ కంపార్టుమెంట్లు చూస్తూ నడుస్తున్న శీనుకి "శీనూ" నారాయణ గొంతు విన్పించింది.

"అన్నా!" అని వెనక్కి తిరిగాడు.

బెంచీ మీద కూచున్న నారాయణ నీరసంగా కన్పించాడు.

"ఏమైనాదన్నా? ఒంట్లో బాగులేదా? "

"రేత్తిరి నుండి జొరం. వొళ్ళంతా నెప్పులు. కదల్లేకుండా ఉంటిని. నేను ఇయ్యన్నీ అమ్మకబోతే మా నాయనకి, అమ్మకీ అన్నం ఉండదు. నాచేత గావటం లేదు. ఈటన్నిటినీ రైల్లో అమ్మి సాయం జేసి పెడ్తవా? డబ్బులిస్త" అన్నాడు.

"అట్లనే అన్నా. రేట్లు..."

"చెప్త" అని శీనుకి రేట్లు చెప్పాడు.

"మాత్రేమైనా ఏస్కున్నావా? అన్నా!"

"లేదురా! ఆస్పత్రికిబొయ్యే ఓపిక లేదు"

నారాయణ రెక్కాడితే గానీ... ఇంట్లో అనారోగ్యపు వృద్ధ తల్లిదండ్రుల డొక్కాడని పరిస్థితి.

శీను గబగబా రైలు పెట్టెలన్నీ తిరిగి, ఏభై రూపాయలకి అమ్ముకొచ్చేసరికి నారాయణ బెంచీ మీద మూల్గుతూ, కళ్లు మూసుకుని పడుకున్నాడు. శీను అతని పరిస్థితి చూసి వేగంగా ఒకటో నంబరుకెళ్లి కన్పించిన మిత్రుల్ని పిలుచుకొచ్చాడు. అందరూ కలిసి నారాయణని గవర్నమెంటాసుపత్రికి తీసుకెళ్లారు.

డాక్టరు పరీక్షించి నారాయణకి "గన్యా" జొరమని మాత్రలిచ్చాడు.

పిల్లలంతా కల్సి నారాయణని ఆటోలో తీసుకెళ్ళి అతడింట్లో దింపారు. తమ కొడుకుని ఆటోలో తీసుకురావడం చూసి భయపడుతున్న వృద్ధ తల్లిదండ్రులతో....

"భయం లేదు. అన్నకి జొరం... ఈ మాత్ర లెయ్యండి" అని చెప్పారు.

"శీనూ! సమయానికి సాయం చేసినావురా! థ్యాంక్స్" అన్నాడు నారాయణ.

"బలే వోడివన్నా, ఇందల ఏముండాది? " అన్నాడు శీను.

నారాయణకి జ్వరం తగ్గే వరకు శీను, జాన్సన్ వెళ్ళి, పెన్నులు, పెన్సిళ్ళు అమ్మి, నారాయణ, సంపాదన కుంటుపడకుండా ఆదుకున్నారు.




సాయంత్రం కూలికి పెట్టెలు మోస్తూ స్టేషను బయటి కొచ్చిన శీనుకి, రాంప్రసాద్ కన్పించాడు. నడిచెళ్తున్న అతనికి పక్కగా వెళ్ళి...

"సార్" అని పిల్చాడు.

"అరె! నువ్వా! నాతో మా ఊరొస్తవా? చదివిస్త"

"అందుకే సార్, మిమ్మల్ని జూసి వచ్చి నాను"

"వెరీ గుడ్. నువ్వు వస్తావని నాకు తెల్సు. రేపొద్దున 9 గం.లకి సప్తగిరి రైలు దగ్గర ఎస్4 కోచ్ దగ్గరుంటా.. వచ్చెయ్... తీస్క బోయి చదివిస్త. చదువుకుందువుగాని"

చదువు అనే మాట శీను చెవులకి వేద మంత్రంలా విన్పించింది.

"రేపు రైలు దగ్గర కలుస్త సార్" అన్నాడు మెరిసే కళ్ళతో...

శీను పరుగెత్తుకుంటూ స్టేషన్లోకి వచ్చాడు. జాన్సన్ కన్పించలేదు. ప్లాట్‌ఫారంమీద కూచున్న ప్యాసింజరుకి బూట్ పాలిష్ చేస్తూ రాహుల్ కన్పించాడు.

దగ్గరకెళ్ళి "రాహుల్! రాహుల్!!" అన్నాడు.

"క్యా హువా శీనూ" రాహుల్ తల పైకెత్తి అన్నాడు .

"జాన్సన్‌ని చూశావా? "

"నై" అని మళ్లీ పాలిష్ చెయ్యటంలో నిమగ్నమయ్యాడు. వీడికి అటాచ్‌మెంటస్సలు లేనే లేదు... అనుకుంటూ మళ్ళీ స్టేషన్ బయటికి వచ్చాడు.

ఎదురుగా ఉన్న టీకొట్టు దగ్గర రాజు, జాన్సన్ కన్పించారు. శీనుని చూసిన రాజు పిల్చాడు.

"రా! టీ తాగు" అన్నాడు జాన్సన్.

"నువ్వేంటి పన్లోకి పోలేదా? "

"నీ కోసం స్టేషనంతా ఎతకొస్తావుండాను" అన్నాడు జాన్సన్‌తో.

"రాజు పిలిస్తే వచ్చినాను"

"నేను రేపు ఊరెళ్తన్నాను"

"మీ ఇంటికా? "

"కాదు. మొన్న చెప్పినానే... ఒకాయన నన్ను వాళ్ల ఊరు తీసుకెళ్ళి స్కూల్లో చేర్పిస్తా నన్నాడని. ఆయన కన్పించినాడు. రేపు తొమ్మిది గంటలకి సప్తగిరి రైలు దగ్గర కలుస్తానన్నాడు"

"నిజంగా ఎళ్తున్నావా? !!"

"అవును. నేను చదువుకోవాల. చదువు లేకుండా ఉండలేను"

"ఆయనెవురో నీకు తెలీకుండా నమ్మి ఎలా ఎళ్తావు? "

"మీరెవురో తెలీకుండా మీ అందరి దగ్గర ఉండటంలా, అట్లనే"

రాజు, జాన్సన్‌లిద్దరూ ఆ మాటలతో సైలెంటైపోయారు.

"మనోళ్లందర్నీ కలవాలి. నారాయణ ఇంటికి పోయి రావాలి? రా! పోదాం" అన్నాడు శీను.

ముగ్గురూ కలిసి నారాయణింటికి బయల్దేరారు. మధ్యలో మల్లేషు, వీరిగాడు కలిశారు.

"ఏరా రాజూ, పనికి పోలేదా? " అడిగాడు

వీరిగాడు.

లేదన్నా. రమేషు, ఎంకటేశూ ఏడికి బోయినా రన్నా? "

"ఇందాక ఒకట్లో జూసిన. మళ్లీ అవుప డ్లేదు"

"అన్నా! శీను ఎల్లిపోతండు. ఎవరో ఒకా యన చదివిస్తానని ఊరికి తీస్కబోతనన్న డంట. రేపు ఎళ్తనన్నడు"

"మీ అమ్మా నాయన వచ్చిండ్రా" అడిగాడు మల్లేశు.

"లేదు" అని రాంప్రసాదుని కల్సుకున్న సంగతి చెప్పాడు శీను.

"ఆయన్దే ఊరో... మంచోడో కాదో తెలీకుండ ఎలాగెళ్తావు? " అన్నాడు వీరిగాడు.

"అక్కడ బాగుంటే ఉంట. లేకుంటే వచ్చేస్త"

"ఏంటోరా, మంచిగ పది దినాల్లో అలవా టయినవు. చదువుకున్నోడివి. నువ్వెల్లిపోతా నంటే ఏంటోగున్నది" అన్నాడు వీరిగాడు.

అప్పుడే అక్కడికి వచ్చిన రాహుల్, "పాలిష్... పాలిష్" అన్నాడు చేతిలో బ్రష్షులు శబ్దం చేస్తూ, వీరిగాడు, మల్లేశంల కాళ్ళవైపు చూస్తూ.

"ఏందిబే... తిమ్మిరెక్కువైందా? "

"నై భయ్.. తమాషా" అన్నాడు రాహుల్ భయం నటిస్తూ...

"చూడు... రేపు శీను ఎల్లిపోతన్నాడు" చెప్పాడు జాన్సన్.

"కిదర్"

"చదువుకోవడానికి..." చేతులతో యాక్షన్ చేసి చూపించాడు రాజు.

"అచ్ఛా కామ్... బేస్... ఆప్.. లక్" నార్తిండియన్ శ్లాంగ్‌లో చెప్పి, చెయ్యందించి, "ఆc పాలిష్... పాలిష్" అంటూ వెళ్ళిపో యాడు.

అందరూ కల్లి నారాయణ ఇంటికెళ్ళారు. విషయం విని...

"మంచి పనిరా! నేనూ ఎంతోమంది పిల్ల కాయల్ని చూస్తా ఉండాను.. రాత్రిపూట చదువు జెప్త రమ్మంటే ఎవ్వడు రాకపో తుండె. చదుకుంటానన్నోడివి నువ్వొక్కడివే, బాగా చదువుకో" అని తన సంచిలోంచి రెండు పెన్నులు తీసి శీను కిచ్చాడు.

అందరూ స్టేషన్ కొచ్చేసరికి చీకటి పడింది. అంతా కల్సి చాయ్ తాగారు.

"శీనూ! మమ్మల్ని మర్చిపోతావా? ఎప్పు డైనా వస్తావా? "

"ఎందుకు రానూ! తప్పకుండా వస్తా!"

"మీ అమ్మా నాన్నలొచ్చి అడిగితే... ఏం జెప్పాల్రా"

"చదుకోడానికి బోయిండని చెప్పు"

"అరే! నీ చదువు పిచ్చి జూస్తె నాక్కూడా చదువుకోవాలన్పిస్తోందిరా!" అన్నాడు మల్లేశు.

అంతే! ఆ మాట శీను మైండులో రిజిస్టర యింది. ఏదో కొత్త ఆలోచన. అది వయసుకి మించిందే అయినా మంచి ఆలోచన.

"శీనుకి ఎవరో దేవుడిలా కన్పించాడు. మన కోసం ఏ దేవుడొస్తాడ్రా" అన్నాడొకలా రమేషు.

అవకాశం ఉంటే చదువుకోవాలన్న తపన వాళ్ళందరిలో ఉన్నట్లు శీను గమనించాడు.

ఆ రాత్రి అందరూ కల్సి స్టేషన్ ముందు న్న హోటల్లో తిన్నారు. కోనేరు మెట్లమీద కూచుని కబుర్లు చెప్పుకుంటుంటే పెద్దన్న, బద్రిగాడు, శంకర్ దాదా, వినోద్ అటెళ్తూ వీళ్ళని చూశారు. పిల్లలంతా భయంగా లేచి నుంచున్నారు.

"ఏరా! ఏం జేస్తున్నారు ఇక్కడ? "

"ఏం లేదన్నా! రెండులోకి శేషాద్రి రావడా నికి టైముందింకా, అందుకే ఇక్కడ ఊరికినే కూచున్నం" వెంకటేశు చెప్పాడు.

"రా!రా! లేటవుతాండిది" దాదా పెద్దన్నని తొందర చేశాడు.

"ఒరేయ్! అంతా డబ్బులు రేపు ఇయ్యాల గుర్తుందా? ? " వెళ్తూ గుర్తుజేశాడు పెద్దన్న.

ఆ రాత్రి పడుకున్న శీనుకి జాన్సన్ అన్న మాటలు, రాహుల్ చెప్పిన మాటలు, మల్లే శుకి చదువుపై మమకారం...రమేష్ బాధ... చెవుల్లో పదేపదే మార్మోగుతున్నాయి.

"శీనూ! నువ్వైనా మంచిగా చదుకోరా! మంచి డాక్టరై నాలాంటి రోగం ఉన్నోళ్ళకి సాయం జెయ్యాలి" అన్నాడు జాన్సన్.

"ఆయా సో మోఖా నై గమాన.. ఔర్ కభీ పీఛే పలట్‌కే నై దేఖ్‌నా..." వచ్చిన అవకాశాన్ని వదులుకోకు... జీవితంలో వెనక్కి తిరిగి చూడకు అనే భావం వచ్చేట్టు రాహుల్ హిందీలో అన్నాడు.

"నన్ను మర్చిపోమాక. ఇన్నాళ్ళలో నీతో దోస్త్ కుదిరినంతగా ఎవుర్తోనూ కలవలేదు. ప్రభువుకి నా మీద దయ లేదు. మంచి దోస్తునిచ్చి వెంటనే లాక్కుపోతుండు" అని కన్నీళ్ళు జలజలా రాల్చాడు జాన్సన్.

ఇంట్లో నుండి బయటపడి, స్టేషన్‌కి వచ్చినపుడు 'తనకి ఎవరూ లేని ఒంటరివాణ్ణి' అని అనుకున్నాడు. తిరుపతి స్టేషన్లో దిగగానే ప్రపంచం చాలా విశాలంగా ఉందన్పించింది. వీరిగాడు, వెంకటేశు బెదిరించి, తరిమెయ్యగానే... ఇల్లొదిలొచ్చి తప్పుచేశానని బాధ కల్గింది. పిచ్చిదాన్ని చూడగానే ఆమె కంటే తనెంతో నయం అన్పించింది. ఓర్పు నేర్పు ఉంటే ప్రతి విషయం, ప్రతి సంఘటన ఓ పాఠం నేర్పుతుందని ఇన్ని రోజుల్లో అనుభవపూర్వకంగా నేర్చుకున్న శీనుకి, ఇప్పుడు తన చుట్టూ ఉన్న వీరందర్నీ వదిలెళ్ళటం కష్టంగానే ఉంది, ఇపుడు ఆలోచిస్తున్నకొద్దీ.

ప్రపంచం ఎంతో విశాలంగానూ, అందంగానూ కన్పించసాగింది. ఈ అందాలు, అనుబంధాలు బతికుండాలంటే మనిషి చేతిలో డబ్బుండాలి. డబ్బు రావాలంటే చదువుకోవాలి. ఆ చదువే తనకిప్పుడు కావాల్సింది.

ఆలోచిస్తూండగానే అర్ధరాత్రి దాటింది. కళ్ల మీదికి నిద్ర రావటంతో కనురెప్పలు భారంగా మూతపడ్డాయి.

## ఆమె సబలట!

పురుషుల కంటే స్త్రీ బలవంతురాలా!? ఈ ప్రశ్నకు సమాధానం అవునట. అయ్యో మరీ అంతలా హాశ్చర్యపోకండి. ఆ సబలత్వం శారీరకంగా కాదు... మానసికంగానట.

పురుషులకి అనారోగ్యం వస్తే చిన్న పిల్లల్లా ప్రవర్తిస్తారు. మహిళలు అలా కాకుండా నిబ్బరంగా ఉంటారట. మిచ్‌గాన్ యూనివర్సిటీ శాస్త్రజ్ఞులు పరిశోధనలు జరిపి ఈ విషయాన్ని నిర్ధారించారు.

స్త్రీలకి గుండెజబ్బులు వస్తే వాళ్ళు విషయాన్ని చాలా తేలికగా తీసుకుని ఎవరి సహాయాన్ని కోరటం లేదట. అంతే కాదు, గుండెనొప్పి వచ్చాక కూడ ఆరోగ్యాన్ని అశ్రద్ధ చేస్తున్నారట. పురుషులు మాత్రం అలా కాదట. ఈ పరిస్థితి ఎందుకో అని పరిశోధనలు జరుపగా స్త్రీలు వ్యాధుల్ని తీవ్రంగా పరిగణించకుండా, జీవితంలో ఇదీ ఒక భాగమే అన్నట్టుగా ప్రవర్తిస్తున్నట్లు తెలిందట స్టీవెన్ ఎరిక్‌సన్ అనే ఆయన తన బృందంతో 348 మంది పురుషుల్ని 142 మంది స్త్రీలను పరిశీలించారు. మగవాళ్ళ కంటే ఆడవాళ్ళలో గుండె జబ్బుల తీవ్రత ఎక్కువగా ఉండి మందులు వాడేవారి శాతం ఎక్కువగా ఉన్నా, వాళ్ళు పురుషుల్లా బెంబేలు పడకుండా తమ దినచర్యల్ని కొనసాగిస్తున్నారట.



స్త్రీ హృదయం లోతైనదంటారని విన్నాం గానీ నిబ్బరం కూడ ఎక్కువేనని ఇప్పుడు తెలింది.

మరుసటిరోజు ఉదయం. పిల్లలంతా తమ తమ పనుల్లో బిజీ అయ్యారు.

ఎనిమిది గంటలకి అంతా ఒకటో నంబరు ప్లాట్‌ఫారానికొచ్చారు.

"శీనూ! నీళ్ళు పోసుకుని రారా! చదూకో డానికెళ్తన్నావు. ఈ మురికి బట్టలు తీసెయ్. నా దెగ్గర ఒక మంచి జతుంది. ఉతికి, ఇస్త్రీ జేయించినాను... ఇదుగో" అని కవర్లోంచి తీసిచ్చాడు రాజు.

శీనుకి ఏం మాట్లాడాలో తెలీలేదు.

"థ్యాంక్స్" అన్నాడు.

శీను నీళ్ళు పోసుకొచ్చేసరికి, ఎదురుగా వీరిగాడు, వెంకటేశు, మల్లేశ్, రాహుల్, జాన్సన్, బద్రిగాడు... బస్టాండ్లో ఉండే నాగు, కోటిగాడు వచ్చారు.

అందరూ కల్సి తిన్నారు.

తొమ్మిదిన్నరకు సప్తగిరి ఎక్స్‌ప్రెస్ ఒకటో నంబరు ప్లాట్‌ఫారం మీదికొచ్చింది.

చెప్పినట్టుగానే ఎస్-4 కోచ్ దగ్గర రాంప్రసాద్ కన్పించాడు.

"అడుగో ఆయనే..." చూపించాడు శీను.

ఆయన్ని చూస్తూనే వీరిగాడు, "ఈయనా! ఓ సారి నన్నూ రమ్మన్నాడు. చదువేడొస్తది... నేనే వెళ్ళలేదు" అన్నాడు.

"సార్! గుడ్మార్నింగ్" శీను, రాంప్రసాద్‌ని విష్ చేసేసరికి అతడు తల తిప్పి చూసి "అరే! నువ్వా! గుడ్మార్నింగ్.. నీ కోసమే చూస్తున్నా. ఉండిక్కడే నీకు టిక్కెట్టు దెస్త" అనెళ్ళాడు. పది నిమిషాల తర్వాత జాన్సన్ బరువుగా ఉన్న కవరును రైలెక్కిన శీనుకి అందించాడు.

"ఏంటిది? "

"తర్వాత చూడు"

"ఆప్యాయత, అనురాగాలు నువ్వెక్కడుంటే అక్కడే ఉంటాయి" అన్పించింది శీనుకి.

పిల్లలంతా కిటికీ పక్కన, కూచున్న శీనుకి చెయ్యూపి వీడ్కోలు చెప్తుంటే జాన్సన్, రాజు మాత్రం విషాదంగా 'టాటా'చెప్పారు.

గ్రీన్ సిగ్నల్ పడ్డది. రైలు కాలానుగుణంగా ముందుక్కదిలింది. రైల్లో కూచున్న శీను మనసులో వెళ్ళబోయేచోట ఏం జరుగుతుందోనన్న భయం. స్కూలెలా ఉంటుందో నన్న ఉత్కంఠ, ఉత్సుకత అధికం కాసాగాయి.




"గౌరమ్మా! గౌరీ!!!" అంటూ మధ్యాహ్నం ఇంటికొచ్చాడు సాంబయ్య.

ఇంటికి తాళం వేసి ఉంది.

పక్కంటికెళ్ళి అడిగాడు.

"తిప్పన్ననాయుడు పొలంలోకి చెనిక్కాయలు తీయటానికి బోయిందన్నా" అని చెప్పారు.

సాంబయ్య పరుగెత్తినట్టు బయల్దేరాడు.

తిప్పన్న నాయుడి పొలం దగ్గరకెళ్ళి అక్కడ పని చేస్తున్న వాళ్లలో భార్య కోసం చూస్తుంటే.

"గౌరమ్మ! చూడవే! మీ ఆయనొచ్చినాడు" పక్కనున్న శాంతమ్మ చెప్పేసరికి ఆశ్చర్యంగా చూసి, కొడుకేమైనా వొచ్చాడేమోనని ఆతృతగా ఎదురెళ్ళింది.

"ఏంటయ్యా! శీనేమైనా వచ్చినాడా? "

"లేదే! ఇద్దరం గల్సి రేప్పొద్దున తిరపతికి బోయి ఎతుకుదాం. ఆణ్ణే ఉంటడని అందరూ జెప్తున్నరు. తొందరగా ఇంటికొచ్చెయ్" అని చెప్పి వెళ్లాడు.

ఈ మధ్యకాలంలో సాంబయ్య ఇంత సౌమ్యంగా మాట్లాడేసరికి గౌరమ్మకి ఆశ్చర్యం, కొడుకుని వెదకబోదామనేసరికి ఆనందం.. ఒకేసారి కలగటంతో కళ్ళొంట నీళ్ళు కారాయి.

* * *

శీను వెళ్ళిపోయాక పిల్లలంతా ఎటు వాళ్ళు అటెళ్ళిపోయారు. జాన్సన్ మాత్రం ఒంటరిగా బెంచీమీద మోకాళ్ళ మీద తల పెట్టుక్కూచున్నాడు.

ఓ గంటాగి సూరి అక్కడికొచ్చాడు.

"ఏంట్రా!ఇంకా ఈణ్ణే కూచుంటివా? "

"నాకు బాగో లేదురా!"

"శీను కోసం ఆలోచిస్తా కూచుంటే, మనకి అన్నం ఎవరు బెడ్తారు. రా! పోదాం"

"నేనివాళ రాను... నువ్వెళ్ళు"

సూరి వెళ్ళిపోయాడు.

ఆలోచిస్తున్న జాన్సన్‌కి చాలా రోజుల తర్వాత తల్లీ తండ్రీ చెల్లీ గుర్తొచ్చారు. తండ్రినెందుకు నరికి చంపారో తనకి తెలీదు. అమ్మెక్కడుందో, చెల్లెలు ఎలా ఉందో, ఎవరి దగ్గరుందో ఇన్ని ప్రశ్నలకి తన దగ్గర జవాబులు లేవు. ఆలోచనల్తో మనసంతా మొద్దుబారింది. బద్రి, పెద్దన్నల గొంతు విని తలెత్తి చూశాడు.

"ఏంట్రా! ఈణ్ణే కూచున్నావు? రెండులో రైలుంది పోలా? " బద్రిగాడు అడిగాడు.

"లేదన్నా! జొరంగా ఉంటే ఈణ్ణే ఉన్నా"

"ఈడికెపుడూ రోగాలే, నకరాలు బోకుండా ముందు రైలు దగ్గరకి పోరా" కోపంగా అన్నాడు పెద్దన్న.

"ఎళ్తన్నా!" అని పరుగెత్తుకుంటూ రెండులోకొచ్చాడు. పెద్దన్న బారినుండి తప్పించుకున్నానని అనుకుంటూ వస్తుంటే బ్రిడ్జి కింద కూచుని ఏదో తింటున్న కోటిగాడు కన్పించాడు.

"ఏంట్రా! ఈడున్నావు బస్టాండుకి పోలే!" అనడిగాడు.

"పోవాల..తిను..." అని చపాతి ఇచ్చాడు.

"కొన్నావా? "

"రైల్లో ఒకామె ఇచ్చింది"

"అరేయ్! జాన్సన్! ఒకట్లోకి ముంబాయి రైలొస్తాంది రా!" అని అటువైపు నుండి పిల్చాడు వెంకటేశు. జాన్సన్ గబగబా తిని, పట్టాలు దాటి ఒకట్లోకొచ్చాడు.

ఐదు నిమిషాల్లో ముంబాయి ఎక్స్‌ప్రెస్ ప్లాట్‌ఫారంలోకి వచ్చింది. వెంకటేశు, జాన్సన్‌లు నుంచుని చూస్తున్నారు. రైలింజను వెనకున్న జనరల్ కంపార్ట్‌మెంటు ఎంట్రన్సులో నుంచుని ఎవరో "జాన్సన్" అని పిలిచినట్టనిపించింది.

"ఎవరైయుంటారబ్బా!" అనుకుని ముందుకు పరుగెత్తాడు.

రైలు స్లో అయింది. జాన్సన్ మనుషుల్ని తప్పించుకుని పరుగెత్తుతున్నాడు.

"జాన్సన్" మళ్ళీ అదే గొంతు.

సడన్ బ్రేకేసినట్టు ఆగి, వెనక్కి తిరిగి ఆశ్చర్యంగా చూశాడు.

ఎదురుగా శీను!

అంత జనసమ్మర్ధంలోనూ వేగంగా వెళ్ళి శీనుని కౌగలించుకున్నాడు.

వెనకాలే పరుగెత్తుకుంటూ వచ్చిన వెంకటేశు, కళ్ళు పెద్దవి చేసి ఆశ్చర్యంగా, "ఏంట్రా! శీనూ.. వ...చ్చే.శావు" అన్నాడు.

"మిమ్మల్నందర్నీ ఒదిలి ఒక్కణ్ణే వెళ్ళాలనిపించలేదు" అందుకే పక్క స్టేషన్లో దిగి వచ్చేస్తిని"

"నిజంగానే! మళ్ళీ ఎళ్ళవా? " జాన్సన్ అడిగాడు ఒకింత సందేహంగా.

"నీమీదొట్టు" అన్నాడు బొంగురు గొంతుతో... దుఃఖాన్ని ఆపుకుంటున్నట్లుగా.

ఆ మాటకి ఎగిరి గంతేశాడు జాన్సన్.

"నాకు తెల్సు, నువ్వు మళ్ళీ వస్తానని. శానామంది ఇట్లనే చదివిస్తామని, తీస్కబోయి పన్లు చేయించుకుంటూ, బాధలు పెడ్తారు, కొడ్తారు. ఈడ జూడు మనమే 'రాజులం' అని పక్కకి తిరిగేసరికి పెద్దన్న, బద్రిగాడు కన్పించారు. వెంటనే వెంకటేశు వెళ్ళిపోయాడు. శీను, జాన్సన్ పక్కకి తప్పుకుని బయటికొచ్చారు.

* * *

స్టేషన్లో ఓ పిల్లాడు, తల్లి పక్కన నుంచుని యాపిల్ తింటున్నాడు. తల్లి ఎవర్తోనో మాట్లాడుతోంది.

రమేష్ యాపిల్ తింటున్న పిల్లాణ్ణే చూస్తున్నాడు.

ఆ పిల్లాడు రమేష్ వైపు భయంగా చూసి వాళ్ళమ్మ దగ్గరకెళ్ళి రమేష్‌ని చూపించాడు.

ఆమె రమేష్‌ని చూసి, కొడుకు సగం కొరికి తిన్న యాపిల్ ముక్క తుంచి రమేష్‌కి ఇచ్చింది.

రమేష్ యాపిల్ ముక్కవైపు చూసి, దూరంగా విసిరేశాడు.

"దొంగ వెధవా! తింటావనిస్తే, పారేస్తావా? అందుకేరా మీకీ అనాథ బతుకు" అని రమేష్‌ని పట్టుకోబోతుంటే దూరంగా పరుగెత్తాడు. రమేష్‌ని చూసిన జాన్సన్ "అరేయ్! రమేషూ" అనేసరికి ఆగాడు.

జాన్సన్ పక్కనే ఉన్న శీనుని చూసి ఆశ్చర్యంగా "..వొచ్చేశావా?" అన్నాడు రమేష్.

"అవును..."

"నాకు దెల్సు.. మమ్మల్నొదిలి నువ్వెళ్ళలేవు"

"అద్సరే!.. సాయంత్రం సిన్మాకెళ్తన్నాం వస్తావా?"

"ఏ సిన్మాకి?"

"సుదర్శన్‌లో చిరంజీవి బొమ్మాడ్తాంది..అందరం కల్సిపోదాం"

"ఏంటి అందరం కల్సెళ్దామంటున్నావు?"

"శీను తిరిగొచ్చాడు గదా! అందుకని" అన్నాడు జాన్సన్.

రాత్రి పది గంటలు. సినిమా చూసి శీను, సూరి, జాన్సన్, రమేష్, రాహుల్, వెంకటేశు, మల్లేశు, వీరిగాడు సినిమా కబుర్లు చెప్పుకుంటూ వస్తున్నారు.

"చిరంజీవి అదరగొట్టిండురా, ఏం పాటలు, ఏం స్టెప్పులు" అని వీరాభిమాని వెంకటేశు అంటుంటే..

"ఈ సినిమాలో అవ్వే నచ్చినాయా?" అన్నాడు శీను.

"అందుకే, ఇది పదోసారి"

"వో హాస్పిటల్ సీన్ బహుత్ అచ్ఛా హై!"రాహుల్ అన్నాడు.

"ఎవల్ల దగ్గర ఎంతున్నయ్యో తియ్యండి.. తినెళ్దాం" అన్నాడు మల్లేశు.

అందరూ స్ట్రీట్ లైట్ కింద నుంచుని డబ్బుల్దీసి వీరిగాడికిస్తుంటే వాళ్ళ పక్కన పోలీసు వ్యానొచ్చి ఆగింది.

దిగుతున్న పోలీసుల్ని చూడగానే అందరూ పరుగెత్తారు.

"రేయ్...ఆగండ్రా! దొం..లం..లారా' అంటూ కానిస్టేబుల్ చేతిలో లాఠీ విసిరేశాడు.

ఏం జరుగుతోందో అర్థంగాని శీను... వాళ్ళెందుకు పరుగెత్తుతున్నారో తెలీక నిలబడిపోయాడు. కానిస్టేబుల్ కాలర్ పుచ్చుకున్నాడు.

"శీనూ! తొందరగా వొచ్చెయ్.." అంటూ వెనక్కి తిరిగిన జాన్సన్ కాళ్ళకి పోలీసు విసిరిన లాఠీ వెళ్ళి బలంగా తగలటంతో

అందరూ స్ట్రీట్ లైట్ కింద నుంచుని డబ్బుల్దీసి వీరిగాడికిస్తుంటే వాళ్ళ పక్కన పోలీసు వ్యానొచ్చి ఆగింది. పోలీసుల్ని చూడగానే అందరూ పరుగెత్తారు. రేయ్...ఆగండ్రా! అంటూ కానిస్టేబుల్ చేతిలో లాఠీ విసిరేశాడు



"అమ్మో" అంటూ కింద పడిపోయాడు.

అంతే! ఒక్క ఉదుటున పరుగెత్తిన కానిస్టే బుల్ జాన్సన్‌ని పట్టుకున్నాడు.

జాన్సన్‌ని వ్యాన్ దగ్గరకి లాక్కొచ్చి.. "ఏరా! దొంగ నాయాళ్ళలారా! దొంగతనం చేసి డబ్బులు పంచుకుంటున్నారా! ఎక్కండ్రా" అని శీనుని, జాన్సన్‌ని వ్యాన్‌లోకి నెట్టారు.

"మేం దొంగతనం చెయ్యలేదు.. సిన్మాకి బొయ్యొస్తన్నం" అన్నాడు శీను.

జాన్సన్ కాళ్ళకి లాఠీ బలంగా తగలటంతో చర్మం చిట్లి రక్తం కారుతోంది.

"చేశారో, లేదో స్టేషన్లో తేలుస్తాం రండ్రా!" అని శీను చెంప మీద లాగి కొట్టాడు.

స్టేషన్లో బాన పొట్టతో ఉండి గుట్కా నములుతున్న ఎస్సై వాళ్లని చూసి "ఈళ్ళేనా.. ఆదొం.. లం...?" అనడిగాడు.

"ఇంకో నల్గురున్నారు సార్... పారిపొయ్యారు"

"ముందీళ్ళని సెల్లో ఏసి, మిగిలినోళ్ళ కోసం ఎతకండి" అని మరో కానిస్టేబుల్ వేపు తిరిగి "రెడీయా?" అన్నాడు.

"అన్నీ రెడీ సార్! మీదే లేటు"

"ఏట్టయ్యా! లే! నువ్వూ రా!"

"శనివారం సార్! విజిటేరియన్... హి... హి..." అన్నాడు హెడ్ కానిస్టేబుల్. గార పట్టిన పళ్లికిలిస్తూ...

"మాకు మాత్రం శనివారం గాదా! పద పద" అనేసరికి లేచి క్యాలండర్ చూపుతున్న శనివారాన్ని, అక్కడున్న టవల్‌తో మూసేసి లేచాడు.

కానిస్టేబుల్ శీనుని, జాన్సన్‌ని బలంగా సెల్‌లోకి నెట్టి...

"ఏరా! నిజం చెప్పండి! లేకపోతే ఎస్సై మందేసుకొచ్చాడంటే, చావగొట్టి చెప్పిస్తాడు."

"మాకేం తెలీదన్నా! సిన్మాకి బోయి వస్తన్నం. ఇయిగో టిక్కెట్లు" అని జేబులో ఉన్న టిక్కెట్టు ముక్కలు చూపించాడు జాన్సన్.

"సిన్మా హాలు దగ్గర ఏరుకొచ్చి మా చెవుల్లో పువ్వులు పెడితే నమ్మడానికి పాత కాలం పోలీసులం గాదురా" అని జాన్సన్ చెంపమీద ఫట్‌మని కొట్టాడు.

"దొంగ! నా కొడుకుల్లారా! మీ అనాథ పిల్లల కోసం... ఆ ఇంద్రక్క షెడ్లు కట్టించి, మీ కోసం పాటు పడ్తా ఉంటే, ఆమె ఇంట్లోనే దొంగతనం చేస్తారా!" అంటూ ఇద్దరు పసివాళ్ళ మీద తన పశు ప్రతాపం చూపించాడు.

ఆ రాత్రంతా... పోలీసు దెబ్బలతో, దోమలతో చీకటి సెల్‌లో జాగారం చేశారిద్దరూ.

మర్నాడుదయం తొమ్మిది గంటలకి మరో నలుగుర్ని లాక్కొచ్చి సెల్‌లో పడేసి చావగొట్టారు పోలీసులు.

మధ్యాహ్నం మూడు గంటలప్పుడు ఎస్సైకి ఫోనొచ్చింది. వెంటనే ఎస్సై బయటికి కెళ్లాడు.

గంట తర్వాత తిరిగొచ్చి.. "304, ఆళ్ళనొదిలెయ్యి" అన్నాడు.

"ఏంటి సార్?" అన్నాడు హెడ్ కానిస్టేబుల్.

"ఈ పెద్దోళ్ళతో ఇదే తలనొప్పి. ఆ ఇంద్రక్క మొగుడే నగలూ, డబ్బూ తీసి కొత్త బీరువాలో పెట్టి, నిన్న ఊరెళ్ళాడంట. ఇవ్వాళ ఆయనొచ్చి ఆ సంగతి చెప్పాడంట" అని అలిసిపోయినట్టు కాళ్ళు టేబుల్ మీద జాపుకుని కూచున్నాడు.

'ఒదిలేశారు, అంతే చాలన్నట్లు' పిల్లలంతా గబగబా బయటికెళ్తుంటే... శీను ఎస్సై దగ్గరికెళ్లాడు.

"మేం దొంగలం కాదంటే, నమ్మకుండా కొట్టినావు గదా! ఈడు పేషెంటు, ఇట్లేనా చావగొట్టేది. మీ పిల్లలైతే ఇట్లనే కొడ్తవా? ఆర్యూ నాట్ ఫీల్ షై" అన్నాడు కాస్త బిగ్గరగా. అతడి గొంతులో అసహ్యం ధ్వనించింది. టేబుల్ మీదున్న కాళ్ళు దించి ఎస్సై "ఏంటిరా?" అన్నాడు కోపంగా.

"ఐ విల్ టాక్ విత్ హ్యూమన్స్ ఓన్లీ" అనుకుంటూ శీను గబగబా జాన్సన్‌తో

కలిసి వేగంగా బయటకు పరిగెత్తాడు.

కానిస్టేబుల్ నుండి ప్రమోటయి వచ్చిన ఆ ఎస్సైకి శీను మాట్లాడిన మాటలు అర్థం గాలేదు.

"ఇదేంటబ్బా! తప్పు చెయ్యకపోయినా ఈ దెబ్బలు... ఇప్పుడు మనం చెయ్యలేదని తేలి పోయిందిగానీ లేకపోతేనా..." అన్నాడు శీను.

"ఈళ్లింతే, ఎవుడు దొంగతనం చేసినా దొంగలు దొరికే వరకూ మనలాంటోళ్ళని పట్టుకుని జైల్లో పెడ్తారు. ఇంతకు ముందో సారి మమ్మల్ని మూడు దినాలుంచి ఇరగ్గొట్టారు. ఆ దెబ్బలు మానేందుకు మూణ్ణెల్లు పట్టినాది" అన్నాడు జాన్సన్.

అమ్మా నాన్న చాటున అపురూపంగా ఎదగాల్సిన బాల్యం బజార్న పడితే... 'అనాథ' పట్టంతో తెగిన గాలిపటంలా ఏ కంచె మీద ఎపుడు వాల్తుందో, ఏ ముళ్ళు ఎక్కడ గుచ్చుకుంటాయో... కనీసం ఓదార్పు కూడా కరువైన జీవితం మీద విరక్తి కల్గింది శీనుకి.




స్టేషన్లో స్తంభాలకి అడ్వర్‌టైజుమెంట్ల వినైల్ పోస్టర్లు కొత్తవి మారుస్తున్నారు. వెంకటేశు, రాహుల్, రమేష్ నిలబడి చూస్తున్నారు.

రాహుల్ వెంకటేశుతో "ఏ క్యా హై యారో" అన్నాడు జరుగుతున్న దాన్ని గమనిస్తూ.

వెంకటేశు కూడా బలుక్కుని "ఇం...డి... మా...ట...డ" అన్నాడు రెండు నిమిషాలాగి.

పక్కనే తండ్రితో నిలబడ్డ ఓ ప్రయాణికుడి కొడుకు నవ్వుతూ... "ఇండిమాటడ" కాదు ఇండియా టు డే కదూ డాడ్" అన్నాడు.

"యూ ఆర్ కరెక్ట్" అన్నాడా తండ్రి కొడుకుని ఎత్తుకుంటూ.

బెంచీ మీద కూచుని చూస్తున్న శీను లేచి వెంకటేశు దగ్గర కొచ్చి సిగ్గుగా తలొంచుకున్న వెంకటేశుని ఆపి

........" నువ్వు చదువుకున్నావా? " అనడిగాడు.

"ఊc హూc"

"అయినా నువ్వేం సిగ్గు పడక్కర్లా! మనకీ అమ్మా నాయన పక్కనుండి చదువు చెప్పిస్తా ఉంటే ఇంతకంటే ఎక్కువే మాట్లాడతా ఉండే వోడివి. నీకు చదువుకోవాలనుంటే నేను నీకు చదువు జెప్త"

"నువ్వు చదువుకుంటననిబోయి మళ్లెనిక్కొచ్చినవేంటి? "

"మిమ్మల్నందర్నీ వొదిలి ఎళ్ళలేక...."

"ఇట్ట చదివిస్తం, అది జేస్తం, ఇది జేస్తమని తీస్కబోయి కొట్టి, తిట్టి పన్లు చేయించుకుంటారు"

"నీకెట్టా దెల్సు"

"రా! చెప్త" అని శీనుని తీసికెళ్ళి బెంచీమీద కూచోబెట్టాడు వెంకటేశు.

"ఓసారి... అంటే... పోయిన ఏడాది, ఒకాయన కన్పించి పిల్లల్లేరు, నిన్ను పెంచుకుంట నాతో రా! తీస్కబోత అన్చెప్పిండు. పెద్దన్న, బద్రిగాడు, దాదా కల్సి నన్ను ఆయన్తో పంపినారు. ఊరుకి బోయినాక రెండ్రోజులు బాగనే జూసిండు. తర్వాత ఆయనకి పిల్లలున్నారని తెల్సింది. ఆయన మెకానిక్ షెడ్డులో పన్లు చెయ్యడానికి, ఇంట్లో పని చెయ్యడానికి నన్ను వాడుకుంటూ, అర్ధరాత్రి వరకూ నిద్ర బోనిచ్చేవోళ్ళు గాదు. పన్జెయ్యకబోతే కొడ్తుండె.

నాల్రోజులు బోయాక... ఇంట్లో పన్లు చేస్తావున్నా. ఆయన మోటార్ సైకిలు మీద ఇంటికొచ్చి నాతో "షెడ్డుకి రమ్మంటే ఇంట్లో ఏం జేస్తన్నవురా!" అని చెయ్యి జేసుకున్నడు.

ఆయన భార్య వెనకాలే వచ్చి పని చేసి ఎళ్ళమంది.

ఇంటి పన్లు జేస్తావుంటే... ఆయన ఎనకా

ల్నుంచొచ్చి నా జుట్టు పుచ్చుకుని ఈడ్చుకు పోయి బండి మీదికి నెట్టి,

"అనాథ నా కొడకా, ముందు షెడ్డుకు పదరా!" అన్నాడు.

ఆయన నెట్టటంతో ముందుకి తూలి, బండి మీద పడిన. వేడిగా ఉన్న సైలెన్సరు మీద పడిపోయినాను. చూడు ఇక్కడ కాలి సెర్మం ఊడిపోయినాది" అని చొక్కా తీసి చూపించాడు వెంకటేశు.

గుళ్ళో పురోహితుడు వేసుకునే జంధ్యంలా పొట్ట మీద కుడి గూడ నుండి అడ్డంగా కాలిన పొడవాటి మచ్చ చూసిన శీనుకి నోట మాట రాలేదు.

" తర్వాతేమైంది? "

"ఏముంది? ఆ రాత్రే పారిపోయి రైలెక్కొచ్చిన"

"అందుకే నీకు చదువు నేర్పైస్త. నేనిట్టా కొట్టనులే" అన్నాడు శీను నవ్వుతూ.

"నిజంగా శీనూ! నిన్ను జూశాక నాకూ సదూకోవాలన్పిస్తుంది" అన్నాడు వెంకటేశు.

"ఈ రోజు రాత్రికే మొదలు బెడదాం"

ఆప్యాయంగా శీను చెప్పిన మాటలకి ఆశ నిండిన కళ్లతో లేచెళ్ళాడు వెంకటేశు.

* * *

"ఏంట్రా! జాన్సన్! మొన్న రేత్తిరి నిన్నూ, ఈణ్ణి జైల్లో బెట్టినారంట. ఏం జేసిన్రురా? " పెద్దన్న కళ్లెర్ర జేశాడు.

"సిన్మాకి బోయి వస్తంటే..."

"నిజం చెప్పండ్రా!"

"లేదన్నా! కావాల్నంటే వీరన్నని, వెంకటేశుని అడుగు"

పక్కనున్న బద్రిగాడు "నిజమే నంటన్నా... సినిమాకే బోయినారంట. వీరిగాడు జెప్పిండు"

"కొట్టినార్రా... బాగా"

"ఇక్కడ చూడన్నా..." అని జాన్సన్ కాళ్ళకి వేలాడుతున్న ప్యాంటు పైకి లాగి చూపించాడు.

అది చూసి కూడా కనికరం లేకుండా...

"మీకు సినిమాలు గావాల్నొచ్చినాయంటరా... ఎర్రినాయాళ్ళలారా!" కసురుతున్నట్లు గట్టిగా అన్నాడు పెద్దన్న.

"............" ఎవరూ మాట్లాడలేదు.

"ముందు... డబ్బుల్దీయండి" కరకుగా అంటూ జాన్సన్ జేబుల్ని వెతికాడు పెద్దన్న.

అంతలో "అన్నా! నిన్ను శంకర్ దాదా అర్జంటుగా రమ్మంటుండు." పరుగెత్తుకుంటూ వచ్చి చెప్పాడు, బస్టాండ్లో ఉండే మల్లిగాడు.

"ఏడున్నడురా? "

"బస్టాండు కాడున్నడన్నా!"

"ఏమయినాది? "

"ఎవుర్నో కొడ్తున్నడన్నా"

అంతే, పెద్దన్న ఉన్న ఫళాన లేచి పరుగెత్తాడు.

రెండో నంబరు ప్లాట్ ఫారం చివర ట్యాప్ దగ్గర నీళ్ళు బోసుకుంటున్న సూరిని చూసి ఒకట్లో ఉన్న రమేషు, శీను అక్కడి కొచ్చారు.

"సూరీ! పనికి పోలేదా? "

"మానేశాను"

"ఎందుకని"

"ఇందుకు..." అని వెనక్కి తిరిగి వీపు చూపించాడు. వీపు నిండా వాతలు, కర్రతో కొట్టిన దెబ్బలు.

"ఏంటి... పోలీసులు కొట్టినారా? " కంగారుగా అడిగాడు శీను.

"కాదు... మస్తాన్‌గాడు"

"ఎందుక్కొట్టిండు? "

"డబ్బు లియ్యమనడిగినాను"

"ఎంతియ్యాలి"

"వెయ్యి రూపాయలు"

"నెల నెలా ఇయ్యడా? "

"మొదట నెలనెలా ఇస్తనని చెప్పినాడు. ఆదివారం పది రూపాయలిస్తడు. నెలకి ఇచ్చే రెండొందలు తన దగ్గరే దాచి పెడతానని, వెళ్ళిపొయ్యేటప్పుడు ఒకేసారి ఇస్తనని చెప్పినాడు. డబ్బులియ్యమని అడిగితే, ఇంకో కొత్త పిల్లకాయని పన్లో బెట్టుకుని, నేను డబ్బుల్దొంగతనం జేసినానని, కొట్టి పంపించిండు"

"పెద్దన్నకు చెప్పకపోయినావా? "

"ఈయనా ఆ మస్తానోళ్ళ మణిసే. ఈడే కొత్త పిల్లకాయని పన్లో బెట్టిండు"

"మనమంతా రేపెళ్ళి ఆ మస్తాన్‌గాడి పని బడదాం" అన్నాడు శీను ఆవేశంగా.

"వొద్దు శీనూ! ఆడు మహా మోసమయిన మనిషి"

"బయపడమాక. మనందరం కల్సి పోతి మంటే ఆడేం చెయ్యలేడు" అని సూరికి ధైర్యం చెప్పాడు.

మరుసటి రోజు నేస్తాలతో కల్సి వెళ్లాడు సూరి. అందరూ బయట ఆగిపోయారు. లోపలికి వెళ్లిన సూరిని చూడగానే "ఏమిరా! మళ్ళొచ్చినావు... దొంగనాకొడకా!" అన్నాడు మస్తాన్.

"నాకియ్యాల్సిన డబ్బులియ్యి" దబాయిస్తు న్నట్లు అడిగాడు సూరి.

"ఇచ్చినయి చాల్లేదా? " కోపంగా అడిగాడు మస్తాన్.

"డబ్బులియ్యి".

"గల్లాలో డబ్బు దొంగతనం జేసింది చాలక మల్ల డబ్బులడుగుతవు బే! కుత్తే కమీన్" అని సూరి జుట్టు పట్టుకుని ముందుకు నెట్టాడు.

సరిగ్గా అప్పుడు పిల్లలందరితో కలిసి శీను లోపలికొచ్చాడు.

"ఎందుకాణ్ణి కొడ్తున్నావు? "

"నువ్వెవరు బే సాలా? "

"నా తమ్ముడు. వై ఆర్యూ బీటింగ్? "

"కుత్తే! ఇంగ్లిషు మాట్లాడితే బయపడ్తన నుకున్నావా? చల్... చల్...." అంటూ శీనునీ బయటికి నెట్టాడు మస్తాన్.

"యోవ్! మస్తాన్! టీ కేట్టి ఎవళా నేరమా యిచే... చీఘ్రం కుడప్పా! వేల ఇరుక్కు"

తమిళ కస్టమరు అడుగుతుంటే...

"అన్నే... ఒరు నిమిషం" అనెళ్ళి టీ తీసుకు వచ్చాడు.

"చెప్పు... ఎందుకు ఆణ్ణి కొడ్తున్నవ్... ముందు ఆడితో పంజేయించుకున్న డబ్బు లియ్యి" అని పిల్లలంతా మస్తాన్‌కి అడ్డంగా వచ్చి నుంచున్నారు.

"క్యా బే... నకరాల్ బోతున్నరా! ఈ మస్తాన్ అంటే ఈ ఏరియాకే హడల్... హరామ్ కె ఔలాద్ చల్" అంటూ చేతిలో ఉన్న వేడి టీ పిల్లల మీద పోశాడు.

సూరిని జుట్టు పట్టుకు మళ్లీ కొట్టబో తుంటే అక్కడున్న గ్లాసులు తీసుకుని మస్తాన్ మీదికి విసిరేశారు పిల్లలు.

శీను కూచున్న కస్టమర్ల దగ్గరకెళ్లి, "సార్! వీడితో నాలుగు నెలల్నుంచీ పని చేయించు కుని, డబ్బులడిగితే, దొంగతనం జేసిండని చావగొడ్తుండు..." అని సూరి చొక్కా ఊడ దీసి చూపించాడు.

"ఈడి పిల్లల్నిట్లనే కొడ్తడా? "

కస్టమర్లలో ఒకడు వాడి వీపు మీది దెబ్బలు చూసి, "ఏంది మస్తాన్ భయ్ ఇది? " అనడిగాడు.

"కోన్ హై తూ... వచ్చినవా? చాయ్ తాగినవా... అంతే? అనవసరంగా కల్పిం చుకుంటే మంచిగుండదు... జా... జా"

"అయితే చిన్న పిల్లల్తో పన్లు చేయిస్తున్నా వని బాల కార్మిక చట్టం కింద కేసు పెట్టి, నీ హోటల్ మూయిస్త".

అంతే, ఆ మాటలకి గాలి తీసిన బెలూన్లా మారిన మస్తాన్ ప్లేటు ఫిరాయించి,

"ఇవాళ డబ్బులిస్త రమ్మని చెప్పిన" అన్నాడు నమ్రతగా.

"నాతోనే ఇంత రెక్‌లెస్‌గా మాట్లాడావు. పిల్లల్ని నువ్వు హింసించటం నేను కళ్లారా జూశాను. వీటన్నిటికీ నీమీద కేసు పెట్టి మూయిస్తే గానీ, నీలాంటి వాళ్లు దారికి రారు"

"పెద్ద లాయర్ లెక్క మాట్లాడుతున్నవ్. నువ్వింకా ప్లీడర్ చదువే పూర్తి చెయ్యలే. నీలాంటి వాళ్ళని ఇంత మందిని చూశా" అని వెంట్రుకలు చూపించాడు మస్తాన్, అంతలోనే మాట తీరు మార్చేసి.

అంతే! ఆ మాటకి రెచ్చిపోయిన అతడు

## ఎడమ చేతి ఆట



క్విట్ ఇండియా ఉద్యమం జరిగిన కొన్నాళ్లకు గాంధీజీ, శ్రీమతి సరోజినీ నాయుడు ఆగాఖాన్ భవనంలో బ్రిటిష్ వారిచేత బందీలయ్యారు. ఒక రోజు సాయంత్రం సరోజినీ నాయుడు, బాపూజీని సవాల్ చేసింది-తనతో బ్యాడ్మింటన్ ఆడమని! బాపూజీ చిరునవ్వు నవ్వారు.

"నేనింతవరకూ ఎన్నడూ బ్యాడ్మింటన్ ఆడలేదు. అయినప్పటికీ నీతో ఆడి, నిన్ను ఓడిస్తాను!" అన్నారు ఎంతో ధీమాగా.

ఇరువురి మధ్య ఆట ఆరంభమైంది. శ్రీమతి నాయుడు ఎడమ చేత్తో ఆడసాగింది. ఆమె కుడి చేతికి గాయం అవ్వడం వల్ల ఎడమ చేతితో ఆడడం చూసిన గాంధీజీ తాను కూడా ఎడం చేత్తో ఆడసాగారు. దాంతో సరోజినీ ఆయన్ను హేళన చేసింది.

"మీకు బ్యాటు ఎలా పట్టుకోవాలో చేతకాదు. అటువంటప్పుడు నన్ను ఓడిస్తానని ఎలా అనుకొంటున్నారు? " బ్యాటు పట్టుకుని ఆడవలసింది కుడి చేత్తో గానీ, ఎడం చేత్తో కాదు!" అందామె.

"అయితే నువ్వెందుకు ఎడం చేత్తో ఆడుతున్నావు? " అన్నారు గాంధీజీ.

"నా కుడి చేతికి దెబ్బ తగిలింది - అందుకని ఎడం చేత్తో ఆడుతున్నాను." చెప్పింది శ్రీమతి నాయుడు.

అది విన్న తర్వాత కూడా మహాత్ముడు తన ఆటను ఎడమచేత్తో కొనసాగించారు.

"మొదట్లో నేనిలా ఆడడం పొరపాటు! అయితే ఇప్పుడాడడం పొరపాటు కాదు. ఒక స్త్రీ బలహీనతను నేను అవకాశంగా ఎన్నడూ తీసుకోను!" అన్నారు మహాత్ముడు నవ్వుతూ.

---

అక్కడున్న కాలేజీ స్టూడెంట్స్‌తో ఇంగ్లిషులో ఏదో మాట్లాడాడు.

అప్పటి వరకూ మౌనంగా వేడుక చూస్తున్న స్టూడెంట్సంతా ఏకమై, మస్తాన్ హోటల్లో గ్లాసులు, కప్పులు విసిరేశారు.

తన వ్యాపారానికి మొదటికే మోసం వస్తుందని గ్రహించి ఐదొందలు ఇవ్వబోయాడు మస్తాన్.

"సార్! నెలకి రెండొందలు ఇస్తానన్నాడు. ఐదు నెలల నుండి పని చేయించుకున్నాడు. వెయ్యి రూపాయలు ఇవ్వాలి. కావాల్నంటే వారానికి పది రూపాయలు ఇచ్చాడంట. నెలకి నలభై, ఐదు నెలలకి రెండొందలు తీసుకుని ఎనిమిదొందలు ఇవ్వమనండి." శీను లెక్కలేసి చెప్పాడు.

అక్కడున్న పిల్లలతో బాటు పెద్దలు కూడా ఆశ్చర్యపోయారు.

"అరే! పిట్ట కొంచం కూత ఘనం అన్నట్టు ఇలాంటి వాళ్లకి బుద్ధి చెప్పడానికి నీలాంటి వాళ్లు ధైర్యంగా ముందుకు రావాలి." అని లా విద్యార్థి శీనుని ప్రశంసించాడు.

మస్తాన్ సూరికి ఎనిమిదొందలు ఇచ్చాడు.

శీనుతో పాటు జాన్సన్, రమేష్, సూరి, మల్లేశు, వెంకటేశు, వీరిగాడు అందరూ కలిసి బయటకు నడిచారు. అందరిలో కొత్త ఉత్సాహంతో బాటు 'చదువుకుంటే' అనే ఆలోచనకు అంకురాలు పడ్డాయి.

ఆ రోజు రాత్రి శీను కోనేటి మెట్ల దగ్గర కూచుని వెంకటేశు, సూరిలకి చదువు జెప్పటం మొదలెట్టేసరికి వీరిగాడు, మల్లేశులు వచ్చి చేరారు. శీను తనకి స్కూల్లో టీచరు చెప్పిన తీరును అనుకరిస్తూ చెప్తున్నాడు. అంతలో వెనక నుండి బద్రిగాడు, శంకర్ దాదా, పెద్ద

న్నలు వచ్చారు. శీనుని కింద పడేసి, "ఏరా! అనాథ నా కొడకా! మస్తాన్ హోటల్‌కి బోయి గోల జేసినావంట. నువ్వేమన్నా లీడ ర్వా? దాదావా? " అంటూ కాళ్లతో ఈడ్చి తన్నారు.

"అన్నా! శీను తప్పేం లేదన్నా. ఆ మస్తాన్ డబ్బులియ్యకుండా..." అని అమా యకంగా జరిగినదంతా చెప్పాడు సూరి. అంతే, బలవంతంగా సూరి దగ్గర ఎనిమి దొందలు లాక్కున్నాడు శంకర్ దాదా.

వాళ్ళు కొట్టిన దెబ్బలకన్నా, నోటికొచ్చి నట్టు తిట్టిన బూతులే బాకుల్లా శీను గుండెల్లో గుచ్చుకుంటున్నాయి.

పిల్లలంతా ఆ దెబ్బకి ఎవరిదోవన వాళ్ళెళ్ళి పోయారు. జాన్సన్, శీను, సూరి స్టేషన్లోకొ చ్చారు. ఐదునెలలు కష్టపడి, ఎంతో కష్టం మీద రాబట్టుకున్న డబ్బు... ఐదు నిమిషాల్లో లాక్కుపోయారని సూరి తెగ బాధపడిపో యాడు.




వర్షం ఉధృతంగా పడుతోంది. కరెంటు పోతూ, వస్తూ ఉంది.

జాన్సన్, శీను, రమేష్, సూరి ఒకటో నంబ రు ప్లాట్‌ఫారంలో ఆరెమ్మెస్ రూమ్ ముందు న్న పార్శిల్ బస్తాల దగ్గర కూచున్నారు. జాన్సన్, రమేష్‌లు తొందరగా నిద్రబోయారు.

సూరి, శీనుతో ఏదో చెప్తూనే ఉన్నాడు గానీ శీను ఆలకించటం లేదు.

తనకి తల్లీదండ్రీ లేరనీ, తమ్ముడు ఊరులో తాత దగ్గర చదువుకుంటున్నాడని ఈ ఎనిమి దొందలు తమ్ముడికి ఇద్దామనుకున్నానని చెప్పాడు సూరి గద్గదిక స్వరంతో. అతడిలోని బాధంతా ఆ మాటల్లో ధ్వనించింది. అయినా శీను పరధ్యానం వదల్లేదు.

అర్ధరాత్రి దాటింది. రైళ్ళ రాకపోకలు తగ్గి, నిశ్శబ్దంతో స్టేషన్ విశ్రాంతి తీసుకుంటోంది. అడపాదడపా రోడ్డుమీదెళ్ళే వాహనాల శబ్దాల్నీ, వర్షపు హోరు మింగేస్తోంది. సూరి ఎపుడు నిద్రబోయాడో గానీ, కలత నిద్రలో ఉన్న శీనుకి ఎవర్దో ఆడగొంతు ఆర్తనాదంలా విన్పించేసరికి ఉలిక్కిపడి లేచాడు.

దూరం నుండి ఆడగొంతు అరుస్తున్నట్టు విన్పించింది. లేచి కూచున్నాడు.

ఈసారి అరుస్తున్న నోటిని ఎవరో మూస్తు న్నట్టు మూల్గులు విన్పిస్తున్నాయి.

సూరిని నిద్రలేపి విషయం చెప్పాడు.

"ఊఁ ఎవరో మనకెందుకులే పడుకో"

"సూరి! లే! ఎళ్ళి చూసొద్దాం"

మూతలు పడ్తున్న కళ్ళతో లేచి కూచుని మళ్ళీ పడుకున్నాడు సూరి.

ఈసారి జాన్సన్‌ని లేపాడు.

అతడు "ఏంటి శీనూ" అనేసరికి విషయం చెప్పాడు. ఇద్దరూ కల్సి మూల్గులు విన్పిస్తున్న వైపు బయల్దేరారు. రెండో నంబరు ప్లాట్ ఫారం చివర్లో యార్డులో ఆగి ఉన్న గూడ్స్ బండి దగ్గర్నుంచి, పెద్దగా వస్తున్న మూల్గు లు విని అటు వెళ్లారు.

ఓ బోగి నుండి ఎవరో వ్యక్తులు దిగి పరు గెత్తినట్టన్పించి "ఎవరది? " అరిచారిద్దరూ.

గబగబా బోగీలోకి ఎక్కిచూసి అవాక్క య్యారిద్దరూ.

బోగీలోకి సన్నగా లైటు పడుతోంది.

ఆ వెలుగులో కన్పించిన దృశ్యం శీను హృదయాన్ని కలచివేసింది. పిచ్చిది. స్టేషన్లో తిరిగే పిచ్చిది. అస్తవ్యస్తంగా మోకాళ్ళు దాటిన చీర సరిచేసుకునే స్థితిలో కూడా లేనట్టు పడు కుంది. ఆచ్ఛాదన లేని ఎద.

"వద్దు! నన్నేం చెయ్యొద్దురా లం... కొ... ల్లారా... నెప్పి... నెప్పి" అని హీన స్వరంతో అంటోంది.

వర్షానికి అడుగునంతా తడిగా వుంది.

శీను జాన్సన్‌కి సైగ చేశాడు దిగమని. ఇద్దరూ కిందికి దిగాక, "సూరిని, వీరిగాణ్ణి పిలుచుకొద్దాం. తొందరగా రా!" అన్నాడు. మళ్ళీ ఇద్దరూ ఆరెమ్మెస్ దగ్గరకొచ్చారు.

వర్షం తగ్గింది.

ఆరెమ్మెస్ దగ్గర రాజు తప్ప ఎవరూ లేరు. ప్లాట్‌ఫారం అంతా వెతికారు.

"సరేరా! మనం వెళ్దాం" అన్నాడు శీను.

"మళ్ళీ ఎందుకు? "

"లేకపోతే పిచ్చిదాన్ని చంపేస్తారు".

సూరి లేచొచ్చాడు. అతడిని చూసి... "వీరన్న, మల్లేశు ఏడ ఉన్నారు? "అడిగాడు జాన్సన్.

"అదుగో ఆ బెంచీ మీద పడుకున్నారు."

వెళ్ళి లేపాడు. వాళ్ళిద్దరూ లేవగానే విషయం చెప్పాడు శీను.

"తొందరగా పదండి పోదాం" అని వీరిగాడు అనేసరికి కొండంత బలం వచ్చినట్టు ఫీలయ్యాడు శీను.

అందరూ కలసి మళ్ళీ గూడ్సు కంపార్టుమెంటు దగ్గరకి వచ్చి చూసేసరికి అక్కడ పిచ్చిది కన్పించలేదు.

"ఎక్కడ్రా!" అన్నాడు వీరిగాడు.

"ఇక్కణ్ణే జూసినం... మా ఇద్దర్ని జూసి, అట్నుంచి దూకి ఎళ్లిపోయినారు. పిచ్చిది ఇక్కడ్నే ఉందే"

"మనం వెనక్కి వెళ్ళటం జూసి, పిచ్చిదాన్ని ఈణ్ణుంచి తీసుకెళ్ళిపోయుంటారు..." అన్నాడు శీను.

"పాపం! రా! ఎవుళ్ళో పిచ్చిదాన్ని... ఏదో చేసినారు... ఒంటిమీద గుడ్డలు గూడా సరిగ్గా లెవ్వు" అన్నాడు జాన్సన్.

"సర్లే! రండ్రా! పోలీసు లెవుడన్నా జూసిం డనుకో... మనమీదకే నెడ్తారు. రండెళ్దాం" అని అటువైపు నుండి కిందికి దూకాడు రమేష్.

"ఇటేడికి? "

"రెండులోకి ఇంకో అర్ధగంటలో కేరళ ఎక్స్ప్రెస్ వస్తాది" అన్నాడు వీరిగాడు.

అందరూ కలిసి రెండ్లోకి వెళ్తుంటే ఏవో మాటలు వినిపించాయి. అందులో ఒకడిది మాత్రం పరిచయమున్న గొంతు.

వెనక్కి తిరిగి చూశాడు వీరిగాడు.

ఒకడు మసగ్గా కన్పించాడు. వాడికి గడ్డం ఉంది. వాణ్ణి బస్టాండు దగ్గర చూసినట్టు గుర్తుంది శీనుకి.

వాళ్ళ మాటలు మళ్ళీ విన్పించాయి.

"రేయ్... బండోడా! ఈ ఇసయం ఎవుడి కన్నా జెప్పినవంటే..."

"తెల్సన్నా! పేణం బోయినా నోరిప్పను"

"పిచ్చిదైతే అయింది గానీ నల్గురం మస్తు మజా జేసినం"

"పిచ్చి నా కొడకా! ఈ చొల్లు వాగుడే వాగొద్దనేది. మర్చిపో, మనకేం తెల్వదు. పిచ్చిదాన్ని మనమెపుడూ చూళ్ళేదు. ఎవ్వడైనా అడిగితే ఇదే మాట చెప్పాలి తెల్సిందా? " గడ్డం వాడు అన్నాడు.

"తొందరగా పదండ్రా! ఈణ్ణే ఉంటే.. ఎవల్లయినా వస్తారు."

వాళ్ళు వేగంగా వెళ్ళిపోయారు.

ఆ మాటలు విన్న వీరిగాడు "ఈళ్ళలో ఖచ్చితంగా బస్టాండు బైరిగాడు, వినోద్‌గాడు ఉండారు. మిగిలినోళ్ళెవరో తెల్వట్లా" అన్నాడు.

"పిచ్చిదాన్నేం జేసినారో." అని రాజు అనేసరికి.

"ఏమోలే, మనమేం జేస్తాం" అనుకుంటూ అందరూ రెండులోకి వచ్చారు.

టైము అర్ధరాత్రి మూడు దాటింది.

శీను ఆలోచిస్తూనే ఉన్నాడు.

కేరళ ఎక్స్‌ప్రెస్ రావటంతో ప్లాట్‌ఫారం బిజీ అయింది. బెంచీమీద కూచున్న శీనుకి వచ్చీ పోయే జనాల్ని చూస్తుంటే "జనారణ్యంలో సంచరిస్తున్న వింత మనుషులు, వింత పోకడలు, కళ్ళముందు ఎపుడు ఏం జరుగుతుందో, ఎవరి తలరాత ఎలా మారుతుందో, వింతగా అన్పిస్తోంది.

పాపం పిచ్చిది, నిజంగానే పిచ్చిదే. ఎక్కడ పుట్టిందో, ఎక్కడ పెరిగిందో, అమ్మానాన్న

లెవరో, ఎందుకు పిచ్చిదైందో... అలా ఎంత సేపు ఆలోచించాడో గానీ, కూచున్న చోటే నిద్రబోయాడు.

"శీనూ! లెగరా! లెగు ఒకట్లోకి ప్యాసింజరొచ్చింది" అని రమేష్ పిల్చేసరికి బద్ధకంగా కళ్ళు తెరిచాడు.

చీకటిని కబళించడానికి వెలుగు రేఖలు. మసగ్గా తమ ఆధిపత్యాన్ని ప్రసరింపజేస్తున్నాయి.

అలవాటయిన హడావిడితో ప్లాట్‌ఫారంపై బిజీ దినచర్య మొదలయింది. వర్షం ఆగిపోయింది. చల్లగాలి రివ్వున వీస్తోంది.

శీను లేచి రెండో నంబరు ప్లాట్‌ఫారం చివరున్న ట్యాప్ దగ్గర మొహం కడుక్కుంటుంటే వచ్చీపోయే వాళ్ళ మాటలు వినిపించాయి.

"పాపం! ఎవరో ఒళ్ళు తెలీకుండా పండుకుండాది" అంతే. తల తిప్పాడు శీను.

ప్లాట్‌ఫారం మొదట్లో ఉన్న చెట్టుకింద పిచ్చిది కాళ్ళు జాపుకుని పడుకుంది.

పరుగెత్తాడు శీను

అస్తవ్యస్తంగా ఉన్న బట్టలు... ఆచ్ఛాదన లేని ఎద... స్పృహ ఉందో లేదో? దగ్గరకెళ్ళి చూశాడు.

చెయ్యి కదిపాడు. చలనం లేని కట్టెలా ఉంది.

వేగంగా పరుగెత్తుకెళ్ళి ఒకట్లో ఉన్న పిల్లల్ని పిలుచుకొచ్చాడు. వీరిగాడు పిచ్చిదాని చేతులు పట్టుకుని కదిపాడు.

చలనం లేదు. రమేష్ పిచ్చిదాని ముక్కు దగ్గర చెయ్యి పెట్టి చూసి, "అన్నా! ముక్కులాడటం లేదు" అన్నాడు. శీను లేచి పిచ్చిదానిపై బట్టలు కప్పాడు. వీరిగాడు



చేతిలో ఉన్న కర్రతో కాళ్ళ మీద బట్టలు సరిచేశాడు.

పిచ్చిది చచ్చిపోయింది!

వెలుగు రేఖల్ని విర జిమ్ముకుంటూ బాల భానుడు దివి నుండి



భువికి దిగాడు.

వచ్చీపోయే ప్యాసింజర్లు, పోర్టర్లు, పిచ్చిదాని శవాన్ని వింతగా చూసిపోతున్నారు.

స్టేషన్ మాస్టరు, హెల్త్ ఇన్స్పెక్టరు, రైల్వే సిబ్బంది వచ్చి ఏదో రాసుకెళ్ళారు.

శీను, రమేష్, మల్లేశు, జాన్సన్, వీరిగాడు, వెంకటేశు అక్కడే ఉన్నారు.

అక్కడ మూగుతున్న జనం రకరకాల కామెంట్లు చేసి పోతున్నారు.

ఉదయం పది గంటలవుతున్నా శవాన్ని పక్కకి తోసే వాళ్ళే కరువయ్యారు.

ప్లాట్‌ఫారం మీద తిరిగే కుక్క పిచ్చిదాని శవాన్ని వాసన చూస్తుంటే వీరిగాడు చేతిలో కర్రతో దాన్ని తోలాడు.

"రేయ్! పొద్దుట్నుంచీ ఈణ్ణే కూసున్నాం. ఆకలవుతుంది. రండ్రా పోదాం!" మల్లేశు లేస్తూ అన్నాడు.

ఇక అక్కడ మిగిలింది జాన్సన్, శీను మాత్రమే.

మధ్యాహ్నం పన్నెండు గంటల తర్వాత మున్సిపాలిటీ లారీలో మనుషులొచ్చి పిచ్చి దాని శవాన్ని తీసుకోబోతుంటే జాన్సన్ భోరున ఏడ్చేశాడు.

"అరే! ఏంట్రా ఇది, ఊరుకో" అన్నాడు శీను అతణ్ణి దగ్గరకి తీసుకుని "రేపు నా బతుకూ ఇంతే. పిచ్చిదాన్ని ఆ నాయాళ్ళు చంపేశారు. నన్ను ఎయిడ్సు చంపేస్తది..." అన్నాడు జాన్సన్ వెక్కుతూ

"అట్టా ఏం జరగదులే.. ఎవురికేం జరు గుద్దో ఏం తెలుసు? రా!" అని శీను జాన్స న్‌ను వేగంగా అక్కణ్ణుంచి తీసుకెళ్ళాడు.

ఆ రోజంతా ప్లాట్‌ఫారం పిల్లలు ఏ ఇద్దరు కల్సినా పిచ్చిదాని చావు సంభాషణే.

సాయంత్రం ఐదయింది. శీనుకి వీరిగాడు కన్పించాడు. ఒకళ్ళ తర్వాతొకళ్ళు కోనేరు

దగ్గరకి చేరారు.

"ఏంటోరా! పిచ్చిదాన్ని రెండేళ్ళ బట్టీ ఈణ్ణే జూస్తుంటిని, ఇలా జరగటం, అది సచ్చిపో వటం శానా బాధగా వుందిరా!" వీరిగాడ న్నాడు.

"రేపు మనలో ఎవరుపోయినా అంతేరా!" రాజు అన్నాడు.

"మంచిగ చదువుకుంటే మనమూ మంచిగ బతకొచ్చు" అన్నాడు శీను.

"మొదలెట్టాడ్రా ఈడి చదువు పిచ్చి. అసలే మేమంతా పిచ్చిది సచ్చిన దుఃఖంలో ఉంటే..." అన్నాడు వీరిగాడు.

అప్పుడు వాళ్ళకి తన మాటలు తలకెక్క వని శీను సైలెంటైపోయాడు.

వీరిగాడు, మల్లేశు లేచి "ఏరా! రమేషు మందుకొడ్దాం వస్తావా? " అనేసరికి అంతా లేచెళ్ళారు.

మళ్ళీ మిగిలింది శీనూ, జాన్సన్‌లే.




మూడ్రోజులుగా ముసురు, తుఫాను. కుండపోతగా వర్షం కురుస్తోంది.

ఆకాశం నల్లని మేఘాలతో మూసుకుపోవ టంతో పగలే చీకటిలా ఉంది.

జన జీవనంలో స్తంభన ఏర్పడ్డది.

తీవ్ర వర్షాల వల్ల రైళ్ళ రాకపోకలకు భంగం వాటిల్లింది.

ప్లాట్‌ఫారంలో పిల్లలంతా ఒకచోట చేరారు.

పోర్టర్లకు పనిలేక ప్లాట్‌ఫారం పిల్లలతో పేకాట ఆడుతున్నారు.

వీరిగాడు, వెంకటేశు, రమేషుల పేకాట పాండిత్యం ముందు పోర్టర్లు ఓడిపోతు న్నారు.

వాళ్ళకి దగ్గర్లో మల్లేశు, రాహుల్, శీను, జాన్సన్‌లు కూచున్నారు.

"అరే!మల్లేశు! చిరంజీవిలాగా డ్యాన్సు చెయ్యరా. చూసి శానా రోజులయింది" అన్నాడు జాన్సన్.

వెంటనే రాహుల్ పాట అందుకున్నాడు.

"దాయ్... దాయ్... దామ్మా... నడిచే కుందనాల్ బొమ్మ" అంతే. వదిలిపెట్టిన స్ప్రింగులా మల్లేశు డ్యాన్సు చేస్తుంటే, అక్కడ చేరిన పిల్లలే కాకుండా, పోర్టర్లు, ప్రయాణికులు నోళ్ళు తెరుచుకుని చూస్తున్నారు.

వచ్చీరాని పాటని రాహుల్ మధ్యలో ఆపే శాడు. మల్లేశు డ్యాన్సు ఆగిపోయింది. అలిసి పోయి కూచున్నాడు.

'రాహుల్..నీకు తెలుగు పాటలు వచ్చా? '

"సిర్ఫ్ ఎహీ మాలూమ్ హై"

అక్కడున్న వాళ్ళంతా చప్పట్లు కొట్టారు.

"అరే! రమేషూ! నువ్వు ఎన్.టి.ఆర్. పద్యం పాడతవే, అది పాడరా!"

"నాకు సిగ్గేస్తాది"

వీరిగాడు రమేష్‌ని లేపి నుంచోబెట్టి "నువ్వు ఎత్తుకోరా నేనున్నా" అనేసరికి వాడు ఎన్.టి. ఆర్. దుర్యోధనుడి పాత్రను అనుకరిస్తూ, "దారుణి రాజ్యె సంపద.. ముదంబునన్..." అని ఆలాపన చేస్తూ పద్యం ఎత్తుకున్నాడు. అక్కడున్న వాళ్ళంతా ఆశ్చర్యంగా చూడసా గారు.

రాజు లేచి "ఈరన్నా! నువ్వు చెంద్రబా బులా, మోహన్‌బాబులా మాట్లాడతవే అది చెప్పు" అన్నాడు.

వీరిగాడు సిగ్గుపడకుండా లేచి నుంచుని చంద్రబాబు నాయుడిలా రెండు వేళ్ళు 'V' లా చూపుతూ..

"అధ్యక్షా! తొమ్మిదేళ్ళు ముఖ్యమంత్రిగా ఉండి, ఇపుడు ఊర్కెనే ఉండాలంటే శానా కష్టంగా ఉంది. మరందుకని వై.ఎస్.ని దింపి నన్ను మళ్ళీ ముఖ్యమంత్రిని చెయ్యమని మనవి చేసుకుంటున్నాను" అనేసరికి పిల్ల

లంతా చప్పట్లు కొట్టారు.
చివరికి శీను వంతొచ్చింది.
శీను లేచి నిలబడి "నాకు చదువు చెప్పిన ఇంగ్లీష్ టీచర్‌లా మాట్లాడతా" అని
"గుడ్ మాణింగ్ చిల్డ్రన్! టు డే ఉయ్ ఆర్ గోయింగ్ టు లెర్న్ అబౌట్ మదర్ థెరిసా" అంటూ సెవెంత్‌లో తను చదివిన పాఠాన్ని అనర్గళంగా ఇంగ్లీష్‌లో చెప్తుంటే, అంతా కళ్లప్పగించి ఆశ్చర్యంగా చూశారు. జాన్సన్, సూరి, వీరిగాడు చప్పట్లు కొట్టారు.
ఓ ప్రయాణికుడు చప్పట్లు కొడుతూ వచ్చి, శీనుకి పదిరూపాయలిచ్చి "ఇంత మంచిగ సదువొచ్చేపోడివి ఈడకెందు కొచ్చినవురా! ఈ కాలంలో సదువు లేనోడు ఎందుకూ పనికిరాడు. ఇంటికి బోయి బాగా సదువుకోరా!" అనేసి వెళ్లిపోయాడు.
అక్కడున్న పిల్లలంతా ఒకళ్ళ మొహాలు ఒకళ్ళు చూసుకున్నారు. సడన్‌గా వీరిగాడు లేచి...
"అరేయ్ ఇనంద్రా! మన మందరము కల్సి శీనుగాణ్ణి బడికి పంపి సదివిద్దాం రా! మొన్నొ కాయనొచ్చి ఈ పేపరిచ్చి మనల్నందర్ని రమ్మని, చదువు జెప్తనని చెప్పోళ్లిండు" అని జేబులో ఉన్న పేపరు మడత తీసి శీనుకి చ్చాడు.
శీను పేపరు తీసి చూశాడు.
"ఆలంబన"... అనాథ పిల్లలకి, రక్షణ, శిక్షణ, క్రమ శిక్షణ అని ఉన్న ఆ పేపరంతా శీను చదివాడు.
"అక్కడ చదువు జెప్తారు. శీనుని ఆడికి పంపుదాం. మనమందరం ఈడికి కావాల్సిని య్యన్ని కొనిద్దాం" అన్నాడు.
వీరిగాడి ప్రపోజల్‌కి ఏకగ్రీవ ఆమోదం లభించింది.

* * *

ఉదయం పదకొండు గంటలు. నాల్గు రోజుల తర్వాత వర్షోధృతి తగ్గింది.
ఐదు రోజులుగా మబ్బుల మాటున దాగిన సూర్యుడు ఒక్కసారిగా తన ప్రచండ ప్రతాపాన్ని పృథ్విపై చూపసాగాడు.
గూళ్లొదిలిన పక్షులు సంతోషపు కేరింత లతో, ఆకాశంలో నులివెచ్చని సూర్య కిరణా లకి చలి కాచుకుంటూ హాయిగా ఎగురుతు న్నాయి.
స్తంభించిన జన జీవన ప్రవంతి చైతన్య వంతమైంది.
రైళ్ల రాకపోకలతో రైల్వేస్టేషన్, యాంత్రిక జన జీవనానికి అలవాటు పడ్డ జనం ఉరుకులు పరుగులతో బిజీగా మారింది.
ఆరు గంటలు ఆలస్యంగా చిత్తూరు ప్యాసింజరొచ్చింది.
రైల్లోంచి దిగిన ప్రయాణికులతో ప్లాట్ ఫారం సందడిగా ఉంది.
శీను, రాజు, రాహుల్, జాన్సన్ రైలు దగ్గర తిరుగుతున్నారు.
రాహుల్ "పాలిష్... పాలిష్" అంటుంటే...
శీను, "సార్... కూలి... సార్.... పెట్టెలు మోసుకొస్త..." అనీ ప్యాసింజర్లెంట పడ్తున్నాడు.
నారాయణ టక్కు టక్కున చంకల కింద కర్రల్ని కదిలిస్తూ రైలు దగ్గర వ్యాపారం కోసం వస్తున్నాడు.
నారాయణని చూసి పరుగెత్తుకుంటూ రాబోయిన శీను, తన ముందు నడుస్తున్న వాళ్ల మాటలు విని, తన పరుగు వేగానికి ఎవరో బ్రేకు వేసినట్టు ఆగిపోయాడు.
"ఏందే... గౌరమ్మా! పద్దున్నే తిరుపతి కొచ్చి బస్టాండు, రైలు స్టేషన్‌కి రెండుసార్లు తిప్పితివి. యాడే నీ కొడుకు. పది రోజు లబట్టీ ఊళ్ళన్నీ తిప్పుతుండావు గానీ నీ కొడుకు జాడ తెలీకపాయె. అసలు ఆడు బతికున్నాడో లేదో" అన్నాడు సాంబయ్య.
గౌరమ్మ చివాల్న సాంబయ్య వేపు తిరిగి "నీ నోరు పాడుగాను. ఆడిమీద నీకు రవ్వం త కన్నప్రేమ కూడా లేదు! నీకు కష్టంగా ఉంటే వెళ్లిపో. అంతేగాని కడుపులో చిచ్చు

పెట్టే మాటలు మాట్లాడబాకయ్యా!" అంది ఏడుస్తూ.

"ఛూ! నీయవ్వ తాగిందంతా దిగిపో యింది. డబ్బులియ్యి. పొయ్యి మందేసు కొస్త" అన్నాడు సాంబయ్య కోపంగా.

"ఏంటయ్యా! మనం దేని కోసం ఈడ కొచ్చినాం. నువ్వేం జేస్తానంటన్నావు? సిగ్గు లేదు నీకు. నా దేర లెవ్వు"

"ఛీ! దోం... ఎప్పుడడిగినా ఇదే ఏడుపు. మర్యాదగా ఇయ్యి"

"నాదేర సార్లీలకే ఉన్నయ్యయ్యా" అని గౌరమ్మ బొడ్లో సంచీ తీసి, డబ్బులు తీస్తంటే చటుక్కున ఆమె చేతిలో సంచీ లాక్కుని.

"ఈణ్ణే కూచో" అనేసి సాంబయ్య వెళ్లబో యాడు.

గౌరమ్మ అతడి చేతిలో డబ్బుల సంచీ తిరిగి లాక్కోబోయింది. దాంతో రెచ్చిపో యిన సాంబయ్య గౌరమ్మ చెంపమీద లాగి కొట్టాడు. ఆ దెబ్బకి తూలి పడబోయిన గౌరమ్మ నిలదొక్కుకుని చుట్టూ చూసింది.

చుట్టూ ఉన్న మనుషులు తమనే చూస్తుంటే అవమానంతో బిక్క చచ్చిపో యింది. ఛీత్కారం, అసహ్యం ప్రతిబింబించే చూపులతో మొగుణ్ణి చూసింది.

అవేమీ పట్టించుకునే స్థితిలో లేని సాంబయ్య కాళ్ళు బయటకు సారా కొట్టుకి బయల్దేరాయి.

గౌరమ్మని నిస్సత్తువ ఆవహించింది. కళ్లెంట కారుతున్న కన్నీళ్లను కొంగుతో వత్తుకుంటూ అక్కడే కూలబడింది.

"దేవుడా! ఎంకన్న సామీ! నా కొండ యాడున్నా సల్ల గుండేట్టు చూడు సామీ! ఆడవుపిస్తే కొండకి నడిచొస్తాం సామీ." అని కూచున్న చోటే దణ్ణాలు పెట్టింది తన్నుకొస్తున్న దుఃఖం మధ్యలోనే.

గౌరమ్మని చూస్తున్న శీను తనమీద ఆమె కున్న ప్రేమను, తన కోసం ఆమె ఆరాటాన్ని చూసి కదిలిపోయి "అమ్మా" అని అనబో యాడు. కాని అంతలోనే ఆ పిలుపును గొంతులోనే అదిమేసుకుని ఆగిపోయాడు.

తండ్రి ప్రవర్తనలో మార్పు లేదు. ఇప్పుడు తను కన్పిస్తే ఇంటికి లాక్కెళ్తాడు. తన చదువు సాగుతుందో సాగిలపడు తుందో తెలీదు. బలవంతంగా తనని కూలికి పంపుతాడు. వెళ్ళనంటే తంతాడు. తల్లికి మళ్లీ తన చదువు కారణంగా తిట్లు, తన్నులు రోజూ ఇంట్లో రభసా తప్పవు.

శీను పసి మనసులో పరిపరి విధాల ఆలోచనలు. కంటెదురుగా తల్లి. తన కోసం పరితపిస్తూ అల్లాడిపోతోంది. ఆ మాతృ హృదయంలోని వేదనను పోగొట్టడం క్షణంలో పని. కాని, కాని దానివల్ల ఆమెకు కలిగే ఆనందం శాశ్వతం కాదు. మళ్లీ మళ్లీ గతంలో ఎదురైన అనుభవాలు బాధలతో సతమతం కాక తప్పదు. తల్లి దగ్గరకు వెళ్ళాలా వద్దా? ... ఎటూ తేల్చుకోలేని సందిగ్ధత శీను మనసులో.

దూరం నుంచి తల్లిని ఆమెకి కన్పించ కుండా చూస్తున్నాడు.

ఎముకల గూడుపై చర్మం కప్పినట్టు కన్పి స్తున్న తల్లిని చూసి శీను మనసు తల్లడిల్లి పోయింది. కానీ ఇప్పుడు తనెళ్లిపోతే తన లక్ష్యాన్ని తనే అలక్ష్యం చేసినట్టవుతుంది అను కున్నాడు.

ఏమైనా సరే తల్లిదండ్రులకి కన్పించగూడద నుకున్నాడు. మనసుకి కష్టంగా ఉన్నా కఠినం చేసుకుని తల్లినే చూస్తున్నాడు. అంతలోనే తాగి తూలుకుంటూ వచ్చాడు సాంబయ్య.

"ఏడవమాకే గౌరీ. ఆడు ఈణ్ణే ఉండా డంట. ఆడ ఓ పిల్లకాయ చెప్పిండు. వస్తే చూపిస్తానంటుండు. రా! పోదాం" అన్నాడు తడబడే మాటలతో.

"ఈణ్ణే ఉన్నడా? నా కొండా! శీనయ్యా! నాకు దెల్చు... నా బంగారు కొండకి... ఏం గాదని" లేచి మొగుడు వెనకాలే బయటికె ళ్తున్న గౌరమ్మ మొహంలో ఆనందం చూసి ఆవేదనగా కళ్ళు తుడుచుకున్నాడు శీను.

ఆ రోజంతా పిల్లల్నెవర్నీ కలవకుండా, ఎవ

రికీ కన్పించకుండా ఒంటరిగా గడిపాడు.

18

"అరేయ్! రాజూ, శీనూ, రమేషూ పోలీసు లొస్తన్నార్రా! పదండి.. పదండి" అంటూ వీరిగాడు పరుగెత్తుకుంటూ వచ్చాడు.

"ఆగాగు. పోలీసోల్లొస్తే భయం దేనికి. జేబులు కత్తిరిస్తివా? " అన్నాడు రాజు.

"అది కాదెహె. మన గోవిందుల్నా... ఆణ్ణి పోలీసులు కొట్టుకుంటూ స్టేషన్‌కి లాక్కుపోయార్రా!"

"ఎందుకు? "

"కోనేరు దగ్గర గంజాయి ప్యాకెట్లమ్ముతా ఉంటే వచ్చి పోలీసులు పట్టుకపోయారు" నింపాదిగా అన్నాడు వీరిగాడు.

"అట్లనా! అసలే ఆడు కుంటోడు. పోలీసులు చావగొడ్తారేమో" అన్నాడు రాజు.

"నేనెప్పుడూ చూళ్ళేదే ఆణ్ణి" అన్నాడు శీను.

"మొదట్ల ఈణ్ణే ఉండేవోడు. తర్వాత బస్టాండుకి బోయిండు. పోయినేడాది గూడా ఆణ్ణి పోలీసులు పట్టుకపోయిండ్రు"

"అసలాడికి గంజాయి పొట్లాలెవురిచ్చినారు? ఎవురి కమ్ముతాడు? " అనడిగాడు శీను.

"ఇంకెవుడు, రాజన్‌గాడే. ఇంతకు ముందు కోటిగాడికిచ్చి అమ్మించేవోడు. ఆడు మానేసి ఎల్లిపోయిండు. ఇప్పుడూ ఆడే అయ్యుంటాడు..." అన్నాడు రాజు.

"రాజన్ ఎవరు? ఏడుంటాడు? "

"ఆడు అరవోడు. పెద్దోడే మెడ్రాసులో, ఇక్కడా గంజాయి అమ్ముతా ఉంటాడు. కోనేరు దెగ్గర చేరే గంజాయి గుంపులన్నింటికీ ఆ రాజన్‌గాడే అమ్ముతా ఉంటాడు"

"గోవిందుగాడు శానా మంచోడురా! ఆణ్ణెలాగైనా ఇడిపించాల" అన్నాడు జాన్సన్.

"వీరన్నా మనం బోయి పెద్దన్నకు, శంకర్ దాదాకి చెప్పి ఇడిపించుకొద్దాం" అన్నాడు శీను.

"ఆళ్లూ దొంగనాయాళ్ళే, ఆ రాజన్‌గాడి తొత్తులే. ఆళ్ళేం హెల్పు చెయ్యరు"

"ఆ రాజన్ యాడుంటాడో, తెల్సా? "

"ఏమో ఆడెప్పుడొస్తాడో, ఎప్పుడు బోతాడో..."

"వీరన్నా! నువ్వెళ్లి పెద్దన్నకి ఓసారి చెప్పిరా అన్నా!" అన్నాడు రాజు.

"నువ్వూ వొస్తవా? "

"పద" ఇద్దరూ వెళ్లారు.

జాన్సన్, శీను, మస్తాన్ హోటల్ సందులో కెళ్లారు.

"ఈడెవురున్నారు? "అన్నాడు జాన్సన్.

**వీరన్నా మనం బోయి పెద్దన్నకు, శంకర్ దాదాకి చెప్పి ఇడిపించుకొద్దాం అన్నాడు శీను. ఆళ్లూ దొంగనాయాళ్ళే, ఆ రాజన్‌గాడి తొత్తులే. ఆళ్ళేం హెల్పు చెయ్యరు అన్నాడు వీరిగాడు**

## బీరు చేసే మేలు...

బీరుతో ఆ లాభాలు, ఈ లాభాలు అంటూ అప్పుడప్పుడు వైద్య పరిశోధకులు బీరుబాబులను హుషారెత్తించేస్తుంటారు. దాంతో వారు మరిన్ని బాటిళ్ల డక్కన్లు తీసేసి ఖాళీ చేసేస్తుంటారు. ఇప్పుడు మరో లాభాన్ని ప్రకటిస్తున్నారు పరిశోధకులు. బీరు తాగితే ప్రొస్టేట్ కాన్సర్ తగ్గించుకోవచ్చంటున్నారు.

బీరులో ఉండే 'గ్జాంతోహ్యూమోల్' అనే పదార్థం ప్రోస్టేట్ క్యాన్సర్ రాకుండా కాపాడటానికి; వచ్చిన వారిలో అది పెరగకుండా ఉండటానికి దోహదపడ్తుందని ఒరెగాన్ యూనివర్సిటీ శాస్త్రజ్ఞులు ఇటీవల కనుగొన్నారు. ఈ గ్జాంతో హ్యూమోల్ ప్రోస్టేట్ గ్రంథి చుట్టూ ఉన్న కణాల్లో ఉండే ప్రత్యేకమైన ప్రోటీన్‌ని నియంత్రిస్తుంది. ఈ ప్రోటీన్‌లో ప్రోస్టేట్ క్యాన్సర్‌కి సిగ్నల్ స్విచ్‌లా పనిచేస్తుంది. గ్జాంతో హ్యూమోల్ మొక్కలకు చెందిన ఫ్లేవనాయిడ్స్ గ్రూపుకు చెందినది. ఇది ప్రోస్టేట్ గ్రంథి కణాల్లో ఉండే ప్రోటీన్‌ని నియంత్రించడంతో క్యాన్సర్ కణాలు మరణిస్తాయి.

అయితే 'నేతి బీరకాయలో నెయ్యిలా' బీరుసీసాల్లో ఈ గ్జాంతోహ్యూమోల్ శాతం చాలా తక్కువగా ఉంటుంది. కొంతలో కొంతైనా మేలు జరగాలంటే రోజుకి 17 బీర్లు లాగించాలట.

హమ్మో... కష్టమే కదూ. అందుకే ఇపుడు మార్కెట్లోకి గ్జాంతో హ్యూమోల్ అధిక శాతంలో ఉండే బీరు, ఇతర ఆహార పదార్థాలు రాబోతున్నాయట. ఇంకేం, ఇప్పటినుంచే ఎదురు చూద్దాం.



"చెప్తారా! కాలేజి దగ్గర కెళ్దాం"

"సరే, పద"

కాలేజీ గేట్లు మూసున్నాయి.

"ఇక్కడే ఉందాం. కాసేపట్లో కాలేజీ పిల్లలు బయటికొస్తారు. ఆళ్లతో మాట్లాడదాం. ఆ రోజు మస్తాన్‌గాడి పని బట్టిం దీళ్ళే"

ఇద్దరూ అరగంట అక్కడే కూచున్నారు.

లంచ్ టైంలో కాలేజీ గేట్లు తెరిచారు. పిల్లలు బయటికొస్తుంటే, వాళ్లలో కొంచెం ఎత్తుగా, పర్సనాలిటీగా ఉన్న పిల్లల దగ్గర కెళ్ళి శీను ఇంగ్లిషులో మాట్లాడాడు.

"రా! పోదాం!" అని ఇద్దరు పిల్లలు రెండు సందుల అవతలున్న ఓ ఇంట్లోకి తీసుకెళ్లారు.

అక్కడ అంతకు ముందు రాజు విషయంలో మస్తాన్‌తో గొడవపడి డబ్బులిప్పించిన లా చదువుతున్న విద్యాసాగర్ కన్పించాడు.

శీనుని గుర్తు బట్టేసరికి గోవిందు విషయమంతా చెప్పాడు.

"నేనిప్పుడు కాలేజీకి బోతున్నాను. సాయంత్రం రండి, స్టేషన్‌కి పోదాం" అన్నాడతడు.

శీను, జాన్సన్ మళ్లీ స్టేషన్ కొచ్చారు.

"ఆకలేస్తోంది" అన్నాడు జాన్సన్.

"నువ్విణ్లే ఉండు... నేనెళ్లి తెస్తాను" అనెళ్ళి అన్నం తెచ్చాడు శీను. ఇద్దరూ బెంచీమీద కూచుని తింటుంటే-

వీరిగాడు రెండులోకొస్తున్న రైలు ఫుట్ బోర్డు మీద నుంచుని వస్తూ కన్పించాడు.

"వీరన్నా" అని గట్టిగా పిలిచాడు శీను.

శీనుని చూసి రైలు దూకి పరుగెత్తుకుంటూ వచ్చాడు వాడు.

"మాట్లాడినావా పెద్దన్నతో"

"ఆళ్ళేం పట్టించుకోలేదురా శీనూ"

"సర్లే! ఆ రాజన్‌గాడు ఏడున్నడో తెల్సుకున్నవా? "

"బద్రిగాడు కల్సిండు. ఆణ్ణి అడిగాను. సాయంత్రం రాజన్‌గాడు బస్టాండు దగ్గరున్న నాయర్ టీ కొట్టుకి వస్తాడంట. ఐదు గంటల్నుంచి, ఏడు వరకు ఆణ్ణే ఉంటడంట"

"నీకు రాజన్ తెల్సా!"

"శానాసార్లు జూసిన"

"అయితే నువ్వూ మాతో రా! అన్నం తిన్నావా? "

"ఆc... రైల్లో ఒకాయన రొట్టెలిచ్చిండు"

ముగ్గురూ కల్సి పోలీస్ స్టేషన్‌కి బయలు దేరారు.

స్టేషన్లో వీరిగాడికి పరిచయమున్న కానిస్టేబుల్ దారిలో కన్పించాడు.

వీరిగాడు అతడితో మాట్లాడాడు. అంతే. పది నిమిషాల్లో ముగ్గుర్నీ గోవిందున్న సెల్ దగ్గరకి తీసుకెళ్ళాడతడు.

బక్కగా గాలొస్తే పడిపోయేట్టున్న గోవిందుని శీను చూడటం అదే మొదటిసారి.

వీరిగాణ్ణి, జాన్సన్‌ని చూసిన గోవిందు కుంటుతూ వచ్చి, "అన్నా! నన్ను కొట్టి చంపేస్తున్నారన్నా నన్ను తీస్కబోండి" అంటూ చొక్కా ఎత్తి దెబ్బల్ని చూపించాడు ఏడుస్తూ.

బాధగా అన్పించింది ఆ దెబ్బల్ని చూసిన ముగ్గురికి.

"రండ్రా! ఎంతసేపు మంతనాలు... ఎస్సై వస్తే మిమ్మల్నీ లోపలేస్తాడు" అని కానిస్టేబుల్ అరవటంతో ముగ్గురూ బయటికి నడిచారు.

"రేయ్! ఇలారారా! లోపలికి పంపించాగా! చిల్లరేది! గార పట్టిన పళ్ళికిలిస్తూ కానిస్టేబుల్ వీరిగాణ్ణి అడిగాడు.

ముష్టోళ్ళలోకెల్ల ముష్టిమహారాజులా కనిపించాడా కానిస్టేబుల్ శీను కళ్ళకి.

వీరిగాడు కానిస్టేబుల్‌కి చిల్లరిచ్చి బయటికొచ్చాడు. సాయంత్రం వరకూ ముగ్గురూ స్టేషన్లో గడిపి, నాలుగ్గంటలకి విద్యాసాగర్ దగ్గరకొచ్చారు.

విద్యాసాగర్ గోవిందునుంచిన పోలీస్ స్టేషన్ ఎస్సైతో మాట్లాడాడు.

* * *

సాయంత్రం ఐదు గంటలు.

బస్టాండు దగ్గర సందులో నాయర్ టీ కొట్టు దగ్గరికి ఓ వ్యక్తి వచ్చాడు. పొట్టిగా, నల్లగా, పెద్ద పొట్ట, గుబురు మీసాలతో, లుంగీ పైకి మడిచి కట్టుకుని చేతిలో చిన్న బ్యాగుతో వచ్చాడు.

నాయర్ అతణ్ణి చూస్తూనే... "వా... రాజన్... చాయ వేణుమా? "

"వేండా, మలాయ్ పాల్" అని ఓ మూల కూచున్నాడు.

పదేళ్ళ కుర్రాడొచ్చి రాజన్ కూచున్న టేబుల్ మీద మంచి నీళ్ళుంచాడు.

రాజన్ జేబులో నుండి డబ్బులు తీసి, ఆ కుర్రాడి కిస్తూ "గోల్డ్‌ఫ్లాక్ పేకెట్, వెత్తలైపాక్ కొండువాడా!" అని ఆ కుర్రాడికి వంద రూపాయల నోటు ఇచ్చాడు.

వీరిగాడు శీనుతో కలిసి రాజన్ కూచున్న చోటుకి వచ్చాడు.

"వణక్కం రాజన్ అన్నా"!

"ఓ... నీయా? శానా దినాల్నుండీ కాణం. ఏడికి బోయినావప్పా? " అన్నాడు నాయర్ తెచ్చిచ్చిన పాలు తాగుతూ.

"పెద్దన్న చెప్పిన పన్లోకి పోతా వుంటిని, అందుకే అవుపట్లేదన్నా"

"సరి, ఎన్న విషయం? "

"అన్నా! ఈడు కొత్తగా వచ్చిండన్నా! పేరు శీను. నువ్వు సాయం జేస్తే..." అని తలగోక్కున్నాడు వీరిగాడు.

"వేండాప్పా! అంద గోవిందు పయ్యన్ని పోలీసులు పుడిచ్చిట్టాంగ. వాండు నా పేరు పోలీసులకి సెప్పినాడంటే... మన పని అంతదా!"

అంతలో సిగరెట్లు, తమలపాకులు తెచ్చిన కుర్రాడు వచ్చాడు. వాడు రాగానే రాజన్ బ్యాగు తెరిచి.

"ఇందుల వెయ్యప్పా!" అన్నాడు.



వాడు సిగరెట్లు, తమలపాకులతో బాటు చిల్లర, మరో రెండు వందల నోట్లు అందులో వేశాడు.

రాజన్ మొదట ఇచ్చిన వంద నోటు మడతలో గంజాయి ప్యాకెట్ పెట్టి ఆ కుర్రాడికివ్వటం, వాడు బయట ఉన్న కస్టమరు కిచ్చి, రెండు వందల నోట్లు తెచ్చిపడేయటం శీను, వీరిగాడు చూశారు.

రాజన్ బ్యాగు మూసి జేబునుండి ఐదు రూపాయల బిళ్ళ తీసి ఆ కుర్రాడికిచ్చాడు.

తనకేమీ తెలీదన్నట్టు రాజన్ మొహంలోకి చూస్తున్న శీనుతో "సదువుకుంటివా?" అనడిగాడు.

"ఏడు సదువుకున్నాను"

వీరిగాడు వైపు తిరిగి, "పిల్లకాయ కొత్తవాడుగ ఉండాడు. ఎట్ల నమ్ముదునప్పా!" అన్నాడు రాజన్.

వీరిగాడు "నా మీద నమ్మకం లేదా?" అనంటే తమలపాకులకి సున్నం రాసి, వక్కేసి, మడిచి నోట్లో పెట్టుకుని నములుతూ...

"ఏమోనప్పా! దినాలు సరిగ్గా లేవు. ఎవుర్నీ నంబ ముడియల"

"నువ్వే అట్లంటే, ఎట్లన్నా!"

రాజన్ సిగరెట్ వెలిగిస్తుంటే...

నాయర్ వచ్చి చెవిలో ఏదో చెప్పాడు.

"ఒరు నిమిషం ఇరు" అని లేచి బ్యాగు తీసుకుని నాయర్ హోటల్ కిచెన్లోకి వెళ్ళాడు.

పది నిమిషాల తర్వాత బయటికొచ్చి,

"వేండా తంబీ! మీ రెళ్ళండి" అని వీరిగాడితో చెప్పి, "నల్ల కస్టమర్లుంటే కొండువాడా! సరకు రెడీగా వుండాది" అన్నాడు.



"రాజన్! తొందరగా ఇవ్వు"

"ధుడ్లు దెచ్చినవా? "

"ఇప్పుడు డబ్బుల్లేవు. ఈ ఉంగరం ఉంచు. రేపు డబ్బులిచ్చి తీసుకుంటాను" అంటున్న ఆ కుర్రాడి చేతికి ఉన్న మరో రెండుంగరాలు, బ్రాస్‌లెట్ అతడు ధనవంతుల బిడ్డ అని చెప్పకనే చెబుతున్నాయి.

రాజన్ ఉంగరాన్ని చూసి....

"ఇంద" అని నాలుగు పొట్లాలు బ్యాగు నుంచి తీసిస్తూ, "రేపు సాయంత్రం దుడ్డు రాలేదంటే ఇది నీ సేతికి రాదు" అన్నాడు.

"ఆ సంగతి నాకు తెల్సు.ఇంకో రెండియ్యి" అన్నాడా కుర్రాడు.

"లేవప్పా!"

"ఉంటయ్ తియ్యి" అనేసరికి.

"లెవ్వంటూనే..." బతిమాలించుకుని ఇచ్చాడు.

మెరిసే కళ్ళతో పొట్లాలవైపు చూస్తూ రెండంగల్లో బయటికెళ్ళాడా కుర్రాడు.

రాజన్ మళ్ళీ తమలపాకులేసుకుని నములు్తూ శీనుతో వచ్చిన వ్యక్తి వైపు తిరిగి, "ఒరు ప్యాకెట్.. రెండు వందలు" అన్నాడు.

"పది కావాలి... రేటు తగ్గించు" అన్నాడా వ్యక్తి.

"మనకాడ బేరాలుండవ్. ఒకే రేటు, ఒకే

"సరే! అన్నా" అని శీనుతో వీరిగాడు బయటికొచ్చాడు. సరిగ్గా ముప్పయి నిమిషాల తర్వాత-

శీను ఓ వ్యక్తితో రాజన్ దగ్గరకొచ్చి-

"వీరన్న నిన్ను కలవమని చెప్పినాడు. ఈయనకి కావాలంట" అన్నాడు.

"వాడెక్కడ? " అన్నాడు మీసాలు దువ్వుతూ.

"పెద్దన్న పిలుసుకుపోయినాడు"

"ఈయనెవురు? "

"నాకు తెలీదు... వీరన్న నీదేరకి తోడ్కొపొమ్మండు" అన్నాడు శీను. అంతలో మరో కస్టమరొచ్చాడు. అతనికి పదిహేనేళ్ళుంటాయి.

మాట. అవళదా!" అన్నాడు మరో కస్టమరు కోసం చూస్తున్నట్టు.

"సరే తొందరగా ఇవ్వు"

"నువ్వు ఎవరి దగ్గరా నాను ఇచ్చినట్లు సెప్పగూడదు. ఆఁమా... నువ్వేమి సేస్తా ఉంటావు? " అన్నాడు పెద్ద బేరం దొరికినట్టు మొహం పెట్టి.

"స్టూడెంట్ ని"

"సరి, ఉళ్లవా? " అని నాయర్ హోటల్ వెనక్కి తీసుకెళ్ళాడు.

అక్కడ చీకటిగా ఉన్న చిన్న గది. చుట్టూ వంట పాత్రలు. చిన్న లైటు వెలుగుతోంది.

బ్యాగు నుంచి గంజాయి ప్యాకెట్టు తీసి పట్టుకుని, "దుడ్లు తియ్యి" అన్నాడు రాజన్.

స్టూడెంట్ డబ్బులివ్వబోతుంటే హఠాత్తుగా వెనకాల్నుంచి పెద్ద టార్చిలైటు రాజన్ మొహంమీద పడింది.

"యారప్పా! నాయరూ!" అరిచాడు రాజన్.

వెనకనుండి వచ్చిన పోలీసులకి రాజన్ని పట్టుకోవటం ఏమంత కష్టం కాలేదు. అంత సమీపంలో పోలీసులు ఉండడంతో పారిపోవ డానికి కూడా అవకాశం చిక్కని రాజన్ చేతు లకు సంకెళ్ళు బిగుసుకోక తప్పలేదు.

"ఏరా! ఏంట్రా ఇది? కేరళ టీ పొట్లాలు అమ్ముతున్నానని చెప్పి గంజాయి అమ్ముతు న్నావా? " అని చేతిలో బ్యాగు లాక్కున్నారు పోలీసులు. అతడి కాళ్లమీద లాఠీతో రెండు ఇచ్చుకున్నారు.

రాజన్తోబాటు విద్యాసాగర్ బయటికొ చ్చాడు.

"పూటకో చోటు మారుస్తూ గంజాయి అమ్ముతూ పిల్లల్ని చెడగొట్టావంట్రా? తియ్యి రా... ఇంకెక్కడ దాచావో" అంటూ కాళ్ళమీద మళ్ళీ లాఠీతో చరిచారు.

"మా సంగతి మీకు తెల్వాదు. అనవశ్యం గా..." అని రాజన్ ఏదో అనబోతుంటే...

"ముందు జీపెక్కరా!" అంటూ బలంగా ముందుకు తోసి పోలీసు వ్యాన్లోకి ఎక్కిం చారు.

పోలీస్స్టేషన్లో కేసు బుక్ చేసుకుని, నార్కో టిక్స్ చట్టం కింద రాజన్ని జైల్లో ఉంచి, అతడి నుండి పాతికవేల రూపాయల గంజాయి స్వాధీనం చేసుకున్నారు.

గోవిందుని విడిచిపెట్టారు. వాడు బయటికి వచ్చేసరికి రాత్రి పది దాటింది.

"సార్! మీరు చేసిన హెల్ప్కి థ్యాంక్స్ సార్' అన్నాడు విద్యాసాగర్తో శీను.

"నువ్వే ఎక్కువ శ్రమ పడ్డావురా! ఏదైనా పని బడితే రా. చాలా మంచిపని చేశావు" అని విద్యాసాగర్ ప్రశంసించి వెళ్ళిపోయాడు.

రోడ్డు మీద నడుస్తుంటే- "అన్నా! నేనూ మీతోనే ఉంటాను. తీస్కబోండి" ఏడుస్తూ అన్నాడు గోవిందు.

"వద్దు. పెద్దన్న, శంకర్దాదాలకి తెలిస్తే, నిన్ను మళ్ళీ చావగొడ్తారు. పోలీసులే వదిలే శారని చెప్పు" అన్నాడు వీరిగాడు.

"నీకిక భయం లేదురా! రోజూ మేం వొచ్చి చూసెళ్తాం" అని గోవిందుని బస్టాండ్లో వదిలి స్టేషన్కొచ్చారు శీను, వీరిగాడు, జాన్సన్.




కార్పొరేషన్, మున్సిపల్, పంచాయతీ ఎన్నికల పుణ్యమా అని పనీపాటా లేకుండా తిరిగే బ్రోకర్లకి చేతినిండా పని, జేబుల్నిండా మనీ. ఎక్కడ మీటింగులు జరిగినా, జనసమీ కరణ కోసం డబ్బు, మద్యం విచ్చలవిడిగా వచ్చిపడుతూ సామాన్య మానవుడి జీవితం 'చైతన్యం'తో వెలిగిపోతోంది. పల్లెల్లో, పట్ట ణాల్లో, సందుల్లో, గొందుల్లో ఎక్కడ చూసినా (అ)రాజకీయమే.

ఓటుకి నోటు, మాటకి మద్యం.

పెద్దన్న, శంకర్దాదా, బద్రిగాడు వంటి

పిల్లచేపలు ఎదిగి, బలిసిన పెద్ద చేపల్నీ..., వాళ్ళ ఛోటా, మోటా నాయకుల్ని అంటుకు పోయారు. రాజకీయాల్లోకి ప్రవేశించాలను కునే ఔత్సాహికులు అందులోనే ఊరిపోయిన వినాయకులు, పార్టీలు, పోటీలు, ముఠాకక్షలు, హత్యలు, దహనకాండలు, కుటుంబ తగాదాలు- ఒకటేమిటి కనీవినీ ఎరగని అరాచకీయాలకు రాజకీయాలు ఆలవాలమై ఆంధ్ర దేశం అల్లకల్లోలంగా ఉంది.

ఎలక్షన్ల పుణ్యమా అని ప్లాట్‌ఫారం మీద తిరిగే వీధి పిల్లలకి కూడా అన్న, పాన, మద్యాలకి కొదవలేకుండా సాగిపోతోంది.

ఎన్నికల ప్రచారంలో వింత వింత పోకడలు. ఒక్కో పార్టీది ఒక్కో రకం. గ్రూపులు, వ్యక్తులు, యుక్తులు, కుయుక్తులు... కనీవినీ ఎరుగని రీతిలో నాయకులు సిగ్గు బిడియాలొదిలి ఓటర్ల చేతులు, గడ్డాలు పట్టుకుంటూ భిక్షాటనలు. ఇంకా కొన్నిచోట్ల ఆడా మగా తేడా చూడకుండా కాళ్ళు పట్టుకుంటూ... ఖరీదైన కార్లలో తిరిగే నాయకులు మురికివాడల్లో పాదయాత్రలు చేస్తుంటే, పిచ్చి పేదవాడు మాత్రం తన దగ్గరున్న ఓటు మీద నమ్మకం లేక, వందలకి అమ్ముకుంటూ, ఆ తర్వాత వేలల్లో, లక్షల్లో వివిధ రూపాల్లో పరిహారం చెల్లిస్తూ, తన దుర్భర జీవితానికి తనే కారణమౌతున్నాడు.

ఈ రాజకీయ హోరు, జోరుతో ఎన్నో అల్లకల్లోలాల మధ్య మున్సిపాలిటీ, కార్పొరేషన్ల ఎన్నికలు ముగిశాయి. ఇపుడు పంచాయితీల వంతొచ్చింది. ఎన్నికలేవైనా తంతొక్కటే అన్నట్టు ప్రచారాల్లో వికృత చేష్టలకి పరాకాష్ఠగా... టాప్ లెస్ కార్లమీద చిన్న పిల్లలకి జాతీయ నాయకుల వేషాలేసి, మోసాలు చేస్తున్న వాళ్ళకోసం ఓట్లు ప్రచారం చేయించడం కొసమెరుపు.

* * *

"అరేయ్! పెద్దన్నా!" అంటూ వచ్చిన మనిషి అతడి చెవిలో ఏదో చెప్పాడు. అప్పుడు రాత్రి పదకొండు దాటింది.

మందు మత్తులో ఎగిసిపడిన మగువ మత్తును ఒదిలించుకుని, రిలాక్స్‌గా పడుకున్న పెద్దన్న "అదెంత పనన్నా... గంటలో తోల్కొస్త" అని వచ్చిన వాణ్ణి పంపేసి బస్టాండుకొచ్చాడు.

బెంచీ కింద గాఢనిద్రలో ఉన్న వేణుని చూసి నిద్ర లేపాడు. పెద్దన్నని చూడగానే వాడికి నిద్రమత్తొదిలింది. ఏడుపు మొహం పెట్టాడు.

వేణు బస్టాండ్‌లో తిరుగుతుంటే పెద్దన్న చూసి అడుక్కోవటం నేర్పి, వాడి సంపాదనలో వాటా కొట్టేస్తూ, ఇవ్వకపోతే ఆ పసివాడు హడలిపోయేలా చేస్తూ తన కనుసన్నల్లో ఉంచుకున్నాడు.

"ఆ దెబ్బలేంట్రా?" అన్నాడు వేణు మొహానికున్న దెబ్బల్ని చూసి.

"అడుక్కుంటాంటే... ఎంకటిగాడు కిందకి నెట్టాడు... బోర్లాపడితే ఈ దెబ్బలు తగిల్నాయి" తడబడుతూ చెప్పాడు.

"పద, మందు పూయిస్త" అని ఆటోలో ఎక్కించుకుని మధ్య మధ్య మరో పదిమంది పిల్లల్ని ఆటోలో ఎక్కించి భూపతి పార్టీ ఆఫీసుకి తీసుకెళ్ళేసరికి అర్ధరాత్రయింది.

అక్కడ పిల్లలకి మేకప్ చేసేవాళ్ళు రెండు గంటల్లో తమ పని పూర్తిచేశారు.

అద్దాల్లో తమ మొహాలు చూసుకున్న పిల్లలు... సినిమా నటుల లెవెల్లో ఫీలవ్వసాగారు.

తెల్లవారగానే ప్రచారం మొదలయింది. వేణుది గాంధీ వేషం... నెహ్రూ, పటేల్, వివేకానంద... పొట్టిశ్రీరాములు... చివరికి పి.వి.ని కూడా వదలకుండా ఆయన వేషమూ వేయించారు.

వీధి బాలలకు రోజుకి ఏభై రూపాయలిస్తామని పెద్దన్న, శంకర్ దాదా వంటి బ్రోకర్లు రైల్వేస్టేషన్, బస్టాండ్లో తిరిగే వీధి పిల్లలకి వళ్ళంతా సిల్వర్ పెయింట్ మేకప్ చేయించి నాయకుల వేషాలేసి, ఉదయం నుండి సాయంత్రం వరకు వ్యాన్ల మీదెక్కించి

ప్రచారం చేయిస్తున్నారు.

"ఏంటండీ ఇది... అడిగే వాళ్ళెవరూ లేరని... దేశం కోసం ప్రాణాలర్పించిన నాయకుల వేషాలేసి... ఇలా ఓట్ల కోసం ప్రచారం తప్పుగదా!" అనుకున్నవాళ్ళున్నారు. "పెద్దగా అరవబోకు... ఆళ్ళిన్నారంటే... నీ అంతు జూస్తారు" అని అలాంటి వాళ్ల కామెంట్లకు బ్రేకులు వేసిన వాళ్లూ ఉన్నారు.

పిల్లలు ఉదయం నుండి సాయంత్రం వరకూ నిలబడి, నిలబడి కాళ్ళు పీక్కుపోయి అల్లాడుతున్నా వదలకుండా పగలూ, రాత్రి ప్రచారం చేయిస్తున్నారు. ఆ పిల్లలు పెట్టింది తిని, పూసుకున్న రంగులు కడుక్కోకుండానే నిద్రబోతున్నారు.

తమ నాయకుడి తరఫున వాళ్లతో ప్రచారం చేయించి రోజుకి తలా ఇర్వై రూపాయిలిచ్చే వాడు పెద్దన్న.

చివరిరోజు వేణుకి జ్వరం. అయినా వదలకుండా, మందులేసి మరీ ప్రచారం చేయించారు.

ఈ అపర నాయకుల్ని జనం విడ్డూరంగా చూస్తున్నారే గానీ 'అదేమని' అడిగే ధైర్యం చెయ్యకపోవడం విడ్డూరం. పత్రికలు, టి.వి. ఛానెళ్ళూ ఈ విడ్డూరాన్ని మరింత విడ్డూరంగా రాసి, చూపించాయేగాని ఆపు చేయించే ప్రయత్నాలు చెయ్యకపోవడం శోచనీయం.

ప్రచారం ముగియటంతో వేణు చేతిలో ఏభై రూపాయలు పెట్టాడో వ్యక్తి. పక్కనే ఉన్న పెద్దన్న ఆ ఏభై లాక్కుని "ఆడికి పది చాల్లే" అని పంపించేశాడు. వేణుకి జ్వరం ఎక్కువైంది. ఆ వేషంతోనే అడుగులో అడుగేసుకుంటూ బస్టాండుకి బయల్దేరాడు.

మెయిన్‌రోడ్డుకు రెండు సందుల అవతల ఉన్న చిన్న హోటల్ దగ్గర నిలబడ్డ వీరిగాడు అటువైపొస్తున్న శీను, జాన్సన్, సూరి, రాహుల్‌లని పిలిచి వడలిప్పించి, టీ తాగిస్తున్నాడు.

పెద్దన్నకి సహాయపడ్డ వీరిగాడు తనకు ముట్టిన డబ్బుతో కొన్న కొత్త బట్టల్లో మెరిసిపోతున్నాడు.

ఆ సంతోషంలోనే టీపార్టీ ఇస్తున్నాడు.

అంతలో ఆ సందులోకి గాంధీ వేషంలో ఉన్న వేణు అరుస్తూ పరుగెత్తుకుంటూ వస్తున్నాడు.

"అరే అటు చూడండ్రా!" అని సూరి అనడంతో అందరూ తలలు తిప్పి అతడు చూపించినవైపు చూశారు. అందరి దృష్టీ అటువైపు తిరిగింది. వేణు వెనక రెండు కుక్కలు తరుముకొస్తున్నాయి.

భయంతో పరుగెత్తి, పరుగెత్తి, రోడ్డుమీదున్న గుంటలో కాలుపడి బోర్లాపడ్డాడా కుర్రాడు.

టీ గ్లాసులు కిందపడేసి శీను, జాన్సన్ వేగంగా వెళ్లి వాడిమీదకు లంఘించబోతున్న కుక్కల్ని తరిమారు.

వీరిగాడు ఆ పిల్లాణ్ణి లేవదీశాడు. వాణ్ణి చూస్తూనే- "అరే! నువ్వంట్రా... వేణూ!" అన్నాడు ఆశ్చర్యంగా. వేణు మాట్లాడే స్థితిలో లేడు. చేతులకు, కాళ్ళకి దెబ్బలు తగిలి, వంటి మీదున్న సిల్వర్ పెయింట్ మీద నుండి రక్తం కారుతోంది.

"నీకితను తెల్సా? " అనడిగాడు శీను వీరిగాడితో.

"మనోడే. బస్టాండ్లో ఉంటాడు" అంటూనే అంతా కలిసి వేణుని టీస్టాల్ దగ్గరకి తీసుకువచ్చారు.

"మంచినీళ్లు" అన్నాడు వేణు బెంచిమీద కూచుని ఏడుస్తూ. నీళ్ళు తాగాక సూరి టీ ఇచ్చాడు.

బిక్కమొహంతో టీ తాగుతున్న వేణుని చూసి అక్కడున్న కస్టమర్లలో ఒకడు... "ఈ పిల్లకాయిని ఎలక్షన్ల ప్రచారం కోసం వాడుకుని, చూడు... కనీసం వంటి రంగు కూడా కడక్కుండా వదిలిపెట్టారు" అనేసరికి హోటల్లో కప్పులు కడుగుతున్న బాలకార్మికుడు బేలగా చూశాడు.

అందర్లోకి చిన్నవాడైన వేణుని రైల్వేస్టేషన్లో తమతోబాటే ఉంచుకున్నారు శీను, జాన్సన్.

ఎలక్షన్లలో సంపాదించిన డబ్బు చేతినిండా

ఉండటంతో పెద్దన్న, శంకర్ దాదాల బ్యాచంతా ఆనందసాగరంలో మునిగి తేలుతూ స్టేషన్ వైపే రావటం మానేశారు.

పిల్లలంతా హాయిగా గాలి పీల్చుకుంటూ స్వేచ్ఛగా తిరుగుతున్నారు.

* * *

వేణు మితభాషి. ఎవరైనా అడిగితే బదులిస్తాడు. పాత పాటల్ని పాడుతుంటాడు. పాట విన్పిస్తే చాలు బ్రేకు వేసినట్టు ఆగిపోతాడు. ఎప్పుడూ ఏదో ఆలోచించే బాలమేధావిలా ఉంటాడు.

పెద్దన్న నేర్పిన విద్య 'అడుక్కోవటం'. అది అసహ్యమని, ఆత్మగౌరవాన్ని దెబ్బతీస్తుందని తెలియని వయస్సు. ఆకలేస్తే అడుక్కోవటం, వచ్చినదాంతో కడుపు నింపుకోవటమే వాడికి తెల్సిన విద్య.

ఆరోజు రాత్రి శీను పక్కన పడుకున్నాడు వేణు.

రాహుల్ హిందీ పాటందుకున్నాడు.

"దిల్ ఐసే... కిసే... సే...

పక్కనే పడుకున్న వేణు,

"ఎదురీతకు అంతం లేదా...

నా మదిలో రేగే గాయం మానిపోదా..."

అని అదే పాటని తెలుగులో పాడాడు.

"అచ్చా.. అరే... బచ్చా... బహూత్ అచ్ఛా, గావో, గావో" అన్నాడు రాహుల్.

అంతే, సిగ్గుతో ముడుచుకుపోయి పడుకున్నాడు వేణు. అది చూస్తున్న శీను, "వేణూ! నీకు పాటలంటే ఇష్టమా? " అనడిగాడు.

"ఊc"...

"సర్లే పండుకో, నిద్రొస్తోంది" అని కళ్ళు మూసుకున్నాడు శీను.

"శీనూ" పిల్చాడు వేణు.

"ఏంట్రా? "

"మరీ.... మరీ... మా అమ్మ... నాన్న, చెల్లి గుర్తొస్తున్నారు" అన్నాడు ఏడుస్తూ...

"ఏడవమాకు, మేమున్నాంగా నీకు. మీ అమ్మా నాన్న ఏ ఊళ్ళో ఉంటారు".

"మాది... మంటాడ. సదువుకుంటానంటే స్కూలుకి పోనీకుండా మా నాన్న నన్ను కమతానికి హైదరాబాదు పంపాడు" అన్నాడు.

"కమతమంటే..."

"పని చెయ్యటానికి...."

"ఊc ఏమైంది? "

"హైదరాబాదు వెళ్లా... ఆళ్లింట్లో అన్ని పన్లు చెయ్యాలి. పిల్లల్ని స్కూలుకి తీసికెళ్లాలి. అయ్యగారి కారు తుడవాలి, ఇల్లూడవాలి, తుడవాలి, కూరలు తేవాలి"

"డబ్బులిచ్చేవోళ్ళా? "

"మా అమ్మానాన్నలకి ముందే ఇచ్చేశారు"

"మరి నీకు? "

"అన్నం పెట్టారుగా"

"మరెందుకొచ్చేశావు? "

"జ్వరం వస్తే పనిచెయ్యలేదని కొట్టారు. అందుకే చెప్పకుండా మా ఊరెళ్ళిపోయాను. వాళ్లు వెతుక్కుంటూ మాంటడొస్తే మళ్లీ మా



## తిండి కోసం మారొద్దు

ఒకనాడు ఇంగ్లాండు నుంచి వచ్చిన ఒక స్త్రీ మహాత్ముణ్ణి కలుసుకుంది. దేశం నలుమూలల నుంచీ బాపూజీ అభిమానులు ఆయనకు పంపిన అనేక రకాల పండ్లను చూసి ఆమె ఎంతో ఆశ్చర్యపడింది.

"నిత్యం ఇటువంటి రుచిగల పండ్లు దొరుకుతూ ఉంటే, నేను యోగినిగా మారడానికెంత మాత్రం సందేహించను!" అందామె. అందుకు గాంధీజీ చిరునవ్వుతో, "నువ్వు నీ ఆహారాన్ని మార్చడం కోసం యోగినివి కానక్కరలేదు" అన్నారు.

నాన్న పంపేశాడు. దారిలో తప్పించుకుని ఇంటికి పోకుండా ఇక్కడికొచ్చేశా"

కన్నవాళ్ళే కసాయి వాళ్ళలా పిల్లల బాల్యాన్ని కాలరాస్తుంటే ఆదరించి ఎవరు అక్కున చేర్చుకుంటారు? కసి, కోపం, ద్వేషం హు... ఎవరిమీద?... ఎందరో ఇలాంటి అభాగ్యులు. వీళ్ళలో నిద్రిస్తున్న తెలివితేటలు... ఇలా ఆకలి మెతుకుల కోసం అల్లాడుతూ అంతరించిపోవాల్సిందేనా?

స్థాయి లేకపోవచ్చు.. పరిస్థితులు కారణం కావచ్చు.. బతుకు తెరువు ఆసరా కోసమే కావచ్చు.. వ్యసనాల కోసం కావచ్చు.. ఇంక దేనికోసమైనా కావచ్చు.. పసిహృదయాల్లో ప్రాణం పోసుకునే ఊహల ఊపిరిని కర్కశంగా నొక్కేస్తున్న అమ్మా నాన్నలూ... మీ బాల్యాన్ని మీ తల్లిదండ్రులిలా బజార్న పడేస్తే... మీరివ్వాళ అమ్మా నాన్న లయ్యేవాళ్ళేనా? !

ఇవన్నీ ఆ పసి మనసుల్లో ఇవీ అని తెలిసీ తెలియక సుళ్లు తిరిగే ఆలోచనలు... ప్రశ్నలు. వాళ్ల సొదలకి, వ్యధలకి కొన్ని అక్షర రూపాలు మాత్రమే.

* * *

రెండో నంబర్లో ప్యాసింజరు రైలు దగ్గర పెట్టెలు మోస్తున్నాడు శీను. వెనకే వేణు బ్యాగు మోస్తున్నాడు.

నడుస్తున్న వేణు కాళ్లముందు సగం తిన్న జామకాయ వచ్చి పడింది. మట్టి కొట్టుకుంది. వేణు ఆశగా వంగి తీసుకోబోతుంటే, ఓ పిల్లాడు పరుగెత్తుకుంటూ వచ్చి "నాది... నాది" అని లాక్కోబోయాడు. శీను వెనక్కి తిరిగి చూశాడు.

ఇంతలో ఆ పిల్లాడి తల్లొచ్చి జాంకాయ తీసి, "తిను" అని వేణుకిచ్చింది. దాని నిండా మట్టి అంటుకుంది.

"నీకు మంచిదిస్త" అని కొడుకుని తీసుకెళ్లింది. తినబోతున్న వేణుతో "దాన్ని పారెయ్ తినమాకా" అన్నాడు శీను.

వేణు జాంకాయ పారెయ్యబోతుంటే వెనకనుంచొచ్చి వాణ్ణి పట్టుకున్నాడు పెద్దన్న.

అంతే! అతణ్ణి చూస్తూనే వేణు గజగజ వణికిపోయాడు.

"ఏడికి బోతివిరా! నీ కోసం బస్టాండంతా ఎతికొస్తా ఉన్నా... ఈడికొచ్చావా? "

ఆ మాటకి ఏడుపందుకున్నాడు వేణు.

"ఎందుకురా! ఏడుస్తుండావు... ముయ్" అంటున్న పెద్దన్న గొంతు విని శీను షాకయ్యాడు.

"అన్నా! కూలి దింపి వస్తమన్నా" అన్నాడు శీను.

"నేనూ అటే వస్తన్నరా! రండి..." అని వేణు చేతిలో బ్యాగు తీసుకుని, మరో చేత్తో వేణుని పట్టుకుని స్టేషన్ బయటికొచ్చాడు.

పెద్దన్నని చూసి సూరి, వీరిగాడు, బద్రిగాడు, వెంకటేశు పరుగెత్తుకొచ్చారు.

"ఏందన్నా! ఇన్ని దినాలూ అవుపళ్లేదు. ఏడికి బోతివి" అన్నాడు వీరిగాడు.

"పిల్లకాయల దగ్గర డబ్బులు వసూలవుతున్నయ్యా? లేదా? "

"ఈ ఇసయంలో వీరన్న కరెక్టన్నా" అని జేబులో డబ్బుల్దీసి పెద్దన్నకిచ్చాడు.

"సరె...సరె... ఎళ్లండి. రా!రా! వేణూ బస్టాండుకి పోదాం" వేణు మళ్లీ ఏడుపు అందుకున్నాడు.

"నాకిక్కడే బాగుంది. ఈళ్లతోనే ఉంటాను"

"ఎంట్రా! ఎదవ నాయలా! ఇక్కడుండటం నీ ఇష్టమేనా? ఇది నీ బాబుగాడి ఇల్లనుకున్నవా. నడు...నడు" కసురుతున్నట్లుగా అని బలంగా ముందుకు నెట్టాడు.

"ఒగ్గెయ్యన్న!ఆడు ఈణ్ణే మాతో ఉంటాడు" అన్నాడు శీను బతిమిలాడుతున్నట్టు.

ఫట్ మని ఈడ్చి శీను చెంపమీద కొట్టి పళ్లు పటపటమని కొరుకుతూ "జాగ్రత్త" అన్నాడు కోపంగా పెద్దన్న, వేలు చూపుతూ. అతడి చూపులో నాకే ఎదురు చెబుతావా అన్న ఆగ్రహ భావం.

ఇంతలో "ఏరా! పెద్దన్నా" అంటూ వాళ్ల దగ్గరకు వచ్చాడో వ్యక్తి. "ఎంతసేపురా!

నీయవ్వ. పార్టీనే నీ దగ్గరికి రప్పించుకుంటివి గదరా!" అన్నాడా వ్యక్తి. ఎత్తుగా, నల్లగా, బలంగా ఉన్న అతని పేరు చలపతి. బస్ స్టాండ్లో, రైల్వేస్టేషన్లో పారిపోయొచ్చిన పిల్లల్ని ట్రాప్ చేసి చిన్న చిన్న హోటల్లో, బ్రాందీ షాపుల్లో పనికి కుదిర్చి వాళ్ల కనీసావసరాలకి మాత్రమే డబ్బిస్తూ, వాళ్ల కష్టాన్ని కాజేస్తూ బతికేస్తున్న పెద్ద బ్రోకర్.

ఇప్పుడు పెద్దన్న వంటి చిన్న బ్రోకర్లని తయారుచేసి కూచున్న చోటికే డబ్బులు రప్పించుకుంటున్న చలపతిని చూస్తే ఎవరికైనా హడల్ పుడుతుంది.

పోలీస్‌స్టేషన్లు మొదలు రాజకీయ నాయకులు, బద్మాష్‌ల నుండి బడా మనుషుల వరకూ పరిచయాలు పెంచుకుని సమస్యల్ని సృష్టిస్తూ, వాటిని మళ్లీ తనే పరిష్కరిస్తూ, రెండువైపులా కమీషన్లు వసూలు చెయ్యటంలో దిట్ట చలపతి. అమ్మాయిల్ని అమెరికా పంపుతామని, ముంబయికి అమ్మేస్తున్న ముఠాతో సంబంధముందనే అభియోగంపై చలపతికి పోయిన సంవత్సరం ఆర్నెల్లు జైలుశిక్ష పడింది. ఆ శిక్ష అనుభవించి వచ్చీ రావడంతోనే మళ్లీ ఆ అజెండానే మొదలెట్టాడు.

అతణ్ణి చూస్తూనే పెద్దన్న వినయం ప్రదర్శిస్తూ "అన్నా. నమస్కారమే. అన్నా! నేను చెప్పలా! ఇడుగో ఈడే వేణు. ఎర్రగా పిల్లకాయ బాగుండలా..." అన్నాడు చలపతి ముందు చేతులు పట్టుకుని నిలబడి.

అదే సమయంలో అక్కడికి ఇన్నోవా కారొచ్చి ఆగింది. అందులో... రాజకీయ నాయకుల్లా కనిపిస్తున్న ఇద్దరు వ్యక్తులున్నారు. ఆ కారులో నుంచి చలపతిని తలపించే మరో రూపం దిగింది. వాడు ఇస్మాయిలు. ఎత్తు అంతగా లేకపోయినా, భారీ కాయం భీతి కలిగించే పిల్లి కళ్లు. దిగుతూనే...

వాళ్లందరినీ చూస్తూ
బెదిరిపోయిన లేడిపిల్లలా
నుంచున్న వేణుతో,
మాతో వస్తావా! భయపడకు...
మేం నిన్ను పెంచుకుంటాం.
చక్కగా చదివిస్తాం.
సరేనా అన్నాడు

"ఏమైందిరా! చలపతీ!" అన్నాడు, హుంకరిస్తున్నట్లుగా ఉందతడి స్వరం.

"అంతా ఒ.కే... మామూ! ఈడే ఆ పిల్లకాయ"

ఇన్నోవా వెనక మరో కారొచ్చి ఆగింది. అందులోంచి మరో ఇద్దరు వ్యక్తులు దిగారు. వాళ్లు డీసెంట్‌గా ఉన్నారు. శీను, రాహుల్, బద్రిగాడు, వెంకటేశు, సూరి, జాన్సన్, వీరిగాడు అంతా విషయమేంటో తెలియక బిక్క మొహాలేసుకుని అయోమయంగా వాళ్లనే చూస్తూ నుంచున్నారు. చలపతి, ఇస్మాయిల్‌లను చూసి రైల్వే పోలీసులు "నమస్తే అన్నా!" అని వెళ్లిపోయారు.

ఇన్నోవా కారు డోరు తీసి వేణుని లోపలున్న వాళ్లకి చూపిస్తూ... "అన్నా! వీడే నేజెప్పిన పిల్లోడు" అన్నాడు చలపతి. కార్లో కూచున్న వాళ్లు వేణుని పరిశీలనగా చూశారు.

వాళ్లందరినీ చూస్తూ బెదిరిపోయిన లేడిపిల్లలా నుంచున్న వేణుతో, "మాతో వస్తావా! భయపడకు... మేం నిన్ను పెంచుకుంటాం. చక్కగా చదివిస్తాం. సరేనా. రా! ఇదుగో ఇది తీసుకో" అంటూ స్వీట్ బాక్సు ఇచ్చాడు ఒక వ్యక్తి.

భయపడిపోయిన వేణు "నాకొద్దు" అన్నాడు బిగ్గరగా ఏడుస్తూ... "అరే! చుప్! ఏడ్వమాకు. సారుకి పిల్లల్లేరు. నిన్ను మొన్న బస్టాండ్లో జూసినారంట. నిన్ను పెంచుకుంటారంట. మంచిగ చదివిస్తరు, బట్టలు, పుస్తకాలు... అన్నీ ఇస్తరు. నిన్ను బాగా చూసుకుంటారు. మంచిగ బతకొచ్చు పోరా" బెదిరిస్తున్నట్లు, అనునయిస్తున్నట్లు అన్నాడు పెద్దన్న.

రెండో కార్లోంచి దిగిన వ్యక్తులు ఆ మాటలకి ఆశ్చర్యపోతున్నారు.



శిఖరం ఉపరితలం



మబ్బుల్ని దాటిన శిఖరాగ్రం

అమెరికా తొలి జాతీయ చిహ్నంగా గుర్తింపు పొందిన బృహత్ శిలా శిఖరమిది. బెల్లె ఫోర్చె నదికి అభిముఖంగా ఉన్న ఈ శిఖరాన్ని 'డెవిల్స్ టవర్' అని వ్యవహరిస్తున్నారు. అడుగు భాగాన వెయ్యి అడుగులు, శిఖర భాగాన 250 అడుగులు వ్యాసం కలిగి ఉన్న ఈ శిఖరం ఎత్తు 865 అడుగులు. ఇది ఒకప్పుడు అగ్ని పర్వతం. అది పేలినా పెద్దగా బయటకు విరజిమ్మబడని లావా పైనుంచి కిందకు ఘనీభవించిందని, లక్షలాది ఏళ్లుగా వాతావరణ మార్పులతో పై భాగమంతా కోతకు గురై ఈ రూపం దాల్చిందని భూగర్భ నిపుణుల అభిప్రాయం. ఇంతకూ ఇది ఏకశిల కాదు. వందలాది రాతి వరుసల సమూహ సంచయం.

"ఇస్మాయిల్!... వెనక డోరు తెరు... సూరన్న చూస్తాడు" అన్నాడు చలపతి. ఇస్మాయిల్ డోరు తీశాడు.

కార్లోంచి దిగిన ఆజానుబాహుడి పేరు సూర్యప్రసాదరెడ్డి. సెల్‌లో ఎవర్తోనో మాట్లాడుతున్నాడు. సెల్ ఆఫ్ చేసి...

"ఏరా! వస్తావా? " అని జేబులోంచి ఫైవ్ స్టార్ చాక్లెట్ తీసిచ్చాడు.

అక్కడున్న పిల్లలకిమ్మని స్వీట్ బాక్సులిచ్చాడు ఇస్మాయిల్‌కి.

కారు లోపల కూచున్న వ్యక్తి పేరు చంద్రశేఖర్‌నాయుడు. ఆయనకి అనేక ఫ్యాక్టరీలున్నాయి. పలుకుబడి హైద్రాబాదు నుండి హస్తినాపురి వరకు పుష్కలంగా ఉంది.

సూర్యప్రసాదరెడ్డితో కొన్ని ముఖ్యమైన సంస్థల్లో వాటాలున్నాయి.

రాజకీయం, అరాచకీయం బాగా ఔపోసన పట్టిన వ్యక్తులిద్దరూ.

సూరన్నా, చంద్రశేఖరనాయుడూ కార్లో కూచుని ఏదో మాట్లాడుకున్నారు.

ఐదు నిమిషాల తర్వాత సూరన్న కిందికి దిగి,

"ఇదుగో! చంద్రం..." అంటూ రెండో కార్లోంచి దిగి నిలబడి ఉన్న వ్యక్తిని పిలిచాడు. "లాయర్ని పిలిచి, లీగల్‌గా అడాప్ట్ ఫార్మాలిటీస్‌కి ఏర్పాట్లు చెయ్యి" అన్చెప్పాడు.

"ఓ. కే.... సార్" అన్నాడతడు.

చంద్రం పక్కన ఉన్న రెండో వ్యక్తి మాత్రం ఇంకా ఆశ్చర్యంగానే చూస్తున్నాడు. వేణు "నేనుండను... నేనుండను" అన్నాడు పెద్ద పెట్టున ఏడుస్తూ. పెద్దన్నకు వాడి ఏడుపు చిరాకు కల్గించింది.

"ఒరే ఎదవ నాయాలా! ఏడుపు ఆపుతావా! రెండు ఇచ్చుకోమంటవా? " అన్నాడు చెయ్యెత్తి బెదిరిస్తూ.

అంతలో చలపతి అతణ్ణి అడ్డుకుంటూ...

"ఒరేయ్! అట్లనేనా పిల్లలకి నచ్చజెప్పేది" అన్నాడు వారిస్తున్నట్లు.

చలపతి అంత సౌమ్యంగా మాట్లాడటం, తనను అడ్డుకోవడం పెద్దన్నకు చెప్పలేనంత ఆశ్చర్యం కల్గించింది.

"అది కాదన్నా..." అని ఏదో అనబోయాడు.

చలపతి "ఆగు" అన్నట్టు సౌంజ్ఞ చేస్తూ వేణు దగ్గరకొచ్చి, వాణ్ణి తన దగ్గరకి తీసుకుని, అనునయిస్తున్నట్టు కళ్లు తుడిచాడు. కాస్త వొంగి, "అది కాదురా బాబూ? ఆ సారు వాళ్లు బాగా డబ్బున్నోళ్లు. నీలాంటి పిల్లకాయని పెంచుకోవాలని చూస్తాండారు. ఆళ్లకి నువ్వు బాగా నచ్చినావంట. నిన్ను బాగా చూసుకుంటారు. మంచి స్కూల్లో సదివిస్తారు... మరి... మరి... నీకు అమ్మా నాన్న దగ్గర ఉండాలని ఉండదా..." అనేసరికి.

ఆ మాటకి ఉంటుందన్నట్టు తలూపాడు వేణు.

"మరి అందుకే నువ్వు ఆళ్ళతో ఎళితే నిన్ను అమ్మా నాన్నల్లాగా చూసుకుంటారు. మంచి బట్టలిస్తారు. పెద్ద బంగళాలో దర్జాగా బతకొచ్చు నువ్వు. మంచి పిల్లోడివిగా. ఏడవకుండా,నా మాట విని సార్ వాళ్లతో వెళ్లు"

చలపతి మాటలు నమ్మాలో, నమ్మకూడదో తెలియటం లేదు వేణుకి. వాడికంతా భయంగా, అయోమయంగా ఉంది. తన నేస్తాల వంక చూశాడు. వాళ్లూ అలాగే బిత్తర చూపులు చూస్తున్నారు. వేణు తల తిప్పి కార్లలో వచ్చిన వాళ్ల వంక చూస్తున్నాడు. వాడు కాస్త మారాం తగ్గినవాడిలా కన్పించడంతో, చలపతి ఇంకా ఆలస్యం చెయ్యకూడదన్నట్టు "పద, పద. సార్ వాళ్లు నీ కోసం చాలా సేపట్నుంచి చూస్తాండారు" అంటూ గబగబా వేణుని తీసుకొచ్చి కారులో ఎక్కించాడు. పిల్లలు కాస్త దూరం జరిగారు.

"మాట్లాడినావా? " అన్నట్టు నాయుడు ఇస్మాయిల్ వేపు చూశాడు.

కళ్లతోనే బదులిచ్చాడు ఇస్మాయిల్.

కార్లో కూచున్న వేణు పెద్దన్నని చూస్తూ, "అన్నా నేనెళ్లను. ఇక్కణ్ణే ఉంటా" అని మళ్లీ ఏడుపు ఎత్తుకున్నాడు.

"ఏడవమాకురా! ఎల్లి మంచిగ సదూకో... మేమంతా లేమా? "

"వద్దులే పెద్దన్నా! ఆడు బయపడ్తుండు. ఈణ్ణే ఉంటడు" అని శీను అన్నాడు. వెంటనే వీరిగాడూ అందుకుని అదే మాట అన్నాడు. అంతే! శీను చెంపల్ని ఛట్‌ఛట్ మన్పించాడు పెద్దన్న. అవాక్కయి నిలబడ్డ పిల్లలెవరూ నోరు తెరవలేదు.

శీను చెంపల మీద వేళ్లముద్రలు బుసబుస పొంగాయి. వాడికి నక్షత్రాలు కన్పించాయి. కళ్లలో నుంచి జలజల కన్నీళ్లు రాలిపడ్డాయి.

"ఏందిరా! పెద్దన్నా గొడవ? " అన్నాడు చలపతి.

"ఏం లేదన్నా! పిల్లకాయలు దిగులు పడ్తా వుంటే..."

"సరె సరె, ఆళ్ళందర్నీ బిర్యానీ తినమను. ఇదిగో సూరన్న డబ్బులిచ్చిండు ఆళ్ళకియ్యి" అని రెండొందలిచ్చాడు చలపతి.

"తీసుకోంన్రా" అనిచ్చాడు పెద్దన్న.

ఇస్మాయిల్ కార్లో వేణుని ఎక్కించుకున్నాడు.

"చలపతీ! మీరొచ్చేయండి... ప్లేసు తెల్సుగా" అన్నాడు సూరన్న.

అప్పటికే సంధ్య చీకట్లు ముసురుకున్నాయి.

చంద్రం, ఇంకో వ్యక్తి అలాగే నిలబడ్డారు.

ఇస్మాయిల్ కారు దిగి చలపతి దగ్గరకి వచ్చాడు. ఇద్దరూ కల్సి పెద్దన్నని పక్కకి తీసుకెళ్లారు.

చంద్రం పక్కనున్న వ్యక్తి, అతణ్ణి ఇంగ్లిషులో... "నాయుడుగారికి ఇద్దరు పెద్ద పెద్ద పిల్లలే ఉన్నారు గదా! మరి పిల్లలు లేరంటారేంటి? "

"పిల్లలిద్దరూ పెద్ద పెద్ద ఉద్యోగాల్లో అమెరికాలో సెటిలయ్యారు. అందుకని..." అని చంద్రం అన్నాడు.

"నో! నో! ఇది నేను నమ్మను. ఇందులో ఏదో మతలబుంది" అన్నాడా వ్యక్తి. ఉంటే ఉండొచ్చేమోలే అన్నట్టు భుజాలెగరేశాడు చంద్రం.

వాళ్లు ఇంగ్లిషులో మాట్లాడుకుంటున్న ఆ మాటల్ని అప్పటివరకు ఆలకించిన శీనుకీ, ఇందులో ఏదో మోసం ఉందన్న అనుమానం బలపడ్డది.

"ష్! పెద్దగా అరవకు. ఆ ఇస్మాయిల్, చలపతి ఇటే వస్తున్నారు. వాళ్లు ఆవులించకుం



డానే పేగులు లెక్కేస్తారు. మనకెందుకీ పెద్దోళ్ళ విషయాలు. చెప్పింది చేసుకుపోవటమే" అన్నాడు చంద్రం పక్కనున్న వ్యక్తితో... ఇంగ్లిషులో.

అంతలో చలపతి, పెద్దన్న, ఇస్మాయిల్ రావటంతో పిల్లలు కాస్త దూరంగా జరిగారు.

"చంద్రం... నువ్వెళ్ళొచ్చు" అని సూరన్న చెప్పటంతో... మారు మాట్లాడకుండా చంద్రం, అతని పక్కన వ్యక్తీ బయల్దేరారు.

ఇన్నోవా కారు కదిలింది. చలపతి, ఇస్మాయిల్ మారుతి కారెక్కారు.

"మీరిక పోండ్రా! ఎళ్ళి రెండో నంబరుకి మెయిలొస్తాది పొయ్యి చూడండి" అని పెద్దన్న అంటుండగానే మారుతి కారు తోలే డ్రైవర్‌తో "లుంబినీ గెస్ట్ హౌస్‌కి పోనియ్" అని ఇస్మాయిల్ చెప్పటం శీను చెవినబడ్డది. పిల్లలు బయల్దేరారు. మారుతి కారు కదిలింది.




"వేణుగాడికి వెళ్ళటం ఇష్టం లేదురా" అన్నాడు జాన్సన్. వాడి స్వరంలో ఏదో దిగులు.

"అసలు మనలాంటోళ్లని చదివిస్తామనేదెవర్రా... ఆడన్నా బాగుపడనీ... రండి పోదాం. రెండులోకి రైలొస్తది" అన్నాడు వీరిగాడు బయల్దేరుతూ.

"ఆగండ్రా! అసలు ఆళ్ళెందుకు వేణుని తీస్కబోతున్నారో తెలుసా!" అన్నాడు శీను.

"పెంచుకుంటానికి, మంచిగ సదివించడానికి" అన్నాడు వెంకటేశు.

"కాదు" అని ఆగిపోయాడు శీను.

"మరి" అన్నారు ఇద్దరు ముగ్గురు పిల్లలు.

శీనుకి చెప్పాలో, చెప్పగూడదో అర్థంగాలేదు. ఒక నిమిషం అయోమయంగా మిత్రుల్ని చూస్తుండిపోయాడు.

"చెప్పరా" అన్నారు వాళ్ళు.

"అది కాదురా! ఆ తీస్కబోయే వాళ్ళకి పిల్లలున్నారంట. ఉంటే మళ్ళీ వేణునెందుకు తీస్కబోతున్నరు? " అని చంద్రం, అతని పక్కనున్న వ్యక్తి ఇంగ్లిషులో మాట్లాడుకున్నదంతా చెప్పాడు శీను. "ఇందులో ఏదో మోసం ఉందిరా" అన్నాడు చివరగా.

"ఆళ్ళు శానా పెద్దోళ్ళు. నువ్వేం ఇంటివో..." అన్నాడు వీరిగాడు. శీను మాటల్ని కొట్టిపారేస్తున్నట్లుగా.

మిగిలిన పిల్లలంతా అయోమయంగా చూస్తున్నారు

"నాకూ అనుమానంగానే ఉందిరా"... అన్నాడు సూరి

"అరేయ్! నీ అనుమానంతో బుర్రలు తిన మాక. పెద్దన్న విన్నడంటే ఊర్కోడు. పదండెహె" అని వీరిగాడు బయల్దేరబోయాడు...

"వీరన్నా! నా మాట ఇను. అంత పెద్దోళ్ళకి వేణుగాడే ఎందుకు గావాల్సొచ్చిండు. ఇందులో ఏదో పెద్ద మోసం ఉండాది... నీకు లుంబినీ గెస్ట్‌హౌసు తెల్సా? "

"ఇప్పుడదెందుకు"

"ఆళ్ళు ఆడకేబోతారంట. మనం ఆడికిబోయి... వేణు ఆడుండాడో లేదా చూసొద్దాం ముందు" అన్నాడు శీను.

"నాకు తెల్సుగానీ అది శానా దూరం" అన్నాడు వీరిగాడు.

"అయినా పోదాంరా. ఈ ఒక్కసారికి నా మాట ఇనండిరా" అన్నాడు శీను బతిమాలుతున్నట్లుగా. కాసేపు అవును, కాదు అనుకున్నాక పదేపదే శీను అంటున్న మాటల్లో నిజమేంటో తెలుసుకోవడమే మంచిదనుకున్నారు పిల్లలందరూ. "అరే! ఒకవేళ మోసమే ఉంటే అందరం కల్సి వేణుగాణ్ణి కాపాడాల, ఎవరమూ ఎనక్కిబోగూడదు" అన్నాడు శీను. అతడి స్వరం దృఢంగా ఉంది.

అందరూ కలిసి పరుగెత్తుకుంటూ బస్టాం

డుకొచ్చారు.

"అరేయ్! ఎవుర్దగ్గర ఎంతున్నాయో తియ్యండ్రా!" అన్నాడు వెంకటేశు.

అప్పుడు రాత్రి ఏడున్నర.

"ఆటోలో పోదాం" అన్నాడు వీరిగాడు.

రమేష్ ఆటో పిల్చాడు

ఎక్కడికెళ్లాలో వాళ్లు చెప్పడంతో ఆటో డ్రైవర్ "లుంబినీ గెస్ట్ హౌసా? ఎందుకురా మీరక్కడికి? " అనుమానంగా అడిగాడు.

"పెద్దన్న, చలపతన్న ఆణ్ణే ఉండారు. మమ్మల్నందర్నీ రమ్మని చెప్పినారు" అన్నాడు శీను తొణుకుబెణుకు లేకుండా. అంతే, ఆటో వాడు మాట్లాడకుండా స్టార్టు చేశాడు. బస్టాండు నుండి నాలుగు కిలోమీటర్లు వెళ్యాక, రోడ్డు దిగి మళ్ళీ ఓ కిలోమీటరు లోపలికెళ్ళాక-

"ఊc ఆపెయ్" అన్నాడు వీరన్న. పిల్లలంతా దిగారు. ఆటో వెనక్కెళ్లింది.

"ఏంటి... అడవిలోకి తెచ్చావు" శీను అడిగాడు

"అరవమాకండ్రా! కొంచెం లోపలికి బోతే కన్పిస్తది" శబ్దం చెయ్యొద్దని సైగచేస్తూ పిల్లలందర్నీ రెండు నిమిషాలు నడిపించాడు వీరన్న.

"అదుగో... ఆడ లైట్లవుపడ్తండాయే, అదే లుంబినీ గెస్టవుసు"

లైట్లెలుగుతున్నాయి. గెస్టుహౌస్ ముందు ఇన్నోవా కారు కన్పించింది.

"మీరంతా ఈణ్ణే ఉండండి. నేనూ, వీరన్న బోయి చూసొస్తాం" అన్నాడు శీను.

పిల్లలంతా మౌనంగా రోడ్డు పక్కన కూచుని వెళ్తున్న వీరిగాణ్ణి, శీనుని చూస్తున్నారు.

గెస్టుహౌస్ వెనక నుండి గోడ పక్కగా వెళ్లాడు శీను. వీరిగాడు అతణ్ణి వెనకాలే అనుసరించాడు.

గోడలు ఎత్తుగా ఉండటంతో మనుషులు కనబడ్డం లేదుగానీ మాటలు విన్పిస్తున్నాయి. గెస్టుహౌస్‌ముందున్న లాన్‌లో పక్కన గోడ అవతల నుంచి సూరన్న గొంతు విన్పించింది.

"అరేయ్! ఇస్మాయిల్... ఈ విషయం బయటికి తెలిస్తే మీడియావాళ్లు మనల్నొదలరు. మనం సిమెంట్ ఫ్యాక్టరీ కట్టబోయే విషయం శానా మందికి తెల్సు. అందుకే ఈ సంగతి మూడో కంటికి తెలీకుండా జాగ్రత్తపడాల. అనుకున్న ప్లాను ప్రకారం పకడ్బందీగా జరిగిపోవాల. తేడా వస్తే... తెల్సుగా!"

"సూరన్నా! నా సంగతి నీకు దెల్వదా? "

"ఇస్మాయిల్! ఇంకో పెగ్గేస్కోరా!"

అక్కడ మందు తాగుతున్నారని శీను గ్రహించాడు.

"వద్దన్నా!" అంటూనే గ్లాసందుకున్న ఇస్మాయిల్, "అన్నా! ఎన్ని గంటలకన్నా" అడిగాడు.

"సరిగ్గా మూడు గంటలకి లేచి, మూడున్నరకి గెస్టుహౌస్ ముందున్న తోట దాటి మన సైటుకి వెళ్తాం. 4.00 గంIIలకి ముహూర్తం"

"అన్నా! ఆడ మన మనుషులెవరన్నా ఉంటారా? "

"మనం తప్ప మరెవ్వరూ ఉండరు. ఎట్టోడు అక్కడుంటాడు"

"పిల్లకాయ ఏడున్నాడన్నా!"

"ఈణ్ణే... లోపల గదిలో తొంగున్నాడు. బాగా తిన్పించినం. నిద్ర బోవటానికి మాత్రే సినాం" చెప్పాడు చలపతి.

శీను వెనక్కి తిరిగి "పద పోదాం" అన్నాడు నెమ్మదిగా.

ఇద్దరూ శబ్దం రాకుండా అడుగులో అడుగు వేసుకుంటూ అవతలికొచ్చేశారు. అలాగే ఎలాంటి సవ్వడి లేకుండా నెమ్మదిగా వంగి వంగి నడుస్తూ రోడ్డు మీద మిత్రుల దగ్గరకొచ్చారు.

"రండెళ్దాం" అన్నాడు శీను గుసగుసగా.

"కన్పించాడా? " అంతే గుసగుసగా అడిగాడు జాన్సన్.

"బయటికి బోయి మాట్లాడుకుందాం" అని వీరన్న, శీను ముందుకు పరిగెత్తారు.

రోడ్డు మీదికొచ్చి కొంచెంసేపు నుంచుని అటువేపు వస్తున్న బస్సాపి ఎక్కారంతా.

* * *

"అరేయ్! శీను చెప్పింది కరక్టేరా!" అన్నాడు వీరిగాడు.

అందరిలో ఆశ్చర్యం... అంతే భయం... "అసలు విషయం ఏమై ఉంటుంది?" అడిగాడు సూరి.

"ఎవరికి తెలుసు... వేణును ఏదో చేయబో తుండారు. అది నిజం. ఏంటనేది తెల్వదు. వాడిని వాళ్ళ నుంచి ఏదో ఒక రకంగా తప్పించాలి" అన్నాడు శీను.

"ఏం చేద్దాంరా?" రమేష్ అడిగాడు భయం భయంగా.

"పోలీసులకి చెప్దాం" అన్నాడు వెంకటేశు.

"ఆళ్ళూ ఈళ్ళ మణుసులే. మనల్నే జైల్లో ఏస్తారు" అన్నాడు శీను.

"నువ్వూ, జాన్సన్, సూరి ఎళ్ళి బస్టాండ్లో ఉన్న పిల్లకాయల్ని తోడ్కొరండి. నేనూ, రమేషు, వీరన్న బోయి స్టేషన్లో పిల్లల్ని తోడ్కొస్తం... అందరం కలిసి ఆలోచిద్దాం. మళ్ళీ గంటకి అందరం ఈణ్నే కల్సుకోవాల. తొందరగా వచ్చెయ్యాల" అన్నాడు శీను.

సరిగ్గా గంట తర్వాత ఇరవైమంది పిల్లలు బస్టాండుకి చేరారు. వేణుకి ఏదో ప్రమాదం జరగబోతోంది. రక్షించాలనడంలో అందరి మాట ఒకటే అయినా మళ్ళీ గెస్ట్‌హౌస్‌కి వెళ్ల డం, వేణును ఎలా రక్షించడం అన్నదానిపై తలా ఒక మాట మాట్లాడారు.

"పిల్లకాయలం అంత పెద్దోళ్ళని, దుర్మా ర్గుల్ని ఎలా ఎదుర్కొంటాం" అన్నారు ఇద్దరు ముగ్గురు పిల్లలు.

"మనం ఏం చేయలేం" అని నిరుత్సాహప డ్డారు ఇంకో ఇద్దరు.

అనేక తర్జన భర్జనల అనంతరం ఓ అర్ధ గంట తర్వాత అందరూ ఒకే అభిప్రా యానికొచ్చారు.

గెస్ట్‌హౌస్ వైపెళ్ళే లారీలో అందరూ ఎక్కి మెయిన్‌రోడ్డు మీద దిగారు.

రాత్రి పన్నెండయింది.

"మీరెవురూ సప్పుడు చేయగూడదు. తెల్లా రగట్ట వేణుని యాడికైనా తీస్కబోతరో, ఏం చేస్తారో తెలీదు. అందుకే ఈ ఒక్కరోజు ఎవు రమూ నిద్రబోవద్దు. మేం మళ్ళొకసారి ఆడికి బోయి చూసొస్తం" అని శీను, వీరన్న బయ ల్దేరారు.

ఈసారి గెస్ట్‌హౌస్ దగ్గర రెండు కార్లు కన్పించాయి.

అంతకు ముందు వెళ్ళినట్లే నక్కి నక్కి నెమ్మదిగా వెనకవైపు వెళ్ళారు. ఏవో మాటలు సన్నగా విన్పిస్తున్నాయి. ఆ మాటలెవరివో అర్థం కావటం లేదు.

"శీనూ! గోడెక్కి చూద్దాం"

"ఎత్తుగుందన్నా"

"నువ్వు నామీదెక్కి చూడు" అని వీరిగాడు వంగున్నాడు. వాడిమీదెక్కి నుంచుని లోపలికి చూసిన శీను బిగుసుకుపోయాడు.

వరండాలో ఓ పక్క చంద్రశేఖరనాయుడు, సూరన్న, ఇస్మాయిల్, చలపతి, వాళ్ళెదురుగా గెడ్డం పెరిగి జుట్టు విరబోసుకుని పెద్ద పెద్ద బొట్లు పెట్టుకున్న వ్యక్తి ఏవో పూజలు చేయి స్తున్నాడు. చుట్టూ నిశ్శబ్దం.

గెడ్డం వ్యక్తి ఎదురుగా ఉన్న పుర్రె బొమ్మ తో పూజలు చేస్తున్నాడు.

ఆ దృశ్యం చూసిన శీను కొయ్యబారిపో యాడు. అక్కడ జరిగే తంతేమిటో వాడి చిన్న బుర్రకు అర్థం కాలేదు. కాని ఏదో పెద్ద ఘోరమే జరగబోతోందనిపించింది.

శీను బరువును భరించలేక, అతణ్ణి పడి పోకుండా ఆపడం ఇక తన తరం కాక "దిగరా" అన్నాడు వీరిగాడు నెమ్మదిగా. శీను వంగి చప్పుడు కాకుండా కిందకు దిగాడు. ఇద్దరూ కలిసి వచ్చిన రీతిలోనే రోడ్డుమీదికొచ్చారు. వీరిగాడికి చూసిందంతా చెప్పాడు శీను.

అతడు చెప్పిన దృశ్యాన్ని ఊహించుకుని అందరూ భయంతో వణికిపోయారు.

ఎవ్వరికీ కన్పించకుండా, అనుమానం

రాకుండా పొదల వెనక పిల్లలందరూ ఒక్క చోట బొమ్మల్లా, మౌనంగా బిగుసుక్కూచున్నారు.

"అరేయ్ శీనూ! ఏంట్రా ఇదంతా! ఆడ ఆళ్ళెందుకు అర్ధరేత్తిరి పూజలు సేత్తా ఉండారు. వేణుగాణ్ణి ఏం చెయ్యబోతున్నరు? " వీరిగాడు అన్నాడు.

పిల్లలందరి మనసులో ఏదో జరగబోతోందన్న భయం పట్టుకుంది.

"అదే అర్థం గావట్లేదు. మూర్తం ఏంటి? గెస్ట్‌హౌసు ముందుండే తోట దాటాక ఏముండాది? " అన్నాడు శీను.

పిల్లలంతా జాగ్రత్తపడుతూ గుసగుసగానే

"అరే! శీనూ! నీ అనుమానం నిజమేరా! ఆణ్ణి.. ఆణ్ణీ... మన వేణుగాణ్ణి ఆళ్ళేదో సేసేత్తారు" అన్నాడు వీరిగాడు భయంతో.

"నాకు బయంగా ఉందిరా వీరన్నా" అన్నాడు జాన్సన్ ఏడుపు గొంతుతో.

మిగతా పిల్లలదీ అదే పరిస్థితి.

"అరేయ్! శీనూ! ఏం చేద్దాం? "

"నాకూ అదే తెల్వటం లేదు" అన్నాడు శీను ఆలోచిస్తున్నట్లు.

ఎవ్వరికి తోచిన సలహా వాళ్ళు మెల్లగా చెబుతున్నారు.

అందరి మాటల ఆంతర్యం వేణుని కాపాడాలన్న తపన, దృఢనిశ్చయం.

## స్వరాజ్యం వాయిదా పడుతుంది



బాపూజీపై ఒక పుస్తకం రాసే తలంపుతో లూయిస్ ఫిషర్ 1946లో ఆయనను కలుసుకున్నాడు. ఫిషర్ మహాత్ముని గదిలోకి వెళ్లిన సమయానికి ఆయన రాట్నంపై నూలు వడుకుతున్నారు. ఫిషర్‌తో ముచ్చటిస్తున్నంత సేపూ ఆయన రాట్నం వడుకుతూనే ఉన్నారు. అది చూసి ఫిషర్, "గాంధీజీ! మీరు నాతో మాట్లాడేటప్పుడు ఒక గంటసేపు నూలు వడకడం ఆపు చేస్తే, స్వరాజ్యం రావడం ఆలస్యం అవుతుందా? " అన్నాడు.

"అవును. అప్పుడు నీ మూలాన స్వరాజ్యం ఆరు గజాలు వాయిదా పడుతుంది" అన్నారు బాపూజీ.

మాట్లాడుకుంటున్నారు.

"అడేముందిరా... కొండ... దానిముందు పేద్ద స్థలం. అంతే ఆడ సెట్లు కూడా లెవ్వు" అన్నాడు బద్రిగాడు.

"ఎట్టోడంటే ఎవురు? " మళ్ళీ శీను అడిగాడు.

"మణిసి పేరేమో? " వెంకటేశు అన్నాడు.

"కాదెహె! మా ఊళ్ళో గొడ్లని నరికే వోళ్ళని ఎట్టోళ్లంటారు" అన్నాడు బస్టాండు భూషణం.

అంతే! ఆ మాట వింటూనే పిల్లలంతా నోట మాటరానివాళ్ళలా బిగుసుకుపోయారు.

బద్రి, వీరన్న, బస్టాండు భూషణం పిల్లలందరిలోకీ కాస్త పెద్దవాళ్ళు.

"ఇప్పుడే బోయి మణుసుల్ని తోడ్కొద్దాం" అన్నాడు బద్రి.

"పోలీసులకి చెప్పొద్దాం" అన్నాడు భూషణం.

కోటిగాడి చేతికున్న వాచీలో టైం చూశాడు శీను. అర్ధరాత్రి ఒంటిగంట కావస్తోంది.

గెస్ట్‌హౌస్‌లో లైట్లు వెలుగుతున్నాయి.

"ఒక్క క్షణం..." అన్నాడు శీను, ఏదో గుర్తు తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తూ. అర నిమిషం తర్వాత, "ఒరేయ్ మొదటిసారి మన

మెళ్ళినప్పుడు మీడియా వాళ్ళు మనల్నొద లరు" అనే మాటలు ఇనబడ్డాయిరా. మీడి యా వాళ్ళంటే... పేపర్లోళ్ళు, టీవీవోళ్ళురా... అంటే ఆళ్లకు తెలీకూడని మా సెడ్డ పని ఏదో సేసేయబోతండారు. అందుకే ఆళ్లకి తెలిస్తే బాగుంటది. కాని మనకు పేపరోళ్లు, టీవీవోళ్లు

"ఏం చేత్తాడో తెల్వకపోయినా అతడికీ సంగతి చేరిస్తే...".

"వాడిదాకా ఈ కబురెలా ఎళ్తది".

"మనం యాడికి బోయెతందుకు టైము లేదు. అందరం బోతే వేణు నేమైనా సేసే త్తారేమో... ఊ... భూషణం నువ్వు ఇంకొ కళ్ళు బోకూడదా. మేం కన్నేసి ఉంచుతాం" అన్నాడు శీను.

"నిజమేరా. మీరు బోయి ఆ టీవీవోడి చెవిని ఏత్తే వాడే మైనా సేయగలడేమో"



వీరిగాడు అన్నాడు.

"ఇంతరేత్తిరేళ ఎలారా? "

"ఏదో తిప్పలు పడైనా ఎళ్లండిరా. తప్పదు. "

"సరే" అంటూ "ఒరేయ్ సూరిగా" అని పిలిచి చీకట్లో వాడేడ ఉన్నాడో చూడడానికి ప్రయత్నించాడు భూషణం.

"ఈడన్నా" అంటూ సూరిగాడు చెయ్యూ పాడు.

"పదరా మనం బోయొద్దాం-" అని శీను వంక చూసి "జాగర్తరోయ్" అన్నాడు

ఎవరూ తెల్వదే" అన్నాడు.

"శీనూ. నాకు టి.వి. వాడొకడు తెల్సు. వాడు బస్టాండు అవతలి రెండో సందులో ఉంటాడు" అన్నాడు బస్టాండు భూషణం.

"టీ.వి.లో ఏం చేత్తాడు. ఇల్లు తెల్సా"

"ఏమో ఏం చేత్తాడో తెల్దు. ఆ, ఇల్లు తెల్సు".

భూషణం.

"అలాగే" అన్నాడు తలూపుతూ శీను

"ఈ రాత్తిరి కాడ ఏం దొరుకుతాయో ఏమో. ఎట్టాగొట్టాగో పోండి. ఏ టైముకయి నా మీరిద్దరూ వోళ్లను ఎంటెట్టుకు రావాల" అన్నాడు.

భూషణం, సూరి తలూపి నెమ్మదిగా చప్పుడు చెయ్యకుండా మెయిన్ రోడ్డు వైపు నడిచారు.

వాళ్ళు వెళ్ళాక...

"ఆ తోట దాటాక ఏముండాదో... చూద్దాం. అందరం ఆడికే బోయి దాక్కుందాం. ఏం జరుగుద్దో చూద్దాం" అన్నాడు శీను.



"ఆడ ఏడ దాక్కుంటాం, సిన్న సిన్న తుప్పలు, పొదలు తప్ప సెట్లు గూడా పెద్దగా లెవ్వే. ఆళ్లకి అవుపడితే సంపేస్తార్రా!" అన్నాడు వీరిగాడు.

"అదంతా తర్వాత... ముందాడికి మనమంతా తొందరగా సేరిపోవాల. టేము లేదు. శీను చెప్పిందే బాగుండాది" అని బద్రి గాడు అనటంతో పిల్లలంతా లేచారు.

"అరేయ్, ఎవురూ సప్పుడు సెయ్యకుండా, రోడ్డెమ్మటా నడవండ్రా" అన్నాడు వీరిగాడు.

అంతే! నిశిరాత్రిలో సంచరించే ఏ దేవతలు ఆ పిల్లల మనసుల్లో ధైర్యం, సంకల్పం అనే ఆయుధాల్ని అందిస్తున్నారో తెలియదుగానీ, వాళ్ళంతా ఏదో సాధించాలనుకునే యోధుల్లా ముందుకు నడుస్తున్నారు. ప్రతి ఒక్కడూ నిలువెల్లా ఏదో పూనకం పూనిన వాడిలా ఉన్నాడు. ఆ స్థితిలో, ఆ సమయంలో ఏ మాత్రం భయం లేకుండా సాగుతున్న వాళ్ల ను చూస్తే ఎవరికైనా ఆశ్చర్యమేస్తుంది.

తెల్లని వెన్నెలకి నల్లని మబ్బులు అడ్డుపడ్తు న్నాయి.

ఉండుండి కీచురాళ్ళ శబ్దాలు, జంతువులు, పక్షుల శబ్దాలు...పిల్లల మనసుల్లో భయం పుట్టిస్తున్నా... వేణుని కాపాడాలన్న లక్ష్యం తో ముందుకి సాగిపోతున్నారు.

"అరేయ్ ఆగండ్రా! పాము" ముందు నడుస్తూ బద్రిగాడు ఠక్కున ఆగాడు.

అంతే! పిల్లలంతా బద్రి గాడి వెనక చేరి బిగుసుకు పోయి చూస్తున్నారు. నల్లని త్రాచుపాము, పొదలో నుంచి సర్రున వెళ్తోంది. బారెడు పొడు గున్న దాన్ని చూసి...

"మేం రాములా! వెనక్కి పోదాం" అన్నాడు రమేష్.

"నోర్మూసుకుని నడు" అని వీరిగాడు కాస్త కోపంగా వాణ్ణి ముందుకు నెట్టాడు.

తలొంచుకుని పిల్లలు వేగంగా నడుస్తు న్నారు.

సరిగ్గా అరగంట నడిచేసరికి...

"అబ్బా! కాస్త ఆగండ్రా! కాళ్ళు పీకుతు న్నాయి" అని రోడ్డుపక్కన పోసిన రాళ్లగుట్ట మీద కూచున్నారు బద్రిగాడు, వెంకటేశు.

శీను ఏదో ఆలోచిస్తున్నాడు.

అయిదు నిమిషాల రెస్టు తర్వాత... కోటి గాడి వాచీ చూసి, "లెంర్రా" అన్నాడు వీరి గాడు.

"ఆగండిరా.. అందరం రాళ్లు తీసుకుందాం. పట్టుకెళ్లగలిగినన్ని పట్టుకెళ్దాం. ఎందుకైనా ఉపయోగపడొచ్చు అన్నాడు శీను. వంగి నా ల్గు రాళ్లు అందుకున్నాడు. అందరూ అతణ్ణి అనుసరిస్తూ కొన్ని జేబుల్లో కుక్కుకున్నారు. పెద్ద పెద్ద రాళ్లు చొక్కాలు ఎత్తిపట్టుకుని అందులో వేసుకున్నారు. బద్రిగాడు, బస్టాండు రమేష్ ఎప్పుడూ తమ దగ్గర ఉంచుకునే కండువాల్లో పట్టినన్ని రాళ్లు పోసి మూటక ట్టారు.

మరో పది నిమిషాలు నడిచాక వీరన్న "ఇదేరా! వాళ్ళు చెప్పిన స్థలం. రండి రోడ్డు దిగి పోదాం" అన్నాడు.

రోడ్డు దిగారు పిల్లలంతా.

నడుస్తూ కొంతదూరం వెళ్ళేసరికి... ఏదో శబ్దం వినిపించినట్లనిపించింది. పిల్లలంతా నిశ్శబ్దంగా ఆలకించారు.

ఆ విశాలమైన ప్రదేశంలో ఎవరో నేల తవ్వుతున్న శబ్దం. రహస్యంగా "శీనూ. ఇన పడ్తోందా?" అన్నాడు బద్రిగాడు.

"ఆc... మనం సప్పుడు సెయ్యకుండా, ఎవ రికి కన్పించకుండా ముందుకెళ్దాం" అన్నాడు శీను.

"మీరంతా ఈణ్ణే పొదల చాటున కూకోండి" అని పిల్లలకి చెప్పి బద్రిగాడు, వీరి గాడు, శీను నేలమీద పాక్కుంటూ ముందుకె ళ్లారు.

ఒక వ్యక్తి గొయ్యి తవ్వుతూ మసకమసగ్గా కన్పించాడు.

అది చూసిన వీరిగాడికి వెన్నులో చలి పుట్టినట్టయింది.

"ఏటి సేద్దాం" అన్నాడు బద్రిగాడు భయంతో కళ్లు పెద్దవి చేసి.

"అందరం ఎనక్కి పోదాం" అన్నాడు శీను.

మళ్ళీ నేలమీద పాక్కుంటూ వెనక్కొ చ్చారు.

"అరే... ఇక్కణ్ణే... ఏదో జరగబోతోంది. మన వేణుగాణ్ణి ఏం సేత్తారో ఏమో" అన్నాడు బద్రిగాడు దిగులుగా.

"ఏం చేస్తారు?" జాన్సన్ ఏడుపు గొంతుతో అనేసరికి.

"అణ్ణి ఏసేస్తార్రా! అనుమానమే లేదు" అన్నాడు వీరిగాడు దృఢంగా.

"అంత పని సేత్తారంటావా?" బద్రిగాడి అనుమానం. వీరిగాడు ఏం మాట్లాడకుండా ఔనన్నట్లు తలూపాడు.

"మరేం చేద్దాం" అన్నారిద్దరు ముగ్గురు ఏక కంఠంతో...

శీను అందర్నీ దగ్గరికి పిలిచి అక్కడ కూడ సాధ్యమైనన్ని రాళ్లు ఏరి కుప్పలుగా పెట్టుకో మన్నాడు. వాటితో ఏం చెయ్యాలో తను అనుకునేదేంటో అందరికీ చెప్పాడు.

అందరూ ఏరగలిగినన్ని రాళ్లను ఏరి పొద లచాటున కుప్పలు కుప్పలుగా పోశారు.

అప్పుడు టైము సరిగ్గా మూడున్నర.




ఆ విశాల ప్రదేశంలో దూరంగా ఏదో వాహనం ఎక్కడో ఆగిన శబ్దం విన్పిం చింది.

కొంచం సేపు అతి నిశ్శబ్దం... పావుగంట తర్వాత అడుగుల చప్పుళ్ళు విన్పించాయి.

వేణుని నడిపిస్తూ ఇస్మాయిల్, అతణ్ణి అనుసరిస్తూ సూరన్న, పూజలు చేయించిన వ్యక్తి, నాయుడు, వాళ్ళ ముందు గన్‌తో మరో వ్యక్తి, టార్చిలైటు చూపుతూ రావటం కన్పిస్తోంది. పిల్లలంతా నిశ్శబ్దంగా, శ్వాస పీల్చే శబ్దం కూడా బయటికి రాకుండా బిగు సుకుని తుప్పలు, పొదల చాటున నేలమీద

బోర్లా పడుకున్నారు... జవాన్లలా. వేణుకి ఒంటిమీద స్పృహ ఉన్నట్టు లేదు. నిద్రమత్తులో తూలుతూ, కళ్ళు తెరవాలని ప్రయత్నించి తెరవలేక తల వేలాడేస్తూ నడుస్తుంటే, ఇస్మాయిల్ వాణ్ణి బలిపశువుని లాక్కొస్తున్నట్టు ఈడ్చుకొస్తున్నాడు.

వాళ్ళంతా ముందే ఎంపిక చేసుకున్న ప్రాంతానికి చేరుకున్నారు. అక్కడ గొయ్యి తవ్విన ఎట్టోడితో...

"అయిపోయిందా" అన్నాడు సూరన్న.

"అయిపోనాది దొరా" అని పక్కకెళ్ళి నిలబడ్డాడు వాడు.

నిద్ర కళ్ళతో ఊగిపోతున్న వేణుని సరిగ్గా నిలబెట్టాడు ఇస్మాయిలు. సిద్ధంగా ఉంచిన బిందెలో నీళ్ళు మీద పోసేసరికి పెద్ద పెట్టున ఏడుపు అందుకున్నాడు వేణు.

ఇస్మాయిల్ గబుక్కున వాడి నోటికి చేయి అడ్డుపెట్టి, ఏడుపు శబ్దం బయటికి రాకుండా అదిమిపెట్టాడు.

పిల్లలందరిలో ఉత్కంఠ, భయం... ఏదో చెయ్యాలన్న కసి. కీచురాళ్ళు నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ రొద పెడ్తున్నాయి.

పూజలు చేయించే వ్యక్తి, నేలమీద చతికిలబడి ఏవో మంత్రాలు చదువుతూ పూజ చేస్తున్నాడు.

నాయుడు, సూరన్న పక్కన నిలబడి చూస్తున్నారు.

"కొబ్బరికాయ నేను చెప్పినపుడు, ఈ రాయిమీద కొట్టాలి" అన్నాడు తాంత్రిక పూజారి ఊగిపోతూ.

ఏడుస్తున్న వేణు... ఇస్మాయిల్ చెయ్యి లాగేసి, "నాకు భయంగా ఉంది. నేనెళ్లిపోతా, నన్ను పంపించెయ్" అంటూ... ఇస్మాయిల్ కాళ్ళకి పెనవేసుకున్నాడు. వాడు బిగ్గరగా ఏడుపు అందుకున్నాడు.

వెంటనే జుట్టు పట్టుకుని విసురుగా లేపి నుంచోపెట్టి మళ్లీ వాడి నోరు నొక్కేశాడు ఇస్మాయిలు. పూజారి ఊగిపోతూ, "ఊc.. కానియ్" అని వేణు చేతికి నిమ్మకాయలు కట్టాడు. నుదుట బొట్టుపెట్టి మెళ్లో నిమ్మకాయ దండ వేశాడు. "భయం లేదురా! అంతా నీ కోసమే... రా! రారా! కొబ్బరికాయ కొట్టు... ఊc... కొట్టు" అని కొబ్బరికాయ వేణు చేతిలో పెట్టాడు ఇస్మాయిల్.

వెనకాల ఎట్టోడు సిద్ధంగా ఉన్నాడు. వాడి చేతులు ఏదో వస్తువు పట్టుకున్నట్టు వెనక్కి మడిచి ఉన్నాయి.

అందరివైపు చూస్తున్న వేణు చేత కిందున్న రాయి మీద కొబ్బరికాయ కొట్టించడానికి ఇస్మాయిల్ ప్రయత్నిస్తున్నాడు.

ఎట్టోడి చేతులు విడివడ్డాయి. వాడి చేతిలో భారీ కత్తి, టార్చిలైటు వెలుగులో మిలమిల మెరిసింది.

"ఊ!... తొందరగా కానీయరా!" తాంత్రిక పూజారి వేణూని గదమాయించాడు.

వేణు చేతిలోనే కొబ్బరికాయ పగలగొట్టించడానికి వాణ్ణి ఇస్మాయిలు వంచబోతుంటే, వాడు బిగుసుకుపోయినట్టు నిలుచుండిపోయాడు. బలవంతంగా మెడ పట్టి వంచబోయాడు.

ఎట్టోడి చెయ్యి పైకి లేవబోతోంది.

అంతే! ఎట్నుంచి వస్తున్నాయో, తెలీకుండా రాళ్ళు వర్షంలా వచ్చి పడ్తున్నాయి. ఒకటి గాదు, రెండుగాదు... అక్కడున్న వాళ్ళ తలలకి, మొహాలకి సూటిగా వచ్చి తగుల్తున్నాయి. రాళ్ళ ధాటి నుంచి తప్పించుకోవటానికి అంతా చేతులు అడ్డుపెట్టుకుని, తప్పించుకోవడానికి ప్రయత్నిస్తున్నారు.

రాళ్ళదెబ్బలు తగుల్తుంటే... చేతులు మొహానికి అడ్డుపెట్టుకుని ముందుకు రాబోతూ... "కోన్ రే" అని నోరు తెరిచాడు ఇస్మాయిల్. వేగంగా వచ్చిన రాయి మూతి మీద బలంగా తగలటంతో పెదాలు చిట్లి, ముందు పళ్ళు రాలినట్టనిపించింది. అంతలో మరో రాయి తలకి తగిలి రక్తం చిమ్మింది.

సూర్యప్రసాద్‌కి ఏం జరుగుతోందో అర్థంగావటం లేదు. గుండెలమీద, మొహంమీద

రాళ్ళు బుల్లెట్లలా వచ్చి పడ్తుండటంతో... వెనక్కి తిరిగాడు. తలమీద, వెనకాల తగలడంతో... తాళలేక కూచున్నాడు.

ఎక్కడ నుంచి ఎవరు రాళ్లు విసురుతున్నారో చూడడానికి టార్చ్‌లైట్‌తో వచ్చిన నాయుడు అనుచరుడికి తగలరానిచోట రాళ్ళదెబ్బలు తగలటంతో అతడు 'అమ్మా' అంటూ రెండు చేతులతో గట్టిగా పట్టుకుని కూలబడ్డాడు. తాంత్రిక పూజారి నుదిటికి, మొహానికి, కాళ్ళకి దెబ్బలు తగిలి కిందపడిపోయాడు.

పొదలచాటున పిల్లల్లో ఒకరిద్దరి ఆకారాల్ని గమనించి నాయుడు "అరుగో అరుగో" అంటూ అటువైపు అడుగులు వేశాడు. ఇంతలో కుడి కంట్లో, కడుపులో బలంగా రాళ్ళదెబ్బలు తగిలి తట్టుకోలేక... వెనక్కి పరుగెత్తాడు.

అంత దెబ్బల్లోనూ నాయుడు, సూర్యప్రసాద్ గొంతు పెగల్చుకుని...

"అరేయ్, ఎవ్రా అది... పట్టుకోండ్రా" అని అరిచారు బిగ్గరగా. ఇస్మాయిల్ రాళ్ళదెబ్బలు అడ్డుకునేందుకు... చేతులు మొహానికి అడ్డుపెట్టుకుంటూనే... రాళ్ళెక్కణ్ణుంచి వస్తున్నాయో, చూసేందుకు ముందుకు వస్తుంటే, ఒక రాయొచ్చి సూటిగా నుదుటికి బలంగా తగలడంతో రక్తం ధార కట్టింది.

పూజారి, ఎట్టోడు బతుకు జీవుడా అనుకుని వెనక్కి పరుగు లంకించుకున్నారు.

ఈ గందరగోళంలో... శీను, బద్రి, వీరిగాడు మెరుపు వేగంతో దూసుకెళ్ళి, కిందపడి పెద్దగా ఏడుస్తున్న వేణుని జర జరా ఈడ్చుకుంటు... రోడ్డుమీదికి పరుగెత్తారు.

"అరేయ్! ఆ పిల్లకాయని ఎవురో తీస్కెబోతున్నార్రా, పట్టుకోండ్రా" అని పెద్దగా అరిచాడు నాయుడు.

ఆ మాట విని ఇస్మాయిల్ వాళ్ళని పట్టుకోవడానికి రాళ్ళ వర్షం మధ్యే అటువైపు పరుగెత్తాడు. అప్పటికే పొదలచాటుకు చీకట్లోకి చేరిపోయారు బద్రి, వీరిగాడు, శీను, వేణు. వాళ్ల కోసం చీకట్లో కళ్లు మిటకరించుకుని రొప్పుతూ చూస్తున్న ఇస్మాయిల్ కాళ్లమీద బలంగా ఏదో తగిలింది. పక్కనే ఉన్న పొద పక్కనుంచి బద్రిగాడు ఎండుకొమ్మతో బలంగా కొట్టిన దెబ్బ అది. ఆ దెబ్బకు అబ్బా అంటూ ముందుకు వంగాడు ఇస్మాయిల్. బద్రి ఈడ్చి తన్నాడు. అంతే! ఆ దెబ్బకి 'అబ్బా!' అని ముందుకి పడిపోయాడు ఇస్మాయిల్. వెంటనే అతడి తలమీద టపటపా రాళ్ళతో మోదాడు రాజు. మిగిలిన పిల్లలందరూ... రాళ్ళు విసుర్తూనే, అక్కడున్న వాళ్ళకి చిక్కకుండా, వాళ్ళని కదలనివ్వకుండా, దిగ్బంధం చేసి, సాధ్యమైనంతగా గాయపరచి చీకటి ఆసరాతో పారిపోయారు.

చేతులు మొహానికి అడ్డుపెట్టుకుంటూనే... రాళ్ళెక్కణ్ణుంచి వస్తున్నాయో, చూసేందుకు ముందుకు వస్తుంటే, ఒక రాయొచ్చి సూటిగా నుదుటికి బలంగా తగలడంతో రక్తం ధార కట్టింది.



ఎంత హఠాత్తుగా రాళ్ళ దాడి మొదల య్యిందో అంత హఠాత్తుగానే ఆగిపోయింది.

పిల్లలంతా కాలి సత్తువకొద్దీ పరుగెత్తి, పరుగెత్తి మెయిన్‌రోడ్డుకి చేరుకున్నారు.

శీను, బద్రి, వీరిగాడు, వేణుని తీసుకుని అప్పటికే అక్కడికి చేరుకున్నారు.

అందరూ కలిసి పరుగెడుతుంటే, అటుగా వస్తున్న లారీ శబ్దం విన్పించింది.

శీను అందర్నీ రోడ్డుకి అడ్డంగా నిలబెట్టాడు.

అందరూ కలిసి లారీఆపి డ్రైవర్‌కు టూకీగా జరిగిన విషయం చెప్పి లారీలో ఎక్కేశారు.

లారీ రెండు కిలోమీటర్లు వెళ్ళగానే ఒక మారుతి వ్యాన్ దాన్ని దాటిపోయింది. లారీలో నుంచుని గోలగోలగా మాట్లాడుకుంటున్న పిల్లలకు తమనెవరో పిల్చినట్లనిపించింది. కళ్లు పెద్దవి చేసి అందరూ అటువైపు తలలు తిప్పారు. లారీని దాటిపోయిన జీపు పది అడుగుల దూరంలో ఆగడం కన్పించింది.

ఆగిన జీపులోంచి భూషణం దిగి "శీనూ, ఈరన్నా" అంటూ కేకలు పెడుతూ పరుగెత్తుకు వస్తున్నాడు ముందుకు సాగిపోతున్న లారీ వెనక. అతడి అరుపులు విని పిల్లలు లారీ డ్రైవర్‌ని బతిమిలాడి లారీ ఆపించారు.

భూషణం, సూరి లారీ దగ్గరకు పరుగెత్తుకు వచ్చారు. "టివివోళ్లు వచ్చార్రా. వ్యాన్‌లో ఉన్నారు" అని చెప్పారు.

పిల్లలందరూ వ్యాన్‌ను చుట్టుముట్టారు.

అందరు పిల్లలు వ్యాన్‌లో పట్టే అవకాశం లేకపోవడంతో శీను, వీరిగాడు, బద్రి, రమేష్ ఇరుక్కుని సర్దుకున్నారు.

"మీరు లారీలో ఎల్లిపొండ్రా మేమొచ్చేస్తాంలే" అన్నాడు శీను మిగిలిన పిల్లలతో.

వాళ్లంతా సరే అంటూ లారీ ఎక్కారు.

మారుతి వ్యాన్ శీనూ, వీరిగాడు మిగిలిన పిల్లలతో ముందుకు సాగింది.




తిరుపతికి, చంద్రగిరికి మధ్య కొండలనానుకుని ఉన్న ఈ ఐదెకరాల విశాలమైన ప్రదేశంలో ఉన్న 'ఆలంబన' స్వచ్ఛంద సంస్థ ఇదే.

"ఇక్కడ తల్లిదండ్రుల నిరాదరణకు గురయి బాల్యంలోనే భంగపడ్డ అనాథ చిన్నారులు.

ఏవో కారణాల వల్ల మానసిక రుగ్మతలకు లోనై మనో వైకల్యం పొంది సమాజానికి బరువైన బాధితులు... అంగవైకల్యంతో అయిన వాళ్ల చిన్నచూపుకు, నిరాదరణకు గురైన వికలాంగులు... ఎంతో మందికి ఆశ్రయంతో బాటు, ఆత్మస్థైర్యాన్ని అందిస్తున్న 'ఆలంబన' లోపలికెళితే మనకి ఆరోగ్యకరమైన వాతావరణంతో బాటు, ఆశ్చర్యపరచే ఎన్నో ఆసక్తికర విషయాలు కన్పిస్తాయి, విన్పిస్తాయి"

కెమేరా స్విచ్ఛాఫ్ చేశాడు కెమేరామెన్ ప్రశాంత్.

"ప్రశాంత్! ఆలంబన ఎంట్రన్స్, బోర్డు కూడా షూట్ చేద్దాం" అన్నాడు యాంకర్ మురళి.

వాటన్నిటినీ షూట్ చేస్తూ పదినిమిషాల తర్వాత ఎంట్రన్సు నుండి లోపలికెళ్తూ, పరిసరాల్ని చూపుతున్న కెమెరా ఓ గది ముందాగింది. గోడకున్న నేమ్ బోర్డు మీద 'రాంప్రసాద్, ఐ.ఎ.ఎస్., డిప్యూటీ కలెక్టర్' అని రాసుంది.

రెండు నిముషాల తర్వాత బయటికొచ్చిన ముప్పయి అయిదేళ్ల యువకుడు స్మార్ట్‌గా, డైనమిక్‌గా కన్పించాడు.

"గుడ్మాణింగ్, సార్! మేము మా ఛానెల్ నుండి ప్రసారమయ్యే "వెలుగు" కార్యక్రమంలో 'ఆలంబన' గురించి పరిచయం చేద్దా

మని వచ్చాం" అన్నాడు మురళి.
"ష్యూర్" రండి అలా నడుస్తూ మాట్లాడు కుందాం" అన్నాడు రాంప్రసాద్.
ప్రశాంత్ కెమేరా ఆన్ చేశాడు.
"ఆలంబన స్థాపించడానికి మీకు ఆలంబన ఎవరు సార్? "
మురళి ప్రశ్న.
"నా చిన్ననాటి నుంచి నా చుట్టూ ఉన్న సమాజంలో జరుగుతున్న అనేక సంఘట నలు నా మీద చూపిన ప్రభావం నుంచి అంకుర్పారణ జరిగినదే... ఈ ఆలంబన"
"చిన్న వయసులోనే డైనమిక్ కలెక్టర్‌గా పేరు తెచ్చుకున్న మీకు అటు విధి నిర్వహణ, ఇటు సేవా కార్యక్ర మాలకి సమయం సరిపో తుందా? "
"భూమ్మీద నా మజిలీ ముగిసేలోపు, నా చుట్టూ ఉండే అభా గ్యుల కోసం, నా ఆశ యాల కనుగుణంగా ఎంతో కొంత నా వంతు కృషి చేయాలని చిన్నతనం నుండే అనుకునేవాణ్ని. నా చదువు వల్ల నాకపుడు సమయం దొరికేది కాదు. ఇపుడు నా ఆశయాలకు తగిన ఆర్థిక వన రులు కూర్చుకునే స్థోమత నా ఉద్యోగం కల్పించింది.
నా ఆశయానికి వృద్ధాప్యం రాకముందే అనుకున్నది చెయ్యాలనే 'ఆలంబన' ప్రారం భించాను"
"మీకు స్ఫూర్తి ఎవరైనా ఉన్నారా? "
"చూడండి! బతకడానికి మనం చేసే ఏ పనైనా గొప్పదే. ఎదుటి వారికోసం చేసే పని ఇంకా గొప్పది. ఇహ పెద్దవాళ్ల నిర్లక్ష్యానికి బాల్యాన్ని బలి చేసుకుంటున్న చిన్నారుల మేధను గుర్తించి, వాళ్లని భావి భారత పౌరు లుగా తీర్చిదిద్దడం మరీ గొప్పది... ఇదే నా ఆశయ స్ఫూర్తి"

ఎదుటి వారి కోసం చేసే పని చాలా గొప్పది. పెద్దవాళ్ల నిర్లక్ష్యానికి బాల్యాన్ని బలి చేసుకుంటున్న చిన్నారుల మేధస్సు గుర్తించి, వాళ్లని భావి భారత పౌరులుగా తీర్చిదిద్దడం మరీ గొప్పది...

"ఆలంబన వీధి పిల్లల కోసమేనా? "
"మొదట అలాగనే ప్రారంభించాం. తర్వాత వికలాంగులకి, మనోవైకల్యం పొందిన వాళ్లకీ... ఆశ్రయమిచ్చి ఆత్మస్థైర్యం కలిగించడానికి కృషి చేస్తున్నాం"
"ఇదంతా ఎలా సాధ్యమవుతోంది? ప్రభుత్వ పరంగా లేదా ప్రభుత్వేతర సహాయం ఏమైనా లభిస్తోందా? "
"నేను ఒక ఇన్స్పిరేషన్‌తో మొదలు పెట్టాను. నాలాంటి మనస్తత్వం కలిగిన లైక్ మైండెడ్ పీపుల్... దీన్ని అర్థం చేసుకుని అందిస్తున్న సహకారంతో ఇదంతా సాధ్యపడు తోంది. మా సంస్థ విస్తరించడానికి నా ఒక్కడి కృషి మాత్రమే కారణం కాదు.
ఇక్కడ సహనంతో బాధల్ని అర్థం చేసుకుని వైద్యం అందించే డాక్టర్లు; ప్రేమగా, ఓపిగ్గా పాఠాలు నేర్పే టీచర్లు; మానసిక వికాసం కలిగించే మనస్తత్వ నిపుణులు... ముఖ్యంగా ఇక్కడికొచ్చే ప్రతి ఒక్కరినీ తమ మనిషిగా చూసుకునే సిబ్బంది 'ఆలం బన'కి ఆయువుపట్టు... ఇలా రండి' అని రాంప్రసాద్ మానసిక వికలాంగుల విభాగం దగ్గరకి నడిచాడు.
"ఇతడి పేరు దయానంద్. ఉత్తరప్రదేశ్‌కు చెందినవాడు. ఒకప్పుడు మంచి అథ్లెట్, ఫుట్ బాల్ ప్లేయర్. తలకి బలంగా దెబ్బ తగ లడం వల్ల గతం మర్చిపోయాడు. పిచ్చివాడై ఇంటా, బయటా నిరాదరణకి గురై, ఊళ్లు పట్టి తిరుగుతుంటే 'ఆలంబన' ఆదరించి, ఆప్యాయంగా అక్కున చేర్చుకునేసరికి తనెవరో గుర్తొచ్చింది. ప్రస్తుతం ట్రీట్‌మెంట్లో ఉన్నాడు. ఇతడు చెప్పిన వివరాలతో ఇతని సొంత వాళ్లని కాంటాక్ట్ చేశాం. ఇతడి తల్లీదండ్రీ, అన్న ఇటీవలే ఇక్కడకి వచ్చెళ్లారు. వాళ్లు ఇతణ్ణి కలవడం దాదాపు ఇరవై ఏళ్ల తర్వాత.

త్వరలో తమ ఊరు వెళ్లాలనుకుంటున్నాడు.

"ఈవిడ పేరు సావిత్రి. పెళ్లయింది. పదేళ్లయినా పిల్లలు లేరంటూ అత్తింట్లో పెట్టే హింసలకు మతి చలించిన మహిళ. ఇప్పుడు గతం గుర్తొస్తోందంటోంది. ఒకప్పుడు ఎన్నో సంవత్సరాలు బస్టాండ్లో గడిపింది. ఇప్పుడు ఆలంబన ఆదరణతో కొత్త జీవితంలో అడుగిడబోతోంది' అని చెప్పాడు. కాస్త ముందుకు నడిచి చిన్నపిల్లల విభాగం దగ్గర ఆగి, "ఈ పిల్లల్ని చూడండి. వీళ్లంతా వీధిబాలలే. అందరూ బాధితులే. అమ్మా నాన్న నిర్లక్ష్యానికి బాల్యాన్ని బలిచేసుకుంటున్న బాల బాధితులు. వీళ్లలో వికసించాల్సిన మేధస్సు కుంచించుకుపోయి, పొట్టకూటి కోసం బెగ్గర్లుగా, స్మగ్లర్లుగా, రౌడీషీటర్లుగా మారుతున్నారు. వీళ్లలో పరివర్తన తీసుకురావడమే ఆలంబన ప్రథమ లక్ష్యం.

"నేను తిరుపతికి వచ్చినప్పుడు బస్టాండ్లో, రైల్వేస్టేషన్లో కనిపించే ఇలాంటి పిల్లల్ని మోటివేట్ చేసి ఆలంబనకు తీసుకొచ్చే ప్రయత్నం చేస్తుంటాను. కానీ వచ్చిన పిల్లల్లో ఎక్కువమంది నాలుగు రోజులుండగానే, పాత అలవాట్లు మానుకోలేక పారిపోతుంటారు. ఇక్కడ క్రమశిక్షణకి తట్టుకుని నిలబడగలిగే వాళ్లని వేళ్లమీదే లెక్కించొచ్చు. ఆలంబన ఈ సంవత్సరం తన ఐదో వార్షికోత్సవం జరుపుకుంది.

"మీకు ప్రభుత్వం నుండి ప్రశంసలు, అవార్డులు వంటి గుర్తింపు లభిస్తోందా?"

"ఏం చేశానని? మానసిక తృప్తి కోసం చేసే పనిని మన మనస్సాక్షి గుర్తిస్తే చాలు... అదే నా దృష్టిలో పెద్ద అవార్డు"

"ఆలంబన మీరాశించిన సంతృప్తినిస్తోందా?"

ఇన్నాళ్లుగా నా ఆలోచనలు, నాలాంటి భావాలున్న వాళ్ల సహకారంతో ఈ సంస్థ వృద్ధి చెందుతోంది. అయితే మేం చేస్తున్న మోటివేషన్ కొత్త జనరేషన్... అంటే... ఇలా ఇల్లొదిలి వచ్చిన పిల్లల్లో మార్పు వచ్చినప్పుడే సఫలమైనట్లు. బాల్యాన్ని బజార్న పడేసుకుని వృథా చేసుకుంటున్నామనే భావన వాళ్లలో రావాలని, 'చదువు' ఆవశ్యకత అర్థమవ్వాలని, అప్పుడే వాళ్లలో వచ్చిన మార్పు నిలుస్తుందని అనుకునేవాణ్ణి నేను. అలా జరగాలనే ఆశిస్తున్నాను. నాలుగు నెలల క్రితం... తిరుమల కొండకి వెళ్తూ తిరుపతి స్టేషన్లో దిగినప్పుడు నా లగేజి మోస్తానని వెంటబడ్డాడో కుర్రాడు. మేం వెళ్లే కారు బయల్దేరడానికి కొంత టైముండటంతో. మ్యాగజైన్ కొందామనుకుని, చేతిలో ఉన్న పేపరు ఆ కుర్రాడికిచ్చి పట్టుకొమ్మని, మ్యాగజైన్ కొనడానికి వెళ్లాను.

ఐదు నిమిషాల తర్వాత వచ్చిన నేను ఆ కుర్రాణ్ణి చూసి ఆశ్చర్యపోయాను. వాడు అనర్గళంగా న్యూస్ పేపరు చదువుతున్నాడు. చింపిరి జుట్టు, మురికిగుడ్డలతో ఉన్న వాణ్ణి కదిలించాను. వాడి కథ విన్నాను. వాడికి చదువు మీదున్న ఆసక్తి నన్ను అబ్బురపరిచింది. చదువు చెప్పిస్తానన్నాను. నా తిరుగు ప్రయాణంలో నాతోబాటు రైలెక్కాడు. రైల్లో కూచున్న వాడి ఆలోచనలు ఎటో పయనిస్తున్నాయని, వాడిలో మొదట ఉన్న ఉత్సాహం లేదని గమనించి విషయమేమిటని అడిగాను. వాడు, 'సార్ నాతోబాటు ప్లాట్ఫారం మీదుండే పదిమంది పిల్లలు నాకు బాగా పరిచయమయ్యారు. స్నేహం కుదిరింది. చదువుకోవాలన్న కోరిక నాకున్నట్టే ఆళ్లకీ ఉంది. ఆళ్లనీ నాతోబాటే మీ స్కూలుకి తీసుకొస్త సార్. మాకు అన్ని పన్లూ వచ్చు. మీరే పని చెబితే ఆ పని చేస్తాం సార్' అన్నాడు.

"నువ్వు చెప్పే ఆ పిల్లలంతా చదువు మాటెత్తితే చాలు పారిపోతారు. వాళ్లొచ్చినా ఉండరు" అన్నాను.

"లేదు సార్,మీలాంటోళ్లు ఆళ్లకి చెబితే..."

"అందులో సగం మంది నీలాగే ఇదివరకు నాతో వచ్చినవాళ్లే. అంతా రెండ్రోజుల్లో వెనక్కి తిరిగెళ్లిపోయారు. వాళ్ల సంగతొదిలెయ్. నాతో నువ్వు వచ్చి చదువుకో" అని చెప్పాను.

కొంతసేపు మౌనంగా కూచున్న ఆ పిల్లాడు, తర్వాతి స్టేషన్ రావటంతోనే లేచి నిలబడి...

"నేను ఆళ్ళని తీసుకొస్త సార్. నేను ఆళ్ళకి చదువు గురించి చెప్పి తోడ్కొస్త" అన్నాడు.

"అనవసరంగా నీ టైము, చదువు పాడు చేసుకోకు" అన్నాను.

"లేదు సార్! వాళ్ళంతా పదిమంది దాకా ఉండారు. అంతా మంచి పిల్లోళ్ళే. అందులో సగం మందిన్నైనా తీసుకొస్త. మేం పన్జేస్తేనే మాకు అన్నం బెట్టండి. చదువుకుంటాం" అన్నాడు.

నాకేం మాట్లాడాలో అర్థం గాలేదు. నా నుండి తప్పించుకోవడానికి చెప్తున్నాడనుకున్నాను.

కానీ, వాడి మాటల్లో "కాన్ఫిడెన్స్" కన్పించింది. వాడి ఆలోచన, కాన్ఫిడెన్సు నాకు దగ్గరగా ఉన్నట్టన్పించింది. వాడిలో నాకు కొత్త తరం నాయకుడు నిద్రిస్తున్నాడన్పించింది.

"సరే! నువ్వెప్పుడొచ్చినా ఈ అడ్రస్‌కి రా!" అని అడ్రస్ రాసిచ్చాను.

ఆ తర్వాత కొద్దిరోజులు వాడి కోసం చూశాను. రాకపోయేసరికి నేనే మర్చిపోయాను. మూడు నెలల తర్వాత అంటే పోయిన నెల ఇరవైముగ్గురు పిల్లలతో కలిసి వచ్చాడు.

ఇదెలా సాధ్యమని నేనూ ఆశ్చర్యపోయాను. అదే అడిగాను. చదువు గురించి మాటల్లో చెబితే ఎవరూ విన్లేదని సైగా గేలి చేసే వాళ్ళని చెప్పాడు. వాళ్ళకి సమస్యలు వచ్చినప్పుడు సందర్భానుగుణంగా పరిష్కరించుకోవడానికి చదువు ఎంత అవసరమో వాళ్ళకి అర్థమయ్యేలా పరిస్థితులే చెప్పాయని, అందువల్లే తీసుకు రాగల్గానని చెప్పాడు"

"ఇప్పుడూ ఆ పిల్లలు ఇక్కడే ఉన్నారా? "

"ఉన్నారు. రండి చూద్దురుగాని" అంటూ ఎదురుగా ఉన్న ఓ గది ముందాగాడు రాంప్రసాద్. అక్కడ కంప్యూటర్ థియరీ క్లాసు జరుగుతోంది.

రాంప్రసాద్‌ని చూసి టీచరు గబగబా వచ్చాడు. "శీనుని పంపండి" అన్నాడు రాంప్రసాద్.

రెండు నిమిషాల తర్వాత వచ్చిన శీనుని చూసి టి.వి. ఛానెల్ బృందం ఆశ్చర్యపోయింది. వాళ్ళు శీనుని ఇంటర్వ్యూ చేస్తుంటే సిగ్గుపడుతూ సమాధానాలిచ్చాడు.

తనతోబాటు ఆలంబన కొచ్చిన పిల్లల్ని పిలిచాడు. వీరిగాడు, వెంకటేశు, జాన్సన్, బద్రిగాడు, రాహుల్, రమేషు, మల్లేశు, రాజు... అందరూ యూనిఫారాల్లో, చక్కగా తలలు దువ్వుకుని కడిగిన ముత్యాల్లా కన్పించారు.

"థాంక్యూ సార్! ఆలంబన ఎంతోమంది నిరాశ్రయులకు ఆశ్రయం, ఆత్మస్థైర్యం అందించాలని, మీ ఆశయం సఫలం కావాలని కోరుకుంటున్నాం" యాంకర్ మురళి అన్నాడు.

చిన్నగా నవ్వుతూ "రండిలా!" అని మరో క్లాసురూంకి తీసుకెళ్ళాడు రాంప్రసాద్.

అక్కడ క్లాసులో కూచుని రాసుకుంటున్న వేణుని పిలిచాడు.

మనం, మన ప్రభుత్వాలు పోలియో, ప్లేగు, వంటి వ్యాధుల్ని నిర్మూలించుకోగలిగాం కాని తరాలు మారినా, ఎంతో ప్రగతి సాధించినా హైటెక్ యుగంలో ముందుకు పోతున్నా అంతరించి పోయిందనుకుంటున్న మూఢాచారం నరబలి నేటికీ మూడో కంటికి తెలీకుండా అక్కడక్కడా కొనసాగుతుండటం సభ్యసమాజం సిగ్గుతో తలవంచుకోవలిసిన విషయం. ఏ హైటెక్ యుగమయినా మనిషిలోని మూఢ విశ్వాసాలు, నమ్మకాలు, స్వార్థాలు ఒక పట్టాన మారవని ఎక్కడో అరుదుగా జరిగినా అలాంటి సంఘటనలు రుజువు చేస్తున్నాయి.

ఈ సోకాల్డ్ సభ్య సమాజంలో పెద్ద మనుషులుగా ప్రచారం పొందే బడా వ్యక్తులు, బాబాలు, స్వామీజీలు జ్యోతిష్కులు, తాంత్రికులు తమ స్వలాభం కోసం, మితిమీరినా ఇంకాఇంకా ఎందుకో సౌభాగ్యాన్ని

పోగేసుకోవడం కోసం, ఘోరమైన ఈ మౌఢ్యా చారాన్ని నేటికీ పాటిస్తుండటం విస్మయం కలిగించే విషయం.

అలాంటి దుర్మార్గపు చర్య నుండి 'వేణుని' శీను మిత్రులతో కలిసి ఏ విధంగా కాపా డిందీ రాంప్రసాద్ టి.వి. ఛానెల్‌కి వివరిం చాడు.

ఛానెల్ వాళ్ళు శీనుని, శీను మిత్రుల్నీ అభి నందించారు.

## 23

బాల్యం అమూల్యం. అమ్మ ఒడిలో ఒదుగుతూ ఎదగాల్సిన బాల్యం కొందరికి మరపు రానిదిగా జ్ఞాపకాల్లో మిగిలిపోతే మరికొంద రికి ఆకలి కేకలతో, ఆధారం లేని బతుకులతో తెల్లారిపోతోంది.

బడిలో చదువు, సభ్యత, సంస్కారాల మధ్య ఎదగాల్సిన బాల్యం గాడి తప్పి వీధిన బడితే... వేషాలు, మోసాలు, వ్యసనాలే బత కటానికి ఆధారాలని పసి మనస్సులపై శిలాక్ష రాలుగా ముద్రింపబడుతున్నాయి.

భవిష్యత్తు అగమ్యగోచరంగా, బతుకు అంధకార బంధురంగా మారి చివరికి నేటి వీధి బాలలే రేపటి గూండాలు, రౌడీషీటర్లు, స్మగ్లర్లు, బెగ్గర్లుగా తయారవుతున్నారు.

దీనికి కారణం ఎవరు? కారణాలు వెతికితే కన్పించేవి వ్రణాలే. ఒక్కొక్కరిదీ ఒక్కోగాథ... దానివెనకో... వ్యధ.

... అయితే ఆ వ్యధలోనూ అరుదుగానైనా వెలుగు దివ్వెలుంటాయి. ఆ వెలుగు దివ్వె ఎవరో... తెలుసుకుందాం. అతడి గాథ విందాం."

యాంకర్ వ్యాఖ్యానం ముగిసింది.

కార్యక్రమం ప్రసారమవుతోంది.

* * *

"అమ్మా! అమ్మా!" రొప్పుతూ వచ్చిన లక్ష్మిని చూసి "ఏంటే!" అంది మంచం పట్టిన గౌరమ్మ.

"అమ్మా! టి.వి.లో మన శీను కన్పిస్తున్నాడంట"

"ఎవరు జెప్పినారు"

"పక్కింటోళ్ళు చెప్పారు. రా పోదాం!" అంది.

అంతే! ఆ మాటతో గౌరమ్మలో కొత్త ఉత్సాహం ప్రవేశించి వేగంగా లేచెళ్ళింది.

టి.వి.లో మాట్లాడుతున్న శీనుని చూసిన గౌరమ్మ కళ్ళు కట్టలు తెంచుకున్న జలధులే అయ్యాయి.

* * *

ప్రతి సంవత్సరం సాహస బాలలకిచ్చే రాష్ట్రపతి పురస్కారం ఈ ఏడాది మన రాష్ట్రంలో శీనుకి ప్రకటించింది కేంద్ర ప్రభుత్వం.

ఆ సందర్భంగా టి.వి. ఛానెళ్ళలో మళ్లీ శీను ఇంటర్వ్యూ వస్తోంది. తల్లి గౌరమ్మ, 'ఆలంబన' రాంప్రసాద్ ఆ లిటిల్ లీడర్‌కి చెరో పక్కన కూచుని ఉన్నారు. ఆశయం, ఆత్మవిశ్వాసాల్లా! ◆



వెండితెర జీవితాల చీకటి వెలుగులు..

# పాకుడురాళ్లు

## కథ వెనుక కథ

**తెలుగు సాహిత్యంలో 'పాకుడురాళ్లు' స్థానం ప్రత్యేకం! సుప్రసిద్ధ రచయిత డాక్టర్ రావూరి భరద్వాజ కలంనుంచి జాలువారిన ఈ నవల నలభైమూడేళ్ల క్రితం 'కృష్ణాపత్రిక'లో సీరియల్‌గా ప్రారంభమై పత్రిక సర్క్యులేషన్‌ను అమాంతం పెంచేసింది. వెండితెర జీవితాలలోని వెండి వెలుగులతో పాటు... కారుమబ్బుల్నీ కళ్లముందు ఉంచడంతో పాఠకులు దీనికి బ్రహ్మరథం పట్టారు. అపురూప నవల 'పాకుడురాళ్లు' కథ వెనుక కథ రచయిత మాటల్లోనే చదవండి...**



రావూరి భరద్వాజ

'నేను రాసినవన్నీ నాకు నచ్చాయని చెప్పను. వాటిలో ఇష్టపడి రాసినవి, వృత్తిరీత్యా రాసినవి, విధి లేక రాసినవి, డబ్బుకోసం రాసినవి, ప్రయోగాత్మకంగా రాసినవి, అనుకోకుండా రాసినవి చాలా ఉన్నాయి.

1955 దాకా తెనాలిలో ఉన్నాను. అప్పుడే గోవిందరాజుల సుబ్బారావు, స్థానం, వేమూరి గగ్గయ్య, లక్ష్మీరాజ్యం, కాంచనమాలల్ని చూశాను. అప్పట్లో నేను చూసిన సినిమా కళాకారులు వీరంతా.

1956 జనవరిలో ఉద్యోగరీత్యా మద్రాసు మారాల్సి వచ్చింది. జ్యోతి, అభిసారిక, చిత్రసీమ పత్రికలలో పనిచేశాను. వీటి సంపాదకవర్గ బాధ్యతలను ధనికొండ హనుమంతరావు, కొలను బ్రహ్మానందరావు, నేను పంచుకునే వాళ్ళం. ప్రధానంగా నేను 'జ్యోతి' పత్రికను చూసేవాడిని.

చలనచిత్ర పరిశ్రమతో పరిచయం అలా మొదలైంది. అప్పటిదాకా నాకు తెలిసిన సమాజానికీ; మద్రాసులో నా చుట్టూ ఉన్న సమాజానికీ చాలా తేడాలు కనిపించాయి. వాటిని డైరీలో రాసుకొన్నాను. మద్రాసులో కూడా నా చుట్టూ ఉన్న సమాజానికీ, చలనచిత్రరంగ వాతావరణానికీ తేడాలు కనిపించాయి. వాటినీ డైరీలో రాసుకొన్నాను.

పత్రికా రచయిత వృత్తిలో ఉన్న కారణంగా ఎందరో నిర్మాతలను, దర్శకులను, నటీనటులను, రచయితలను, కవులను, సంగీతకారులను, పంపిణీదారులను కలిసేవాణ్ణి. ఆ సమయంలో ఎదురైన అనుభవాలకు, నేను వింటున్న కబుర్లకు సంబంధాలుండేవి కావు. ఈ తేడాలనూ సంక్షిప్తంగా డైరీలో రాసుకునే వాణ్ణి. కానీ డైరీకున్న పేజీ చిన్నది. అనుభవం పెద్దది. అందుకని వేరే నోట్‌పుస్తకాలలో వీటన్నింటినీ రాసేవాణ్ణి. ఈ పుస్తకాలు తరువాత చాలా ఉపయోగపడ్డాయి.

కోడంబాకంలో ఉంటున్నప్పుడు కొందరు సినిమావాళ్లు మా ఇంటికొచ్చేవారు. తమ గురించి, తాము చేస్తున్న సినిమాల గురించి చెప్పేవారు. ఈ మాటల మాటున విషాదం దోబూచులాడేది. వారిని మోసగించినవారి కపటం కూడా కదిలించేది.

ఈ నేపథ్యంతో కథలెందుకు రాయకూ

డదు? అనిపించింది. చిన్నచిన్నవి రాశాను. 'జ్యోతి', 'చిత్రసీమ'ల్లో ప్రచురించాను. 'శ్రీశ్రీ, మల్లాది రామకృష్ణశాస్త్రి, ఆదుర్తి, సి.యస్.ఆర్. తదితరులు మెచ్చుకొనేవారు. ఇంటూరి వెంకటేశ్వరరావు, కామేశ్వరశర్మ వంటి జర్నలిస్టులు కూడా అప్పుడప్పుడు కొన్ని కబుర్లు చెప్పేవారు. అవీ ఉపయోగపడ్డాయి.

ఒకసారి 'జ్యోతి'లో నా 'మాయజలతారు' కథ అచ్చయింది. రైల్లో ప్రయాణిస్తూ మల్లంపల్లి సోమేశ్వరశర్మ దాన్ని చదివారు, అదే బండిలో నేనూ ఉన్నాను. వారు కథ చదవడం పూర్తయ్యాక 'ఎలా ఉంది అన్నగారూ? ' అన్నాను. వారు, నావేపు ఆప్యాయంగా చూశారు. భుజం తట్టారు.

'కథకేం బావుంది. కానీ పదిమంది కూచునే గదిలో వందమందిని కుక్కినట్టుగా ఉంది' అన్నారు.

'అంటే? ' అన్నాను. తెలీక.

'ఈ కథలోని సన్నివేశాలను, పాత్రలకు వేయి పేజీల దాకా పరచవచ్చు అలాంటిది చిన్న కథలోకి ఇమిడ్చేసరికి సన్నివేశాలు, పాత్రలు ఉక్కిరిబిక్కిరయిపోయినట్లుగా ఉంది' అన్నారు.

'మాయజలతారు' కథలోని సన్నివేశాలకు, చేర్చినవి మార్చినవి చాలా ఉన్నాయి. అవన్నీ నాటక రంగానికి సంబంధించిన నా అనుభవాలు, నా మిత్రుల అనుభవాలూను. మద్రాసులో నాకు పరిచయమైన వివిధ వ్యక్తుల వ్యక్తిత్వాలను, ఒక్కొక్క పాత్రకు ఆపాదించడం వల్ల, పాత్రల చిక్కదనం పెరిగింది.

* * *

మద్రాసులోని ఉద్యోగం మానేసి, హైదరాబాద్ వచ్చాను-'యువ' పత్రికా కార్యాలయంలో పనిచేయడానికి. గోపీచంద్, త్రిపురనేని సుబ్బారావు, జి.పి.యస్.నాయర్‌ల చేయూత వల్ల 'ఆకాశవాణి'లో స్క్రిప్టు రైటర్‌గా చేరాను.

అదేసమయంలో తెనాలి నుంచీ పరిచయమున్న ముదిగొండ సుబ్రహ్మణ్యశర్మ 'కృష్ణాపత్రిక' నడుపుతున్నారు. తమకేమన్నా రాయమన్నారు. అప్పుడప్పుడు రాస్తూ ఉండేవాణ్ణి.

'ఏదన్నా సీరియల్ రాయండి' అన్నారు శర్మ.

ఆలోచిస్తాను అన్నానేగానీ ప్రయత్నించలేదు.

ఓసారి శీలా వీర్రాజు కాస్త గట్టిగా అడిగారు. 'మాయజలతారు' కథ చెప్పాను. మల్లంపల్లి వారి వ్యాఖ్యానమూ చెప్పాను.

'నిజమే! వేయిపేజీల దాకా సులభంగా రాయవచ్చు శీర్షిక మార్చండి "పాకుడురాళ్ళు" అని పెట్టండి. ముందుగా, పది పన్నెండు వారాలకు సరిపడ మేటరివ్వండి. ప్రతివారం రాస్తూ ఉండండి' అన్నారాయన.

నాకా శీర్షిక నచ్చింది. అలా నచ్చడానికి, ఆ శీర్షిక నేపథ్యాన్ని వీర్రాజుగారు చెప్పిన తీరు ముచ్చటగా అనిపించింది.

1963లో కృష్ణాపత్రిక ఈ సీరియల్‌ను ప్రచురించడం ప్రారంభించింది. వేయి, పదిహేను వందల సర్క్యులేషన్‌గల పత్రిక, అయిదు నెలలకే పదిహేను వేల దాకా ఎదిగింది.

'మాయజలతారు' కథలోని సన్నివేశాలకు, చేర్చినవి మార్చినవి చాలా ఉన్నాయి. అవన్నీ నాటక రంగానికి సంబంధించిన నా అనుభవాలు, నా మిత్రుల అనుభవాలూను.

మద్రాసులో నాకు పరిచయమైన వివిధ వ్యక్తుల వ్యక్తిత్వాలను, ఒక్కొక్క పాత్రకు ఆపాదించడం వల్ల, పాత్రల చిక్కదనం పెరిగింది. ఎవరు ఎవరికి ప్రతిబింబాలో తేల్చడం కొందరికి సాధ్యపడలేదు.

మంజరి, మూర్తిరావు, చలపతి, శర్మ, కేశవ్‌లాంటి వారెందరో- చాలామందిని గుర్తు కు తెచ్చేవారు.

'కృష్ణాపత్రిక'లో, నేనే ఉద్యోగం ఇప్పించిన, ఒక పెద్దమనిషి, 'పాకుడురాళ్ళు' నవలను త్వరగా పూర్తిచేయించడానికి శర్మగారికి నా గురించి చాలా పితూరీలు చెప్పాడు.

'ఓ నెలలో పూర్తిచేయండి' అన్నారు శర్మ కొంచెం విసుగ్గా ఓసారి.

'నెల దాకా దేనికి? ఒక్క వాక్యంతోనే ముగిస్తాను. 'వివిధ దేశాలలో పర్యటించిన మంజరి, స్వదేశానికి వచ్చాక అనూహ్యమైన పరిస్థితులలో అంతర్థానమయింది. రాసుకోండి. నేను వెడుతున్నాను' అని వచ్చేశాను.

అపుడు 'గోలకొండ' దినపత్రిక వస్తూ ఉండేది. సి.హెచ్. ఆచార్య, పియెస్సార్ ఆంజనేయశాస్త్రి, దేవులపల్లి రామానుజరావు అందులో పని చేస్తున్నారు.

'మరి ఇంత దాకా చాలా రాశారు వచ్చిన కథనేం చేస్తారు? ' అన్నారు రామానుజరావు.

'జరిగిన కథ-అంటూ పది పంక్తులలో, ఆ కథను చెబుతాను. మిగతాది రాస్తాను' అన్నాను.

ఈ సంగతి 'పండు'కి తెలిసింది. అంటే- సుబ్రహ్మణ్యశర్మ మేనల్లుడు. అతను మేనమామను ఒప్పించి నన్ను కలిశాడు.

'ఎవడో ఓ వెధవ చేసిన తప్పుడు పని కారణంగా 'కృష్ణాపత్రిక'కు చెడ్డపేరు రావడం మంచిది కాదు. మీ పాఠకులకు నిరాశ కలిగించడమూ మంచిది కాదు' అని నచ్చచెప్పాడు.

'పాకుడురాళ్ళు' మిగతా భాగం కూడా కృష్ణాపత్రికలోనే వచ్చింది.

ఆదర్శ గ్రంథమండలి తొలిసారి నవలగా ప్రచురించింది. అప్పట్లో దాన్ని నిషేధించడానికి కొంతమంది ప్రయత్నించారు. ఇది ఓ హీరోయే నాతో చెప్పాడు. ఇద్దరం కలిసి ఆలపాటి వెంకట్రామయ్యను కలిశాం. నవలలోని, కొన్ని పాత్రలు, కొన్ని కొన్ని సన్నివేశాలు ఆయనక్కూడా తెలుసు. అందుకని ఆయనే ఈ పుస్తకానికి పరిచయం రాశారు.

నా పుస్తకాలు చాలా ఉన్నాయి. నాలుగు ముద్రణలకు నోచుకొన్న పుస్తకం 'పాకుడురాళ్ళు' మాత్రమే!

ఈ నవలలోని, చాలా పాత్రలు, నాకు లాంఛనంగానూ, సన్నిహితంగానూ తెలుసు. 'మంజరి' మంగమ్మగా ఉన్నప్పుడు (మంగమ్మ వేరు, మంజరి వేరు) ఆమెతో కలిసి, నేనూ నాటకాలాడాను. ఈ నవలలో నాకు బాగా బాగా నచ్చిన పాత్ర మంజరి.

గుంటూరులో జిన్నా టవర్‌కు ఎదురు సందులో పొళ్ళమ్ముకొని బతికే మంగమ్మ మంగాదేవిగా నాటకాలాడేప్పుడు, మద్రాసులో మంజరిగా మారి, ఆకాశపు సరిహద్దులను దాటినపుడు, ఆమె నాకు తెలుసు. ఆమెలోని పట్టుదల, మొండితనాలు, ఆప్యాయతలు నాకు తెలుసు.

'ఇది - మంజరి కథ కాదు' అంటూ నవల ప్రారంభమవుతుంది.

'ఈమె స్వగ్రామమేదో, తల్లిదండ్రుల పేరేమిటో చెప్పండి' అన్నాడు పోలీసాఫీసరు.

ఎవ్వరూ కిమ్మనలేదు.

సువిశాలమైన ఆ చలువరాతి మందిరంలో శబ్దం కూడా శిలారూపం దాల్చింది- అన్న వాక్యంతో నవల ముగిసిపోతుంది.

ఈ నవలను, గంటనాటకంగా ఆకాశవాణి రెండుసార్లు ప్రసారం చేసింది. సీరియల్‌గా అండమాన్ నికోబార్ దీవులలోని రేడియో కేంద్రం ప్రసారం చేసింది.

శ్రీకృష్ణ దేవరాయ విశ్వవిద్యాలయంలో ఈ నవలను గురించి పిహెచ్‌డి స్థాయి పరిశోధన జరిగింది.

ఇతర భాగాలలోని అనువాదాలు జరుగుతున్నాయి.

'ఈ నవల ముందుగా చదివి ఉంటే నేనీ రంగంలోకి అడుగు మోపే దాన్ని కాదు' అన్న దొక సుప్రసిద్ధ కథానాయిక కన్నీరు తుడుచుకొంటూ, ఆఖరు పేజీని ముద్దెట్టుకుంటూ.

ఇంతకు మించి, నేనాశించవలసింది మాత్రం ఏముంది? '

సేకరణ: చంద్రప్రతాప్ ✦

# ప్రేమ కొలత ప్రేమతోనే...!



సౌరభములేల చిమ్ము పుష్పవ్రజంబు?
చంద్రికలనేల వెదజల్లు చందమామ?
ఏల సలిలంబు పారు? గాడ్పేల విసరు?
ఏల నా హృదయంబు ప్రేమించు నిన్ను?

మావిగున్న కొమ్మను మధుమాసవేళ..
పల్లవము మెక్కి కోయిల కూయుటేల?
పరుల తనియించుటకొ, తన బాగు కొరకొ?
గానమొనమొనరింపక బతుకు గడవబోకొ?

'ప్రేమ గానం' శీర్షికకు రాయాలనుకోగానే, మనసున తట్టిన మాటలు కృష్ణశాస్త్రిగారివే. అవును మరి... 'ప్రేమంటే ఏమిటి.. ఎవరైనా, ఎవర్నైనా ఎందుకు ప్రేమిస్తారు? ఎలా..' అన్న ప్రశ్నలన్నిటికీ ఇంతకన్నా స్పష్టంగా సమాధానం చెప్పడం దాదాపు అసాధ్యం. ప్రకృతిలోని జంతుజాలమంతటిలోనూ ఆయన చెప్పినంత సహజంగా ఉద్భవించే ప్రేమ భావన మనలో.. మనుషుల్లో మాత్రమే కాలానుగుణంగా, సందర్భానుసారంగా ఎందుకు మారిపోతుందో... ఎంతాలోచించినా అర్థం కాదు.




అన్నిటికన్నా దురదృష్టకరమైన అంశమేమంటే, ప్రేమ అన్నది స్త్రీపురుషులకు, మరీ ముఖ్యంగా వయసులో ఉన్న యువతీయువకులకు మాత్రమే చెందినదనే 'పేటెంట్' తరహా భావన నూటికి తొంభై మందిలో స్థిరపడిపోవడం!! 'నేను ప్రేమిస్తున్నాను..' అని ఓ అమ్మాయి చెప్పిందంటే, తప్పకుండా ఓ అబ్బాయినే అని సహజాతిసహజంగా అనేసుకుంటాం. 'అదేం లేదు.. ఓ రచనని, ఓ చిత్రాన్ని, ఓ పాటని...' అందనుకోండి.. వెంటనే వెర్రివెంగళాయిని చూసినట్టు చూస్తాం. 'ఇష్టమని చెప్పొచ్చుగా.. ప్రేమనడం దేనికీ..' అనుకుంటాం. ఇష్టానికి మరో మెట్టు పైనే ఉన్న భావాన్ని ఆ అమ్మాయలా వ్యక్తీకరించిందని మాత్రం చచ్చినా అనుకోలేం. కాముకత లేని ప్రేమ ఊహల్లోక్కూడా రాకుండా పోవడం - ఆధునిక సమాజంలో ఉన్నందుకు మనకు చుట్టుకున్న దౌర్భాగ్యం!

నిజానికి మన సంస్కృతిలోని ప్రేమ భావన ఇంత తక్కువ అర్థమున్నది కానే కాదు. గుణరహితం.. కామనారహితం.. ప్రతిక్షణ వర్ధమానం.. అవిచ్ఛిన్నం.. సూక్ష్మతరం.. అనుభవరూపం.. ప్రేమకు ఈ ఆరూ అసలైన లక్షణాలని నారద మహాముని అంటాడు. జన్మనిచ్చిన అమ్మానాన్నలే

కాదు.. అత్తామామా, పెద్దమ్మాపెదనాన్నా, పిన్నీ బాబాయ్.. 'కజిన్స్' అనబడే వాళ్ల పిల్లలు.. ఇలా మన చుట్టూ అల్లుకున్న ప్రతి బంధంలోనూ ప్రేమ వెల్లివిరుస్తూనే ఉంటుంది.. పరిశీలించి చూస్తే నారదులు సెలవిచ్చిన అన్ని లక్షణాలూ దానికుంటాయి కూడా! ఇరుగుపొరుగుల సాయంలో, ముక్కూమొహం తెలియనివారు కూడా చేసే మర్యాదలో.. బంధుత్వాలకతీతంగా స్నేహితులు చూపే అపేక్షలో... మనకి ప్రేమ కనిపిస్తూనే ఉంటుంది. ఇది భారతీయ జీవన శైలిలో మాత్రమే లభ్యమయ్యే మాధుర్యం.

ఉదయమంతా పనితో అలిసిపోయి, అర్ధమన్నదే చూసుకోని భార్య, భర్త వచ్చే సమయానికి పొందిగ్గా కన్పించడానికి చేసే ప్రయత్నంలో ఉంది ప్రేమ. తనకు ఎనభయ్యేళ్లు మీద పడినా అరవయ్యేళ్ల కొడుకు తిన్నాడో లేదో కనుక్కుని గానీ భోజనానికి రాని అమ్మ ఆరాలో ఉంది ప్రేమ. పరీక్షకు సిద్ధమయ్యే కుర్రాడికి పక్కింటబ్బాయి చేసే సాయంలో ఉంది ప్రేమ. ఇవన్నీ కాదని 'ఐ లవ్యూ..' అంటూ నలుగుర్లో చెప్పేదే ప్రేమనుకుంటే ఎలా?

ప్రేమ పెన్నిధిగాని,
ఇంటను ఎవ్వరు నేర్పరీ కళ.
ఒజ్జలెవ్వరు లేరు..

అని గురజాడగారన్నట్టుగా, ప్రేమించడం... ప్రేమను అందుకోవడం.. ఒక కళ. అయితే, ఇంట్లో ఎవరూ పనిగట్టుకొని నేర్పకపోవచ్చు. ఉపాధ్యాయులు దాని తత్వాన్ని బోధించకపోవచ్చు. కానీ మన సంస్కృతిలో ప్రతి ఒక్కరి ప్రవర్తనలో మాత్రం అడుగడుగునా అది వ్యక్తమవుతూనే ఉంటుంది. దాన్నుంచి నేర్చుకునేంత తీరికా ఓపికా మనకున్నాయా లేవా అన్నదే ప్రశ్న.

కాలానుగుణంగా, సందర్భానుసారంగా ప్రేమ మారిపోతుందా? అన్న సందేహం మాత్రం వదలట్లేదు. ఎందుకంటే - పూర్వమైతే ఎంత మంచి ఉద్యోగమైనా కానీ, 'ఉన్న ఊరినీ కన్నవారినీ వదిలి ఎందుకురా అవన్నీ..?' అని తల్లితండ్రులే ఎదిగిన బిడ్డల్ని వెళ్లనిచ్చేవారు కారు. ఉన్నదాన్లోనే తృప్తి.. అందరం కలిసుంటేనే సంతృప్తి.. అని నమ్మేవారు కనుక యాభై మందున్న ఉమ్మడి కుటుంబమైనా 'నిత్య కల్యాణం.. పచ్చ తోరణం..' అన్న చందాన గడిచిపోయేది. అప్పుడు తగవుల్లేవా? అభిప్రాయ భేదాల్లేవా? అసంతృప్తుల్లేవా? అందరి అవసరాలకూ సరిపడా పుష్కలంగా డబ్బుండేదా? అంతా హాయేనా? అప్పుడవేం లేకున్నా, ఇప్పుడు తలకి పాతిక లక్షలు ఆస్తున్నా, అప్పుడాస్వాదించినట్టు ఆ దగ్గరితనాన్నీ, ప్రేమ ఇచ్చే భద్రతనూ ఇప్పుడు ఆస్వాదించగలుగుతున్నామా? ఉన్న ఒక్క బిడ్డనూ కేర్ సెంటర్లో వేసేసి ఇద్దరం ఉద్యోగాలకెళ్లిపోతాం.. ఎదిగే కొద్దీ చదువు పేరిట రోజుకు ఇరవై గంటలు కాలేజీలో ఉండేట్టు జాగ్రత్త పడతాం.. ఆపై అమెరికాలోనో, ఆస్ట్రేలియానో పీజీ చేయించి, అందుకు తగ్గ ఉద్యోగం వస్తే ఎంతో సంతోషిస్తాం. 'మావాడు మైక్రోసాఫ్ట్‌లోనండీ..' అని అడగనివాడిక్కూడా చెప్పి ఆనందం పొందుతాం. ఏ స్టార్ హోటల్లోనో పెళ్లి చేసి 'కోడలూ ఇంజినీరే.. విప్రోలో..' అని ఆ ఉద్యోగమూ మానిపించి విదేశంలో కాపురం పెట్టేదాకా మనకి నిద్రే పట్టదు. మూడేళ్లకోసారి 'హాయ'నే మనవలు, మనం ముసలివాళ్ళయ్యాక అసలే కనిపించకపోతే, ఆసరా కావాల్సిన వయసులో కొడుకు 'నే డబ్బు కడతాలే.. డోంట్ వర్రీ.. మంచి ఓల్డేజ్ హోమ్ చూసుకోండి..' అంటే - అప్పుడర్థమవుతుంది ఇన్నాళ్లూ మనకి వినడానికి తీరిక లేని ప్రేమగానం విలువ! కొడుకు తమ దగ్గరే ఉండాలనుకోవడం ప్రేమా? మనకందుబాటులో లేకపోయినా ఫర్వాలేదు.. సామాజిక స్థాయి పరంగా, ఆర్థికంగా ఎదగాలనుకోవడం ప్రేమా? నిర్ణయించే కొలబద్ద ఏది?

తల్లీతండ్రీ చూపించిన అమ్మాయిని మారుమాట్లాడకుండా మనువాడేసి జీవిత

మంతా పూలతేరులా నడిపించిన ఆసాములు న్నారు. కుర్రదాని చదువు, జీతం, హైటూ వెయిటూ, కట్నం, మామగారి పరపతి, అత్త గారి ఉద్యోగం, బావమరిది విద్యార్హతలు కూడా లెక్కేసుకుని..., వీటికి తోడు - ఉందో లేదో తెలియని జ్యోతిషం ప్రకారం కూడా అంతా పక్కా అనుకున్నాక పెళ్లి చేసుకుని ఏడాది లోపే 'ఇన్‌కంపేటబిలిటీ' అంటూ అయిష్టంగా మొహం పెట్టుకునే కుర్రకారు రోజురోజుకీ పెరుగుతున్నారు. పెళ్లికి ముందు రోజుకి వంద ఎస్సెమ్మెస్‌లు పంపేదేనా ప్రేమ? ముందు చెప్పుకున్న ఆసామికి ప్రేమ లేనట్టేనా? మాటల్లో కాక చేతల్లో చూపించే ప్రేమను పట్టించుకునేంత సమయం ఎవరికు న్నట్టు?

'వలపెరుంగక బతికి కులికి మురిసే కంటే, వలచి విఫలమ్మొంది విలపింప మేలురా..' అన్నది పాత తరహా ఆలోచనే కావొచ్చు. కానీ, స్త్రీ పురుషుల మధ్య ప్రేమ బంధంలో ఉండే అలౌకిక అనుభూతిని ఎవరికి వారు తెలుసుకోవాల్సిందే. పక్కవాళ్లది మనకంత 'కరెక్ట్, ఆప్ట్, అప్పీలింగ్..' ఇత్యాదులుగా అని పించదు. వ్యక్తులుగా ఎవరూ పూర్తిస్థాయి దోషరహితులు కాదు.. అందుకే, వైవాహిక బంధంతో సహా అన్ని బంధాల్లోనూ చిన్నా పెద్దా సర్దుబాట్లుంటేనే, ప్రేమ గానం నిరంత రాయంగా సాగుతుంది. కొద్దిగా సర్దుకుపోయే తత్వం, యథాతథంగా స్వీకరించగలిగే హృదయ వైశాల్యం, వ్యక్తులుగా ఎదిగే అవ కాశం, ఒకరికొకరి ప్రోత్సాహం ఇవన్నీ ఉన్న ప్పుడు 'కంపేటబిలిటీ' అన్న ఆలోచనే మనసు లోకి రాదు. పైగా శ్రీరమణ మిథునం కథ లోని దంపతుల్లా కాలం గడిచేకొద్దీ ప్రేమ లోని తీవ్రత, అనురక్తిలోని గాఢత పెరుగు తాయి. హైటెక్ ప్రపంచం అన్ని బంధాల్లాగే ఆలుమగల బంధాన్నీ ప్రభావితం చేస్తుం టుంది. కానీ, మనసుంటే మార్గముంటుంద న్నది అందరికీ తెలిసిన మాటే. మళ్లీ మళ్లీ చెప్పనవసరం లేదు.

'గగనం గగనాకారం.. సాగరః సాగరో పమ..' అన్నట్టు ప్రేమను ప్రేమతోనే పోల్చ గలం.. ప్రేమ లెక్కల్లోనే కొలవగలం.. మరింక దేంతోనీ పోల్చి 'ఇదిలా' అన్న నిర్ణ యానికి రాలేం. అందువల్ల అల్లిబిల్లి బంధా ల్లోని ప్రేమను ఆధునిక హడావుడిలో పోగొ ట్టుకోవద్దు మనం. అంతమాత్రమే చేయ గలం.. అది మాత్రమే చెయ్యదగినది!!

– అరుణ పప్పు






## ఇందు కలదందు లేదని...

వాహ్

'ఇందు కలదందు లేదని సందేహంబు వలదు. కంప్యూటర్ సర్వోపగతిన్' అంటూ ఇకపై పద్యాలు చదువుకోవచ్చేమో! ఈ హైటెక్ యుగంలో సర్వం, సమస్తం కంప్యూటర్‌మయమే. ప్రతి చిన్న పనికి కంప్యూటర్ మీద ఆధారపడిపోతూ అది తోడు లేనిదే ఒక్క క్షణం కూడా గడవని స్థితికి చేరుకుంటున్నాడు ఆధునిక మానవుడు. ఫలితంగా ఇప్పటివరకు అడుగు పెట్టని రంగాల్లోకి కూడా దూరి తిష్ట వేసేస్తున్నాయి కంప్యూటర్లు. ఇందుకు తాజా ఉదాహరణ చైనాలోని జిచుయన్ జిల్లా కోర్టు గడపను దాటి జడ్జిగారి పక్కస్థానాన్ని ఆక్రమించేసి ఆయనగారు చేయాల్సిన పనిని చేసేస్తున్నాయి. జైలుశిక్షలు ఖరారు చేయడానికి సదరు కోర్టు కంప్యూటర్ల మీద ఆధారపడుతూ 1500కు పైగా క్రిమినల్ కేసులలో శిక్షలు ఖరారు చేసింది. బీజింగ్‌కు చెందిన ఒక కంపెనీ దీనికి సంబంధించిన సాఫ్ట్‌వేర్‌ను రూపొందించింది. దొంగతనం, అత్యాచారాలు, హత్యలు, ప్రభుత్వ వ్యతిరేక చర్యల వంటి వంద నేరాలకు సంబంధించిన సవివరమైన 'ప్రోగ్రామ్' ఇది. జడ్జిగారు కేసు వివరాలను కంప్యూటర్‌లో ఫీడ్ చేయగానే అది న్యాయమూర్తి అవతారమెత్తి శిక్ష ఏమిటో తేల్చేస్తుంది. జైలు శిక్షల్లో స్థిరీకృత నిర్ణయాల కోసం ఈ సాఫ్ట్‌వేర్‌ను రూపొందించినట్లు దాని రూపకర్త క్విన్‌యె సెలవిస్తున్నారు. ఒకే నేరానికి సంబంధించిన వివిధ కేసుల్లో ఒకే రకమైన ప్రామాణిక అంశాలను పాటించడానికి ఇది ఉపకరిస్తుందని అతగాడి అభిప్రాయం. అవినీతి, సరైన శిక్షణ లేమి కారణంగా జడ్జీలు తమ విచక్షణాధికారాలను దుర్వినియోగం చేయకుండా ఉండడానికి, ఈ సాఫ్ట్‌వేర్ ఎంతగానో ఉపకరిస్తుందని ఆ జిల్లా కోర్టు జడ్జి వాంగ్ హాంగ్‌మి కూడా పేర్కొంటున్నారు. అయితే కోర్టు తీర్పులకు కంప్యూటర్లపై ఆధారపడడం మీద విమర్శలు కూడా వెల్లువెత్తుతున్నాయి. ఇదంతా ఒక ఫార్స్‌లాగా ఉందని, 'కోర్టుల బద్ధకానికి' ఇంతకు మించిన ఉదాహరణలుండబోవని విమర్శకుల కామెంట్.

## కాదేదీ అనర్హం



వెర్రికీ, సృజనాత్మక శక్తికీ తేడా పెద్దగా లేదేమోనన్పించేటట్లుంటాయి కొందరి చేష్టలు. విచిత్రం అని సరిపెట్టుకుంటుంటాం గానీ అలాంటి విచిత్రాలకు లేదా వెర్రికి విచిత్రంగానే గుర్తింపు లభిస్తుంది. బ్రిటన్‌లోని ఒక కంపెనీ విచిత్ర సృజనాత్మకతను సొంతం చేసుకున్నందుకు దానికి చెప్పుకోదగిన బహుమానమే లభించింది. స్నోడోనియాలో ఉన్న క్రియేటివ్ పే పపర్ వేల్స్ కంపెనీ చేసిన

## అది ఊహ కాదు... నిజమే!




శాస్త్రానికందని శక్తులేవో ఉన్నాయంటే శాస్త్రవేత్తలు ససేమిరా అంటారు. తర్కానికి, సిద్ధాంతానికి అంది తేనే, నిరూపణ అయితేనే దేన్నైనా నమ్ముతాం లేకుంటే అవి లేవనేదే మా సిద్ధాంతం అంటూ ఢంకా బజాయిస్తుంటారు. అలాంటిది ఒక శాస్త్రవేత్త అలాంటి శక్తులు ఉన్నాయంటే... కొందరి విశ్వాసం మరింత గట్టిపడుతుంది. పారా సైకాలజిస్టులు అతీత శక్తుల నిగ్గుతేల్చడానికి నిరంతర శోధన జరుపుతూనే ఉన్నారు. డాక్టర్ రూపర్ట్ షెల్‌డ్రేక్ అనే పారా సైకాల జిస్టు అలాంటి శక్తుల్లో ఒకదాని నిగ్గు తేల్చానంటు న్నారు. అది... టెలిఫోనిక్ టెలిపతీ! ఎవరో మీకు ఫోను చేయబోతున్నారంటూ మీలో బలీయంగా కలిగే భావన అది. ఆ భావన కలిగినట్లే మీకు తప్పనిసరిగా ఫోన్ వస్తుంది. ఈ టెలిఫోనిక్ టెలిపతీ నిజమేనని ఎంత మాత్రం యాదృచ్ఛికం కాదని ఆయన పేర్కొంటున్నారు. దీనిపై ఆయన ప్రయోగాలు కూడా జరిపారు. ఆ ప్రయోగాల్లో 45 శాతం మంది ఎవరో ఫోన్ చేయనున్నట్లు కచ్చితంగా ఊహించారని, నాలుగు శాతం మంది తమకు ఫోన్ చేయబోయేది ఎవరో కూడా ఊహించగలిగారని ఆయన తెలిపారు. వందలసార్లు ప్రయోగాలు జరిపినా పొరపాటుగా ఊహించడమనే తప్పిదం కోటికి ఒకమారు కూడా జరగనట్లు తేలిందని ఆయన వెల్లడించారు. ఆయన పరిశోధన బ్రిటిష్ అసో సియేషన్ ఫర్ ది అడ్వాన్స్‌మెంట్ ఆఫ్ సైన్స్‌లో సంచలనం సృష్టించింది. డాక్టర్ షెల్‌డ్రేక్ 'మార్ఫిక్ ఫీల్డ్స్' అనే సిద్ధాంతాన్ని గతంలో ప్రతిపాదించారు. అత్యంత సన్నిహిత సంబంధ బాంధవ్యాలున్న వ్యక్తుల మధ్య 'మానసిక బంధం' ఉంటుందని ఆయన నమ్మకం. తన పరి శోధనల్లో వెల్లడయిన టెలిఫోనిక్ టెలిపతీ భావోద్వేగ బంధం ఉన్న వ్యక్తుల మధ్య ఇలాంటి అతీతశక్తి ఉంటుందని రుజువు చేస్తోందంటున్నారాయన.

---

విచిత్ర కార్యమనండి లేదా ఘనకార్యమనండి. అది గొర్రె విసర్జితాల నుంచి గ్రీటింగ్ కార్డులు, బహుమతులు తయారు చేస్తోంది. ఈ కంపెనీ చుట్టుపక్కల ఉన్న పర్వతాల నుంచి గొర్రె విసర్జితాల్ని సేకరించి ప్రెషర్ కుక్కర్లలో దాన్ని స్టెరిలైజ్ చేస్తుంది. ఆ తర్వాత దాన్ని శుభ్ర పరచి ఫైబర్‌లను వేరు చేస్తుంది. గొర్రె తిన్నదాంట్లో యాభై శాతం ఆహారాన్ని మాత్రమే జీర్ణం చేసుకుంటుంది. అందువల్ల విసర్జితాల నుంచి ఫైబర్స్ బాగానే లభిస్తాయి. వాటన్ని టిని కలిపి కాగితం, కార్డ్‌బోర్డ్ తయారుచేసి వివిధ రకాల స్టేషనరీతోపాటు గిఫ్టులను కూడా ఉత్పత్తి చేస్తుందా సంస్థ. స్టెరిలైజ్ చేసిన విసర్జితాలను శుభ్రపరచడానికి వినియోగించిన నీటిని కూడా ఆ కంపెనీ వృధా చేయడం లేదు. దానిని సాంద్రత కలిగిన ఎరువుగా స్థానిక రైతులకు పంపిణీ చేస్తోంది. గొర్రె విసర్జితాల నుంచి కూడా కాగితాన్ని, తద్వారా గ్రీటింగ్ కార్డులను గిఫ్టులను తయారు చేస్తున్నందుకు ఆ కంపెనీకి 20 వేల పౌండ్ల మిలీనియమ్ అవార్డు కూడా లభించింది. మాకిన్‌లెత్ సమీపంలో ఉన్న ఈ కంపెనీ ప్లాంట్ ఇలా ఏడా దికి ఒకటి నుంచి రెండు టన్నుల వరకు కాగితాన్ని తయారు చేస్తోందట!

నాటి చతుర



నాటి నవల

ఫ్లాష్‌బ్యాక్

# దివి నుండి భువికి

—అరంద్రై నారాయణన్

సంపుటి : 2 సంచిక : 10 నవంబర్ 1979

ఇది కాలాన్ని నెమరు వేసుకునే శీర్షిక. పాఠకుల కోసం చతుర తొలినాళ్ళను పరిచయం చేసే శీర్షిక. కాలగమనంలో మొన్న నిన్నటి పొరల్లో ఒదిగిపోయిన నవలాహారాల్ని ఒక్కటొక్కటిగా ఇతివృత్తం, కథనం వగైరా అంశాలతో రేఖా మాత్రంగా పరిచయం చేయడం ఈ శీర్షిక లక్ష్యం. 1979వ సంవత్సరం నవంబరు నెల **'చతుర'** లో అనువాద నవల **'దివి నుండి భువికి'** ప్రచురితమైంది. అరంద్రై నారాయణన్ రాయగా జి.సి. జీవి అనువదించిన ఆ నవల పరిచయాన్ని ఈ సంచికలో ఇస్తున్నాం.

జీవితం పట్ల సరైన అవగాహన, ముందుచూపు, ఉన్నత లక్ష్యం లేకుండా రోజులు గడిపితే ఎంతటి వారికైనా కష్టాలు, కన్నీళ్ళు తప్పవు. ఇవాళున్నట్లు రేపు ఎవరికీ ఉండదు. ఇక తళుకు బెళుకుల సినీ రంగంలో ఇది మరీ ఎక్కువ. అవకాశాలు వచ్చినప్పుడే డబ్బు సంపాదించుకుని, నిలవ చేసుకునే తెలివితేటలు ఇప్పటి తరానికి ఉన్నట్లు ఒకప్పటి కొందరు తారలకు ఉండేది కాదు. మకుటం లేని మహారాణిలా వెలిగిపోయి ప్రేక్షకులకు ఆరాధ్య దేవతగా మారిన ఓ మహానటి తారాపథం నుండి అకస్మాత్తుగా దీనస్థితికి దిగజారిన వైనాన్ని, తాగుడుకు బానిసై ఆరోగ్యాన్ని పాడు చేసుకున్న తీరును ప్రసిద్ధ తమిళ రచయిత అరంద్రై నారాయణన్ ఈ నవలలో కళ్ళకు కట్టించారు.

విజయవాడ నుండి పదమూడేళ్ళ వయసులో బెరుగ్గా తండ్రి చేయి పట్టుకొని రైలెక్కి మద్రాసు మహానగరానికి చేరుకున్న సవితా దేవి నాట్యం పట్టుదలగా నేర్చుకుంటుది. నాటకాల్లో వేషాలు వేస్తూంది. ప్రొడక్షన్ మేనేజర్ సిఫారసుతో స్టూడియోకి వచ్చిన ఆమె మేకప్ టెస్టులో సెలక్ట్ అవుతుంది. మొదటి పిక్చర్‌లోనే కథానాయకి పాత్ర దొరుకుతుంది. శరత్ చంద్రుడు సృష్టించిన అద్భుతమైన పాత్రకు జీవం పోసిన ఆమె ఇక మళ్ళీ వెనుదిరిగి చూసుకోలేదు. అవకాశాలు ఆమెను వెదుక్కుంటూ వస్తాయి.

నాటకాల కోసం రిహార్సల్‌కు వెళ్ళే రోజులలో డ్రామా థియేటర్‌కి బస్సులో వెళ్ళే ఆమె నాలుగో నాటకానికి అగ్రిమెంటు కుదిరాక బస్సులు మాని ఆటో రిక్షాలో వెళ్ళటం అలవాటు చేసుకుంటుంది. మొదటి సినిమా ఛాన్సు రాగానే నుంగంబాకం నుండి టి.నగర్‌కు మకాం మారుస్తుంది. పాత పెద్ద బంగాళాలో అద్దెకు దిగి తండ్రి, తనూ కలిసి ఉం

టుంటారు. కానీ సంవత్సరం తిరక్కుండానే ఆ బంగళానే కొనేస్తుంది సవితాదేవి.

పొద్దున్నే కంపెనీ కారు ఏడింటికల్లా ఇంటి ముందాగేది. స్టూడియోకి వెళ్ళి మళ్ళీ రాత్రి ఏ పదింటికో అదే కారులో ఇంటికి తిరిగివచ్చేది. మరో ఏడాది గడిచేసరికి అడయారులో ఓ ఖరీదైన బంగళా కొనగలిగింది. చుట్టూ ఎత్తైన ప్రహరీ, బంగళాకి మధ్య విశాలమైన తోట-రకరకాల చెట్లు, పూల మొక్కలు. ఆ బంగళాలో ఉన్నంతసేపూ ఏదో రాణి వాసంలో ఉంటున్నట్లనిపించేది.

ఎప్పుడూ ఏవో షూటింగులు. అవుట్ డోర్ షూటింగ్‌లకు వెళ్ళినప్పుడు పెద్ద హంగామా జరిగేది అక్కడ. జనాల్ని అదుపు చేయడానికి పోలీసులు వచ్చేవారు. ఒక్కోసారి పోలీసులు కూడా డ్యూటీ చేయటం మరచిపోయి జనంతోపాటు పళ్ళికిలిస్తూ, నోళ్ళు వెళ్ళబెట్టి సవితాదేవినే చూస్తూండిపోయేవారు కానిస్టేబిళ్ళు ఇన్‌స్పెక్టర్లు. ఇది చూసి కొన్నిసార్లు మూడ్ పాడై షూటింగ్ క్యాన్సిల్ చేసుకోవాలనిపించేదామెకు. కానీ ఆమెతోపాటే మేకప్ టెస్ట్‌కు హాజరై సెలక్ట్ కాని రాంప్రభు, ఆమె తండ్రి ఆమె తన ఇమేజిని ఎలా కాపాడుకోవాలో చెప్పేవారు.

"మనకెదురుగా లక్షలమంది జనం ఉండనీగాక, ఎవరూ లేనట్లుగానే ప్రవర్తించాలి మనం. వాళ్ళు నవ్వుతున్నారా, ఏడుస్తున్నారా? గలాభా చేస్తున్నారా? అనే విషయాలేవీ పట్టించుకోకూడదు. ఇప్పుడు నీ పేరు మీద అభిమాన సంఘాలు వెలుస్తున్నాయి. మంచిదే, మీ అభిమాన సంఘం ప్రెసిడెంటునని ఒకరు, కార్యదర్శినని ఒకరు విరాళాలిమ్మని వెంటపడితే వీలైనంత దూరంలో ఉంచాలి. కానీ కసిరి కొట్టకూడదు. నీ సినిమా పోస్టర్ల మీద పేడ ముద్దలు చల్లి, సినిమా హాళ్ళలో అల్లర్లు లేవదీసి నీ ఇమేజి పాడుచేసే గడుసుదనం కూడా వీళ్ళలో ఉంటుంది కనుక తెలివిగా వీళ్ళనుంచి తప్పుకోవాలి" అని బోధించేవారు. బంగళా ఎదుట రోజూ కనీసం ఒక టూరిస్టు బస్సయినా ఆగేది. సినిమా యాక్టర్లని చూపించే షరతుల మీదే ఊళ్ళ నుంచి టూరిస్టు బస్సుల్లో జనం వచ్చేవారు. సవితాదేవి దర్శనం కోసం బంగళా గేటు దగ్గర ఆ జనం నిలబడితే ఓపిగ్గా గేటు వరకు వచ్చి ఓ ఐదు నిమిషాలు వాళ్ళతో "ఏ ఊరు నుంచి వచ్చారు? మద్రాసులో ఇంకా ఏమేం చూశారు?" అని మాట్లాడి బంగళాలోకి వెళ్లిపోయేది. తన ఇంట్లో ఎందరు పనివాళ్ళున్నారో, ఎవరేం పని చేస్తారో, ఎవరెవరి పేర్లేమిటో కూడా ఆమెకు తెలియదు.

బంగళా మెట్ల పక్కనే మేనేజరు గది. దాని కానుకొని తండ్రి బెడ్ రూం. ఎడమవైపు మరి కొన్ని గదులు. వాటిలో ఇంకా సిబ్బంది, సెక్రటరీ, అకౌంటెంటు మొదలైన వాళ్ళుండేవారు. మేడ మీద కుడివైపు ఎయిర్ కండిషన్ చేయబడిన విశాలమైన గది ఆమెది. కింద ఉన్న వారితో ఇంటర్ కంలో మాట్లాడేది. ఆధునిక సౌకర్యాలతో ఆమె బంగళా ఇంద్ర భవనంలా ఉండేది.

నాటకాలు వేసే రోజుల్నుండే హుషారుగా అందర్నీ నవ్విస్తూ మాట్లాడే రాంప్రభుపై ప్రత్యేకమైన, ఆత్మీయతను పెంచుకుంది సవితాదేవి. అతనితో కలిసి సినిమాల్లో నటించింది. 'సినిమా రంగానికో ముచ్చటైన జంట' అని రాంప్రభు, సవితాదేవిలను అభివర్ణించాయి పత్రికలు. వరుసగా ఈ జంట నటించిన మూడు చిత్రాలు విజయవంతమయ్యాయి. ఆ తరువాత రాంప్రభు నటించిన సినిమాలు దెబ్బతినేసరికి అతనికి చిత్రాలు లేకుండా పోయాయి. సవితాదేవికి మాత్రం అప్పటికే పాప్యులర్ అయిన అగ్ర హీరోలతో అవకాశాలు వస్తూనే ఉన్నాయి. పరిశ్రమలో ఉన్నత స్థానాన్ని సంపాదించుకుంటుంది. రాం ప్రభుకు తన పక్కన హీరోగా వేషం ఇస్తేనే కాల్షీట్లివ్వసాగింది. ఓ రోజు "రాం!



పడవలు, కొబ్బరి తోటలు తెలుగు ప్రాంతానికే పరిమిత మైన అందమైన సజీవ వాతావరణం తమిళ చిత్రాలకు అతకక తమిళ ప్రేక్షకుల తిరస్కారానికి గురై సవితాదేవికి భారీగా ఆర్థిక నష్టాన్ని కలిగిస్తుంది.

ఆ తరువాత తీసిన రెండవ చిత్రం కూడా ఘోరంగా దెబ్బ తినటంతో ఆర్థికంగా, మానసికంగా కుంగిపోతుంది సవితాదేవి. హీరో ప్రకాశ్ తనకు రావలసిన మొత్తాన్ని గడు

ఇంకా ఎంత కాలం ఇలా సినిమాల్లో మాత్రం భార్యాభర్తలుగా నటిస్తుంటాం చెప్పు. ఇక నించి మనిద్దరం కలిసి జీవిద్దాం" అని అడిగింది. తనకు ఇదివరకే పెళ్ళయిందనీ, భార్య, కొడుకూ ఉన్నారనీ రాంప్రభు చెప్పేసరికి హతాశురాలై ఆలోచనల్లో పడిపోతుంది. అయినా అతడినే పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకుంటుంది. రాంప్రభు భార్య పెట్టిన షరతులకు అంగీకరించి రాంప్రభును పెళ్ళాడుతుంది. ఆ తరువాత షూటింగ్‌లు, సినిమాల బిజీ కారణంగా ఇద్దరూ కలిసి ఉండే రోజులు చాలా తక్కువగా ఉండేవి. తనతో మాట మాత్రమైన చెప్పకుండా కూతురు నిర్ణయం తీసుకున్నందుకు తండ్రి మండిపడతాడు. "మీక్కావలసింది నా శ్రేయస్సు కాదు, నా డబ్బు. జీవితాంతం మీకు సంపాదించి పెట్టి మీ ధన వ్యామోహాన్ని తృప్తి పరచటం కంటే నా కంటూ ఓ జీవితాన్ని ఏర్పరచుకోవటం నాకు ముఖ్యం" అని మొదటిసారిగా తండ్రిని ఎదిరించి మాట్లాడుతుంది సవితాదేవి.

తండ్రి ప్రోద్బలం మేరకు సవితాదేవి స్వంతంగా చిత్రం నిర్మిస్తుంది. భారీ ఎత్తున నిర్మించాలని లక్షలాది రూపాయలు వడ్డీలకు అప్పు తెస్తుంది. తనతో లోకేశ్వరరావు హీరోగా నటించాడు. గోదావరి లంకలు, తెరచాప

సుగా ఆమె నుండి రాబట్టుకుంటాడు. పులి మీద పుట్రలా ఇన్‌కంటాక్స్ వాళ్ళు రైడింగ్ చేసి ఐదు లక్షలు కట్టించుకుంటారు. ఫలితంగా బంగళా, కార్లు అన్నీ అమ్ముకుని అద్దె ఇంట్లోకి మారే దుస్థితి ఆమెకు పడుతుంది. ఆమె ఏకైక కుమారుడు పెళ్ళి చేసుకుని వేరు కాపురం పెడతాడు. కొడుకు ఉంటున్న భవంతిని తప్ప ఆస్తి అంతా అమ్మేసి అప్పులు చెల్లిస్తుంది. తను ఉంటున్న బంగళాకి బాడుగ కింద తల్లికి నెలనెలా కొడుకు 300 రూపాయలు పంపుతాడు. వాటితోనే దుర్భరంగా ఆమె జీవనం గడిచే పరిస్థితి ఎదురవుతుంది. తండ్రి ఇవన్నీ చూసి తట్టుకోలేక చనిపోతాడు. కోడలు తనింటికి రానివ్వదు. బాధలు మరిచిపోవడానికి సవితాదేవి మద్యం తాగుతుంది. ఆ తాగుడే ఓ వ్యసనంలా మారి తాగనిదే గడవని స్థితి వస్తుంది. అలాంటి పరిస్థితిలో ఓ సినిమా నిర్మాత సవితాదేవికి తన సినిమాలో ఒక అవకాశం ఇస్తాడు. షూటింగ్‌కని వెళ్ళి నటిస్తున్నప్పుడు కళ్ళు తిరిగి పడిపోతుంది. రెండు నెలలు ఆసుపత్రిలో ఉండాల్సి వస్తుంది. విశ్వం అనే యువకుడు ఫ్రీలాన్స్ జర్నలిస్టు- ఆమె కొడుకు వయసువాడు తరచుగా వచ్చి సవితాదేవిని పరామర్శించి, వెంటబెట్టుకుని ధైర్యం చెబుతుం

టాడు. ఒకరోజు అతనిని వెంబడించుకుని తను లోగడ తొలినాళ్ళలో అద్దెకున్న భవంతికి వెళ్ళి నాటి పరిచయస్థుల్ని పరామర్శించి వస్తుంది. ఆమె అసుపత్రిలో ఉన్నప్పుడు రాంప్రభు పరామర్శిస్తాడు. ఓరోజు ఆమె ఇంటికి ప్రెస్‌వాళ్ళను పిలుచుకొచ్చి ఇంటర్వ్యూ ఇమ్మంటాడు. అన్ని ప్రశ్నలకు ఆమె బదులు తనే సమాధానాలిస్తాడు. పాతికేళ్ళ తర్వాత జనం మధ్యకు వెళ్ళి తిరిగి వస్తుంది.

ఆ తరువాత ఆమె కలలోనైనా ఊహించని ఒక సంఘటన జరుగుతుంది. మద్రాసులో పేరు పొందిన తెలుగు వారి సాంస్కృతిక సంస్థ ఒకటి సవితాదేవిని ఘనంగా సన్మానించాలని తీర్మానిస్తుంది. అంగీకారం తెలుపమని ఆమెకు ఉత్తరం, ఆహ్వాన పత్రిక పంపటంతో ఆనందిస్తుంది సవితాదేవి.

రాజేశ్వరీ కళ్యాణ మండపంలో, రంగుల దీపాల కాంతులలో, పుర ప్రముఖులు, మంత్రులు, రచయితలు, పత్రికా విలేకర్లు, సినీరంగాల టెక్నీషియన్లు, తారలు హాజరైన ఆ సభామండపంలో సవితాదేవి చిత్రాలను ప్రదర్శిస్తారు. సన్మానం ప్రారంభమవుతుంది. అందరూ సవితాదేవి నటనా కౌశలాన్ని ప్రశంసించి ప్రసంగిస్తారు. సినీ ఆర్టిస్టు్స అసోసియేషన్ బంగారుగాజుల జత, ఓ తార ఒంటిపేట గొలుసు బహుకరించగా ఇతరులు పట్టుచీరలు, రవికెలు, మెమొంటోలు బహుకరిస్తారు. పోత పోసిన సవితాదేవి వెండి ప్రతిమను ఆమెకు బహూకరిస్తారొకరు. సంస్థ సభ్యులు పది వేల నగదు సమర్పిస్తారు. సన్మానం ముగిశాక మహానటి సవితాదేవి ప్రసంగిస్తుంది. కృతజ్ఞతలు చెబుతుంది.

మర్నాడు విశ్వం సవితాదేవితో "మీరు మళ్ళీ నటించాలి" అంటాడు. తన మిత్రులు, తనూ యూనిట్‌గా ఏర్పడ్డామని పరిచయం చేస్తాడు. తామంతా కలిసి నిర్మించే ఈ సంస్థలో అందరికీ సమాన బాధ్యతలుంటాయి. ఆత్మవిశ్వాసం, చైతన్యంతో వాళ్ళంతా సవితాదేవికి ప్రోత్సాహాన్నిచ్చి సరికొత్త కళారూపాల గురించి, ఉద్యమాల గురించి చర్చిస్తుంటారు. ఈ రకంగానైనా ఆమె తాగుడు అలవాటు మానుతుందనీ, మనోవ్యాధికి దూరమై ఉల్లాసంగా, ఉత్సాహంగా ఉంటుందనీ అతడు ఆమెచేత సరే ననిపిస్తాడు. దీనితో నవల ముగుస్తుంది.

మన కష్టాలకు, దురదృష్టాలకు మనమే కర్తలం అనుకోవటం పొరబాటు. బాహ్య శక్తులు కొన్ని జీవితాల్ని వంచనకూ, విషాదానికీ గురిచేస్తాయి. మన చుట్టూ ఉన్న సమాజం, మనతో మసలే మనుష్యులు మన జీవితాలను శాసిస్తుంటారు. జాగ్రత్తగా ఉండకపోతే ఓటమి తప్పదని మరోసారి ఈ నవల ద్వారా సందేశమిచ్చారు రచయిత. ✦

**చతుర సమీక్ష** — నవంబరు 'చతుర' నవల లిటిల్ లీడర్

సమీక్షకుని/సమీక్షకురాలి పేరు: __________

చిరునామా: __________

# స్పెషల్ షో

## కె.బి.కృష్ణ

అది ఒక సర్కస్ కంపెనీ. యజమాని మాట్నీ షోకి ఏర్పాట్లు చేసుకుంటున్నాడు.

ఇంతలో ఒక నిరుద్యోగి నీరసంగా, మాసిన బట్టలతో ఆయన దగ్గరకు వచ్చాడు.

"అయ్యా ఏదైనా పని ఇప్పించండి" అని దీనంగా అడిగాడు.

"చిన్న పని ఉంది చేయగలవా? రోజుకు మూడుసార్లు చేయాలి. జీతం బాగానే ఉంటుంది" అన్నాడు సర్కస్ యజమాని.

"ఎంత కష్టమైనా చేస్తాను. దయచేసి పని ఇప్పించండి" అన్నాడు. ఉద్యోగం దొరుకుతుందనే ఆశతో అతడి ముఖంలో ఒకింత ఆనందం తొంగి చూసింది.

"వెరీ సింపుల్. పెద్ద బోనులో సింహం ఉంటుంది. నువ్వు మేక డ్రెస్ వేసుకుని ఆ బోనులోకి వెళ్లి సింహంతో ఆడుకోవాలి... సామాన్యంగా మా సింహం చాలా మంచిది. నిన్ను అది తినకుండా మేము హంటర్స్‌తో బయటనుంచి బెదిరిస్తుంటామనుకో" ఆయన మాటలు పూర్తి కాకుండానే,

"సరేనండి. అలాగే చేస్తాను. ఈ నిరుద్యోగం, ఆకలిబాధ భరించేకన్నా సింహానికి ఆహారం అయిపోయినా నాకు సంతోషమే" అన్నాడు.

"అలాగే. అలాగే. నువ్వు లోపలికి వెళ్లి శుభ్రంగా భోంచేసి మ్యాట్నీ షోకి తయారైపో" అన్నాడు సర్కస్ మేనేజర్. మనిషి లేక ఆగిపోయిన షోను మళ్లీ మొదలుపెట్టబోతున్నందుకు అతనికి ఆనందం కలిగింది. ప్రదర్శన మొదలైంది.

ఒక పెద్ద బోనులో సింహం భయంకరంగా అటూ ఇటూ తిరుగుతోంది. సర్కస్ డేరాలో సింహగర్జనలు భయానకంగా వినిపిస్తుంటాయి.

"ప్రియమైన ప్రేక్షకులారా, ఏ సర్కస్‌లోనూ లేని ఒక ప్రత్యేక ప్రదర్శన ఇప్పుడు మీరు చూస్తారు. ఆకలితో అరుస్తున్న సింహం బోనులోకి మేము ఇప్పుడు మీ ఎదురుగా బలిసిన మేకను పంపిస్తాం... సింహం మేకను తినకుండా దానితో ఆడుకుంటుంది. ఆ చిత్రం చూడండి." మైకులో ప్రకటన వినిపించింది.

వెంటనే మేకను బోనులోకి పంపించారు. మేక డ్రెస్‌లో వున్న వ్యక్తి బోనులోకి వెళుతూనే వణికిపోతూ "ఈ రోజుతో నా జీవితం అంతమైపోతుంది. నిరుద్యోగంతో బతకలేక బాధపడ్డంకన్నా ఆకలిగొన్న ఈ సింహం చేతిలో చనిపోవడమే మేలు. ఇది నన్ను తప్పక తినేస్తుంది. కానీ ఎంతసేపు ఇలా భయపడి చావాలో" వణికిపోతూ మనసులో అనుకుంటున్నాననుకొంటూ బయటకి అనేశాడు.

"పిచ్చోడా... నెమ్మదిగా మాట్లాడు. నేనూ నీలాగే సింహం వేషంలో వున్న మనిషినే. నువ్వు భయపడుతున్నట్లుగా నటించు, నేను నిన్ను తినడానికి దగ్గరకు వస్తున్నట్లు నటిస్తుంటాను. మైకులో సింహం అరుపులు భయంకరంగా వినిపిస్తుంటాయి. అర్థమైందా? " అంది సింహం.

"బతుకు జీవుడా" అనుకున్నాడు నిరుద్యోగి. సర్కస్‌లో ప్రత్యేక ప్రదర్శన కొనసాగుతోంది. ✦






# డైలమా

విశ్వమోహిని

విశ్వనాథశాస్త్రి జ్యోతిషశాస్త్రంలో ఉద్ధండుడు. అయితే 'పండిత పుత్రః...' అన్న నానుడి వర్తించడంతో అతని కొడుకు పేరిశాస్త్రికి ఆ విద్య అంతగా ఒంట బట్టలేదు. అయినా బతుకు తెరువుకు అవసరమైన తెలివి తేటలు మాత్రం బాగానే అబ్బాయి. అందుకే తండ్రి మరణానంతరం 'చెట్టు పేరు చెప్పుకుని కాయలు అమ్ముకోవడం' ఆరంభించాడు.

మనిషి ఉన్నచోట కష్టాలు ఉండడం ఎంత సహజమో, కష్టాలు వచ్చినప్పుడు మనిషి దృష్టి స్వాములు, జ్యోతిష్యులవైపు మరలడమూ అంతే సహజం! భవిష్యత్తును తెలుసుకోవాలని ఆత్రుత చెందేవారి బలహీనతలను, 'మంత్రాలకు చింతకాయలు రాలగల'వన్న వారి మూఢనమ్మకాలనూ పెట్టుబడిగా పెట్టుకొని, గొప్ప జ్యోతిష్యుడిలా చెలామణి అయిపోసాగాడు పేరిశాస్త్రి. తన వాక్చాతుర్యంతో వివరాలను క్లయింట్ల నుంచే రాబట్టి, తన తెలివితేటలు, అనుభవమూ జోడించి వారి భవిష్యత్తు చెప్పేవాడు.




జ్యోతిష్య రంగానికి ముఖ్య పోషకులు- రాజకీయ నాయకులు, సినీజనమేనంటే అతిశయోక్తికాదు! కొందరు ఛోటా మోటా రాజకీయ నాయకుల చేతులు చూసి, జాతకాలు రాసి సర్కిల్ పెంచుకున్నాడు. సినిమా షూటింగులకు ముహూర్తాలు పెట్టి సినీరంగ ప్రముఖుల నోళ్లలో నానాడు.

అంతలో రాష్ట్ర ప్రభుత్వం ఆస్థాన జ్యోతిష్యుణ్ణి నియమించబోతోందన్న విషయం ఉప్పందిన పేరిశాస్త్రికి ఆశ పుట్టింది. లాబీయింగ్ ఆరంభించాడు. ఎంపిక దేవాదాయ మంత్రి చేతిలో ఉంది. ఆయనకు తన పేరు సిఫార్స్ చేసేందుకని అందుబాటులో ఉన్న అన్ని మార్గాల్లో ప్రయత్నాలు మొదలుపెట్టాడు.

పేరిశాస్త్రికి అందమైన కూతురు ఉంది. పేరు పద్మావతి. పి.జి. చదువుతోంది. ఆస్థాన జ్యోతిష్యుడి పదవికోసం తండ్రి పడుతున్న పాట్లు గమనిస్తోంది. ఓ రోజున తండ్రితో "నాన్న రాష్ట్ర దేవాదాయ మంత్రి మేనల్లుడు రాకేష్ నా క్లాస్‌మేట్. అతని ద్వారా నీ పని జరుగుతుందనుకుంటే ఇంటికి తీసుకువస్తాను" అంది.

పేరిశాస్త్రి ఎగిరి గంతేశాడు.

మర్నాటి సాయంత్రం రాకేష్‌ని వెంటబెట్టుకుని వచ్చింది పద్మావతి.

కుశల ప్రశ్నలు, అ(న)వసర మర్యాదలూ అయ్యాక విషయంలోకి వచ్చాడు పేరిశాస్త్రి.

అంతా ఆలకించి పద్మావతి వంక ఆదోలా చూశాడు రాకేష్. అనంతరం పేరిశాస్త్రినుద్దేశించి, "పద్మావతి నా బెస్ట్ ఫ్రెండ్. ఆమె కోసం ఏమైనా చేస్తాను. అలాగే. నా మేనమామ నా కోసం ఏమైనా చేస్తారు. అయితే ముందుగా మీ ప్రతిభపైన నాకు నమ్మకం కలగాలి" అన్నాడు. "ఇప్పుడు మీ జోతిష్యానికి ఓ చిన్న పరీక్ష పెడుతున్నాను. అందులో నెగ్గినట్టయితే మీకు ఆ పదవి దక్కినట్టే!"

సరేనన్నాడు పేరిశాస్త్రి.

రాకేష్ ఓ అమ్మాయిని ప్రేమించాడు.

అయితే తమ కులాలు వేరు కావడంతో పిల్ల తల్లిదండ్రులు తమ పెళ్లికి ఒప్పుకుంటారన్న ఆశలేదు. తన ప్రేమ సక్సెస్ అవుతుందో లేదో పరిశీలించి చెప్పమన్నాడు రాకేష్.

రాకేష్ జన్మ నక్షత్రం వగైరా అడిగి తెలుసుకున్నాడు పేరిశాస్త్రి. అతని చేయి అందుకుని హస్తరేఖలు కూడా పరిశీలించాడు. కాసేపు వేళ్లతో ఏవేవో లెక్కలు కట్టాడు.

'ఈ ప్రేమలు ఓ గందరగోళం. చివరికి ఎటు మలుపు తిరుగుతాయో తెలీదు. ప్రస్తుతానికి తెలివిగా ఈ అబ్బాయిని ప్లీజ్ చేస్తే

'మరీ ఎక్కువ గడువు పెడితే నమ్మకపోవచ్చును ఇతడు. ముందుగా ఇతగాడు నా విషయం మేనమామకు సిఫారసు చేసే విధానం చూడాలి' అనుకున్నాడు.

మళ్లీ ఏవేవో లెక్కలు కట్టి, "నెల రోజులలో మీ వివాహం జరిగిపోతుంది. అది తప్పితే, మూణ్ణెల్లు తిరక్కముందే ఎట్టి పరిస్థితులలోనూ జరిగి తీరాలి!" అంటూ నొక్కి వక్కాణించాడు.

"వెరీగుడ్! మీ జ్యోతిష్యం ఫలిస్తే ఆస్థాన జ్యోతిష్యుడి పదవి మీకే ఖాయం!" అంటూ



హామీ ఇచ్చాడు రాకేష్. పేరిశాస్త్రి పొంగిపోయాడు.

నా కార్యం నెరవేరుతుంది. ఆ తరువాత అతని ప్రేమ ఫలితం ఏమైతే నాకేం?' అనుకున్నాడు మదిలో.

రాకేష్‌నుద్దేశించి "నువ్వు అదృష్టవంతుడివోయ్. నీ ప్రేమ తప్పక ఫలిస్తుంది. ఎందరు అడ్డుతగిలినా నువ్వు కోరుకున్న అమ్మాయినే వివాహమాడడం ఖాయం" అని చెప్పాడు.

"మరైతే మా పెళ్లి ఎప్పుడు జరుగుతుందో కూడా చెప్పండి. మీ జ్యోతిష్యం ఫలించేదీ లేనిదీ కూడా తెలియాలి కదా!" అన్నాడు రాకేష్.

గతుక్కుమన్నా సర్దుకున్నాడు పేరిశాస్త్రి.

రాకేష్ వెళ్లబోతూ ఆగి, "బై ది బై, అంకుల్, నేను ప్రేమించిన అమ్మాయి వేరెవరో కాదు. మీ పద్మావతి... మా వివాహానికి మీరు ఒప్పుకుంటే మీ జ్యోతిష్యం ఫలిస్తుంది. లేకపోతే ప్రతిష్ఠాత్మకమైన పదవి మీకు దక్కకుండా పోతుంది. కులమో, పదవో... ఛాయిస్ మీదే!" మిస్చివస్‌గా అన్నాడు నవ్వుతూ.

'కులమా... పదవా...!?' అన్న ప్రశ్న తేలు కొండిలా మెదడులో గ్రుచ్చుకోవడంతో 'ఆఁ... !?' అంటూ నోరు తెరిచేశాడు పేరిశాస్త్రి.





సెప్టెంబరు 2006 'చతుర'
నవల

# నీరు నేల మనిషి
పై సమీక్షలు



## నిరతాన్నదాతలకు నిత్య సూత్రాలు

(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

అప్పులు చేయడం, గల్ఫ్ దేశాలకు వెళ్ళి ఆ అప్పులు తీర్చాలనుకోవడం, దాని కోసం మరింత అప్పు చేయడమంటే ఊబిలో కూరు కుపోవడమే! ఇస్తున్నారని బ్యాంకుల్లో అప్పులు చేసి వ్యవసాయం చేయడం విష వలయంలో చిక్కుకోవడమే అవుతుంది.

"నేల నీరు మనిషి"లో రామచంద్ర కూడా అప్పుల మీద అప్పులు చేసి ప్రభుత్వమేదో ఒరగబెడుతుందని, దానితో తన కుటుంబం బాగుపడుతుందని ఆత్మహత్యకు పాల్పడ్డాడు. నేలలో నీరే లేకపోతే బోర్ల మీద బోర్లు వేస్తే ఎలా వస్తాయి? ఒకటి రెండుసార్లు భంగ పడ్డ తర్వాతనైనా కొత్త యోచన చేయొద్దా? రెండెకరాలమ్మి చిన్నమ్మాయి పెళ్లి చేసి, మరో రెండెకరాలమ్మి అప్పులు తీర్చి పెద్దమ్మాయి పెళ్లిలో ఇచ్చిన మాట ప్రకారం పెద్ద గొలుసు చేయించి ఇస్తే అతని సమస్యలు తీరి మన శ్శాంతిగా ఉండేది. నిరాశా నిస్పృహలకు లోనై నప్పుడు సరైన ఆలోచన రాదు. తాకట్టు పెడితే వడ్డీ పెరుగుతుందేకాని అప్పు తీరదు.

ఇక మిగిలింది భార్య, భర్త, కొడుకు, కొద్ది భూమి, జెర్సీ ఆవులు. బోరులో ఉన్న నీరు మట్టుకు పశువుల కోసం జనుము, మొక్క జొన్న వగైరా పశువుల మేత వేసి చుట్టూ మొక్కలు నాటితే ఆరు నెలల్లో కావాల్సినంత మేత. కోళ్ళు, మేకలు, ఆవులు లాంటి వాటిని పెంచుకుంటే ఆనందంగా జీవించవచ్చు లేని నీళ్ల కోసం రాని వాన కోసం ఎదురు చూపు లు కార్యసాధకుడికి తగదు. ప్రభుత్వం ఇచ్చే సదుపాయాలను నమ్ముకుంటే ఆత్మహత్యలు తప్పవు. పూర్వపు గ్రామీణ వ్యవస్థ ఎలా ఉండేదో ఒకసారి గుర్తు తెచ్చుకుంటే స్వయం శక్తితో గ్రామాలను తీర్చి దిద్దవచ్చు. కళకళ లాడే గతాన్ని చెరువులలో తిరిగి తోడాలి. కురిసిన ప్రతి నీటి చుక్కను రైతులు ఒడిసి పట్టాలి. మనం ఆనందంగా జీవించడానికి అవసరమేదో కనిపెట్టాలి. వర్షాలు కురుస్తు న్నాయి. నదులకి వరదలొస్తున్నాయి. వాటిని సాగరంలోకి వదిలి పెడ్తున్నారు. మర్నాటి నుంచే నీరు లేదు. కరెంటు లేదు. ప్రకృతి ఇచ్చిన సంపద వృధాయేనా? రైతులంతా కలిసి కాలువలు తవ్వండి. నీరు ప్రవహింప చేయండి. చెరువుల పూడికలు తీయండి. కట్ట లను బలోపేతం చేయండి. పొలాలను సస్య శ్యామలం చేయండి.

మానవుడు తలచుకుంటే ఏదీ అసాధ్యం కాదు. కొత్తగా ఆలోచించవలసింది లేదు. పాత పద్ధతులు అవలంభించండి. సేంద్రి య ఎరువుల్ని వాడండి. పాడి పంటలతో కళకళలాడే పూర్వపు లోగిళ్లను తిరిగి తీసు కురండి. అప్పుడు రాయలసీమ, తెలంగాణా, కోస్తా అనే విచక్షణ లేకుండా రైతులంతా నిరతాన్నదాతలుగా నిలుస్తారు. ప్రస్తుత పద్ధతిలో ఉంటే మాత్రం భూస్వాములు, కూలీలు మాత్రమే ఉంటారు. సన్నకారు రైతుల మనుగడ సాధ్యం కాదు.

రమణమ్మ ఉత్తరం ద్వారా ముగింపు ఆశావహంగా చేసినందుకు సుంకోజి దేవేం ద్రాచారి గార్కి అభినందనలు.

– **గొల్లపూడి సీతాదేవి**, హైద్రాబాద్.

## మరో కర్ణుడు (రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)

భారతంలోని కర్ణుని చావుకు ఆరుగురు కారణం అని 'నీ చేతను నా చేతను....' అనే పద్యంలో చెప్పారు. ఈ నవలలోని కథానాయకుడు 'రామచంద్ర' చావుక్కూడ ఆరు కారణాలు కనబడుతున్నాయి. 'అప్పుడు సకాలంలో వర్షాల లేమి, అకాలంలో వర్షాలు, బోరింగులో నీళ్లు ఇంకిపోవటం, కరెంటుకోత, పండించిన పంటకు సరైన దిగుబడి (ధాన్యం రూపేణా, డబ్బు రూపేణా) రాకపోవటం. ఒక్క రామచంద్రుడేమిటి ఇంచుమించు ప్రతి బక్క, మధ్య తరగతి రైతు జీవితాలు ఇలానే ఉన్నాయి. అప్పుల బాధలు ఎక్కువై, పరువు ప్రతిష్ఠలు గంగలో కలిసిపోతుంటే, ఏ దిక్కు తోచక ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు తెగించిన కొందరు రైతులు. (రామచంద్ర లాంటి వారు.) తెగువ లేని రైతాంగం జీవచ్ఛవాల వలె జీవితాలను వెళ్లదీస్తున్నారు. వీరి సమస్యకు ఆత్మహత్యే పరిష్కారమా?

ఈ నవల ఒక్క రామచంద్ర జీవితానికే కాదు, ఎన్నో వందల, వేల రైతన్నల జీవితాలకు ప్రతీకగా నిలుస్తుంది.

దేశానికి వెన్నెముక అని చెప్పబడే ఈ రైతన్నల సమస్యలను ఏ పార్టీల సర్కారులు కూడా సరైన రీతిగా పరిష్కరించడం లేదు. పదవుల్లోకి రాకముందు రైతుల ఉద్ధరణే తమ ధ్యేయమని సభలలో, పత్రికా ప్రకటనలలో ఎలుగెత్తి ఊకదంపుడు ఉపన్యాసాలు దంచుతారు. తీరా పదవులకు వచ్చిన తరువాత 'నీకు బ్బె బ్బె - నీ అబ్బకు బ్బెబ్బె' అనే రీతిలో వ్యవహరిస్తారు. ఈ రైతన్నల ఓట్లు రాబట్టుకోటానికి ఎన్నెన్నో వేషాలు వేస్తారు. పంచెలు ఎగకట్టి, తలపాగాలు చుట్టి, కాడి భుజాన వేసుకుని పాద యాత్రలు జేస్తూ ప్రజలను ముఖ్యంగా రైతాంగాన్ని మసిపూసి మారేడు కాయలు చేస్తున్నారు. రైతులకు సరైన విత్తనాలు, కల్తీలేని ఎరువులు, సమయానికి నీరు, కరెంటు ఇవ్వలేని బడాబడా నాయకులు, జపాను, ఇజ్రాయిలు మొదలయిన విదేశాలకు వెళ్లి అక్కడి రైతాంగాల తీరుతెన్నులు చూసి, ఆ పరిస్థితులను మన రైతులకు, వ్యవసాయానికి వర్తింపజేసి అధిక దిగుబడికి పాటుబడతామంటారు. ఉట్టికి ఎగర లేనమ్మ స్వర్గానికి వెళ్ల ప్రయత్నించిందట. ఇటువంటి తుగ్లక్ నాయకులున్నంతకాలం రైతుల కష్టాలు పెరుగుతాయే గాని అంతం కావు.

రామచంద్ర జీవచ్ఛవాలవలె బతుకుతున్న బడుగు రైతుల ప్రతినిధి అయితే అతని కొడుకు బాలకృష్ణ స్వంత గడ్డపై జీవనోపాధి దొరక్క విదేశాలకు వెళ్ళి తమ బతుకు బాగు పరుచుకొందామనే ఆశతో పరుగు లెత్తే అమాయక యువకుల ప్రతినిధి.

పరుగెత్తి పాలు తాగే దానికన్నా నిలబడి నీళ్ళు తాగడం మంచిదని సామెతయితే బాగుంది కానీ నిలబడి నీళ్ళు తాగటానికి నీళ్ళేవీ? ఆ నీళ్లే దొరికితే పాల కోసం పరుగెత్తే అవసరమేముంది?

*- బి. గంగానాథ్, సికింద్రాబాద్.*

## ఎవరు వింటారు? (మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

'నీరు నేల మనిషి' నవలలోని కథాంశం ఒక్క రాయలసీమ ప్రాంతానిదే కాదు. నేల నాలుగు చెరగులా కడగండ్ల సేద్యంలో కష్టాల పాలవుతున్న రైతన్నల కన్నీటి గాథ.

వర్షాభావ పరిస్థితికి తోడు విద్యుత్తు కోతతో అన్నదాతలు గుండెలు పగిలి రోది

స్తున్నారు. చేతికి అందివచ్చే ఫలసాయం ఎండిపోతుంటే ఆదుకునేవారు లేరని అల మటిస్తున్నారు. వారి రోదనలు అరణ్య రోద నలే! ఆదుకునే నాథులు కరవయ్యారు. అప్పులపాలై, కన్నబిడ్డలను పోషించలేక, కట్టుకున్న భార్యకు న్యాయం చేయలేక ఎంతమంది రైతులు ఆత్మహత్మలు చేసుకొ న్నారో వారి ఆక్రోశానికి సజీవరూపకల్పన 'నీరు నేల మనిషి'

చక్కటి రాయలసీమ మాండలికంతో రాయలసీమ గ్రామీణ వాతావరణాన్ని మన కళ్ళముందుంచారు రచయిత. రామచంద్ర పేరుకు పెద్ద భూస్వామి అయినా నీటి ఎద్ద డితో ఎంతో కష్టపడి సేద్యం చేస్తున్నా తగి నంత ఫలితాన్ని అందుకోలేక అప్పుల పాల య్యాడు. తన వాళ్ళన్నా తన చావుతో బాగుపడ్తారని ముష్టిచెక్కా, బెల్లం తిని చని పోదామనుకుంటే అక్కడ కూడా విధి పగ బూనింది. హఠాన్మరణమే కానీ ఆత్మహత్య కాదని అధికారులు చావు కబురు చల్లగా బాలకృష్ణకు చెప్పి మొండిచెయ్యి చూపారు.

కష్టాలు వచ్చినప్పుడే ఆప్తులెవరన్నది తెలుస్తుందనేది అక్షర సత్యం. తండ్రి మర ణంతో బిడ్డనిస్తామన్న మేనమామ మొగం చాటేశాడు. అయినా ఆశ చావక మేన మామ ఊరికి వెళ్తే అక్కడా నిరాశ ఎదుర యింది. అప్పుడు బాలకృష్ణ పడిన వేదన వర్ణనాతీతం. ఇక్కడ ఉండి చేసేది ఏమీ లేదని అమ్మను, అక్కను ఒప్పించి కువైట్‌కు బయలుదేరితే అక్కడ కూడా ఎదురుదెబ్బే. వీసా ఇచ్చేవాడు మోసం చేశాడని ఎలా అయినా ఉద్యోగం సంపాదించి కాని మనూ రికి రాను అని బాలకృష్ణ తల్లికి ఉత్తరం రాస్తాడు. రమణమ్మకు ఆ ఉత్తరం చదివి గుండె చెరువవుతుంది. ఎలా అయినా నీకు టిక్కెట్టుకు డబ్బులు పంపుతాను వచ్చేయ మని ఉత్తరం వ్రాస్తుంది. కొత్త క్యాలండ రులో పాత అప్పులన్నీ రాసి జీవిత పోరా టానికి సిద్ధమవుతున్న రమణమ్మను చూస్తే ఎవరి గుండెనైనా నీరు అవకమానదు. రైత న్నల కన్నీటి వ్యథలు ఎవరు వింటారు? విన్నా ఎవరు ఆదుకుంటారు? విధివంచితు లైన రైతన్నలకు భవిష్యత్తు ఆశాజనకంగా ఉంటుందని ఆశిద్దాం.

-ఎన్.వి. లక్ష్మి, ఒంగోలు

## మానవ జీవిత చిత్రణ (నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

"నీరు-నేలా-మనిషి" రైతు జీవిత చిత్ర ణగా అనిపిస్తున్నా అందులో మానవ జీవిత మహా చిత్రణ కూడా వుంది. నవల మొద ట్లో, "రెండు లక్షలా ముప్ఫైవేలు" అని రామచంద్ర రాసుకున్న అప్పుల పట్టిక లెక్కలు, నవల చివర్లో "మూడు లక్షలా యాభై ఎనిమిదివేలు" అవుతుంది.

దిగజార్చుతున్న పరిస్థితులు తల్చుకుని, అప్పులు ఎలా తీర్చాలా అని కుంగిపోయి, పరువు పోతుందేమో అంటూ బతుకు బరువు చేసుకున్నాడు రామచంద్ర. గదిలో పెట్టి కొట్టిన పిల్లి మోస్తరుగా పడిన కష్టా లకు ఎదురుతిరిగి నిలిచింది రమణమ్మ. ఆమె కువైట్‌లో ఉన్న కొడుక్కి రాసిన ఉత్తరం నవలకే హైలైట్. ఒక్కొక్క వాక్యం ఒక్కొక్క జీవిత సత్యం. ఉదా॥ 1. అవసరం వచ్చినప్పుడు పొరకలాడకపోతే ఎట్ల; పరువు పరువు అనుకుంటే బతకలేము. (పిరికి తనం వదలమని) 2. తెగించినోన్ని ఎవరూ ఏం చెయ్యలేరని అర్థమైంది. (ధైర్యం చెప్పింది), 3. బోరేద్దాం, నీళ్ళు పడ తాయి; పంటలు పెడదాం; ఇంటికి వచ్చేయ్ (ఆశ నూరిపోసింది) ఎంతో ఆశతో మంచి భవిష్యత్తు చూపించింది.

శారద పాత్ర ఆడపిల్లలందరికీ ప్రతినిధి. పుట్టింటి మంచిని కోరుతూ చేతనైనంత

శ్రమిస్తూ, గడిపింది.

విదేశాలకు పంపే ఏజంట్ల మోసాలు, చిక్కుకున్న వారి కష్టాలు, ఎలక్ట్రిసిటీ ఎంత ప్రాణాధారమో, (దాన్ని మనం పప్పురుబ్బటానికి, గుడ్డలుతకడానికి కూడ ఉపయోగిస్తున్నాం.) రైతు ఎంత శ్రమకు, అప్పులకు గురై మనకు అన్నం పెడుతున్నాడో; ప్రభుత్వం రైతుల ఆత్మహత్యలకు చేసే ధన సహాయం ఎలా గాలికి పోతుందో వివరంగా తెలియచేసింది. ఆశోపహతుడైన రామచంద్రకి విషం అక్కర లేకుండానే ప్రాణం పోయింది. నీరూ నేలా మనిషి జీవితాన్ని ఎంత ప్రభావితం చేస్తున్నాయో, మనం నీటిని, ఎలక్ట్రిసిటీని, ఎంత జాగ్రత్తగా వాడాలో ఈ నవల తెలియచేస్తుంది.

**–ఎ.లక్ష్మీగోపాలమ్, హైదరాబాద్.**

## మూలాల్ని పట్టుకోలేదు *(ఐదవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

సాహిత్యం సమాజానికి దర్పణం లాంటిదంటారు. సమాజాన్ని ఉన్నదున్నట్టుగా చిత్రీకరిస్తే అది ఉత్తమ సాహిత్యం అనిపించుకోదు. సామాజిక రుగ్మతలకు, ప్రజల కడగండ్లకు మూలాలను బయటపెట్టాలి. అలాంటప్పుడే పాఠకుడు చైతన్యవంతమవుతాడు.

సుంకోజి దేవేంద్రాచారి 'నీరు, నేలా, మనిషి' కేవలం రాయలసీమ రైతుల కడగండ్లను బయట పెట్టిందే తప్ప, 1990 తర్వాత యే పార్టీ ప్రభుత్వమున్నా రైతాంగం ఎందుకు ఆత్మహత్యలు చేసుకోవల్సి వచ్చింది? వ్యవసాయం ఎందుకు గిట్టుబాటు కాని రంగంగా మారింది? చూచాయగానైనా చెప్పలేకపోయాడు. ఇలాంటి కథలు అనంతపురం జిల్లా రచయితల నుండి యెన్నో వచ్చాయి కూడా. నవల మొదట్లో బిగువుగా సాగినా, రామచంద్ర మరణంతో ముగించివుంటే బాగుండేది. ఆ తర్వాత బాలకృష్ణ బతుకు తెరువుకై గల్ఫ్ దేశాలకు వెళ్ళి మోసపోవడం అనవసరమైన కొనసాగింపు మాత్రమే. ముగింపు మాత్రం కొంత ప్రగతిశీలంగా ఉంది. రామచంద్రం, బాలకృష్ణల నిరాశవాదం నుండి రమణమ్మ ఆశావాదం, వ్యవసాయం కొనసాగింపు రైతాంగం భూమిని నమ్ముకొనక తప్పదనే వాస్తవాన్ని తెల్పుతోంది.

పల్లెటూరి రైతాంగపు జీవితానికి భిన్నంగా కొన్ని పంక్తులున్నాయి. "పది ఎకరాల లోపు పొలమున్న రైతు సేద్యానికై ట్రాక్టర్లను నమ్ముకోవడం, పల్లెటూరివాళ్ళు జనవరి ఒకటి పండుగగా జరుపుకోవడం, టూత్‌పేస్ట్‌తో పండ్లను తోమడం లాంటివి... అసహజంగా కన్పిస్తాయి. ఏమైనా వాస్తవ పరిస్థితులను, అందరికీ తెల్సినవి, నిత్యం దినపత్రికలలో చూస్తున్నవి రచయత తెల్పాడే తప్ప "వాస్తవం వెనుకనున్న సత్యాన్ని" (ఈ వ్యవస్థ యొక్క సహజ స్వభావాన్ని) విశ్లేషించలేకపోయాడు. నవల చదివాక పాఠకుణ్ణి కొంతసేపు అంతర్మథనానికి గురిచేయాలి, ఆలోచింపచేయాలి. ఈ కోణంలో రచయిత వైఫల్యం చెందినట్టేనని చెప్పవచ్చు

**–ఎన్.సోమశేఖరశర్మ,** కర్నూలు.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2476685; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 277438; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net



## ముత్యాలు కాని ముత్యాలు!

ఇవి ఏ జంతువులో, పక్షులో పెట్టిన గుడ్లు కావు. గుహల అంతర్భాగాల్లో పోత పోసుకున్న ముత్యాలు. గుహల లోతట్టున స్రవించే నీరు, కార్బన్ డై ఆక్సైడ్‌ను కోల్పోయి భూమిని తాకి కాల్సైట్‌గా ఘనీభవించినప్పుడు కలిగిన ఆకృతి ఇది. ఇసుక రేణువు లేదా మరి దేని చుట్టూనో కాల్సైట్ సమతలంగా పేరుకుని ముత్యాలుగా రూపొందుతాయి. ఇవి చిన్న గింజ నుంచి గోల్ఫ్ బాల్ సైజు వరకు వివిధ పరిమాణాల్లో ఉంటాయి.

